The one and only Magazine devoted to Humour & Music

1 - 15 డిసెంబరు 2002

పేజీలు : 68 + 8

వెల : రూ. 10

# హాసం

హాస్య-సంగీత పత్రిక





24 నవంబరు 2002న చి॥సౌ॥ నవతతో సంగీత దర్శకుడు చక్రి వివాహం జరిగినసందర్భంగా అభినందించిన శ్రీయుతులు వంశీ, రామోజీరావు, ఆర్.పి.పట్నాయక్, దేవిశ్రీప్రసాద్, వందేమాతరం శ్రీనివాస్, జెమిని కిరణ్, పూరి జగన్నాథ్, తమ్మారెడ్డి భరద్వాజ్‌తో పాటు హాసం శుభాకాంక్షలను అందిస్తున్నది.

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# ఇవీ సంగతులు

29

# హాస్యం - సంగీతం







'సెంటర్ స్ప్రెడ్'లో - 'తొట్టిగ్యాంగ్' 'నిను చూడక నేనుండలేను' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: 'తొట్టిగ్యాంగ్' సినిమాలో గజాలా

16-30 నవంబరు సంచికలోని 'ఆ పాత/ట మధురం'లో ఈసారి విజయావారి దృశ్యకావ్యం, కళా 'పూర్ణం' -"మాయాబజార్" గురించీ, దానిలోని రసగుళికలవంటి పాటల గురించి వివరణాత్మకంగా రాశారు. ఇది ఒక ఎత్తయితే, వాటిని ప్రజెంట్ చేసిన తీరు మహత్తరంగావుంది. ముఖ్యంగా శీర్షిక ప్రారంభంలో అభిమన్యుడు -ఘటోత్కచుల మధ్య యుద్ధ సన్నివేశాన్ని ఐదు ఫ్రేముల మిక్సింగ్‌లో ప్రచురించి, దానిక్రింద టైటిల్ వేయడం చాలా బాగుంది. అలాగే పాటల బాక్స్‌లో ఆ పాట సన్నివేశం తాలూకు ఫోటోల్ని ఫ్రేమ్‌వైజ్ సీరీస్‌గా ప్రచురించి, పాఠకుడికి పుస్తకంలోనే ఆ చిత్రం చూస్తున్న అనుభూతిని కలిగించారు. ఇలాంటి వెరైటీ ప్రెజెంటేషన్ చేయాలంటే ఎంతో శ్రద్ధ, దానికి మించిన అభిరుచి ఉండాలి. రియల్లీ హ్యాట్సాఫ్! ప్లీజ్ కీపిటప్!!

ఈ మహత్తర చిత్రాన్ని తలుచుకున్నప్పుడల్లా నాకో తీపిజ్ఞాపకం కూడా మనసులో మెదులుతుంది. నా చిన్నతనంలో మా స్వగ్రామం ప్యాపర్రు(తెనాలి తాలూకా) ప్రక్కనే బోడపాడులో ఎవరిదో వివాహసందర్భంగా ననుకుంటా, నిర్వహించిన మహాగాయకులు శ్రీ ఘంటసాలగారి కచేరికి నన్ను మా నాన్నగారు(ప్రముఖకవి కీ॥శే॥ శ్రీ మునగపాటి విశ్వనాథశాస్త్రి ) తీసుకెళ్లారు. ఆ కచేరిలో -'దేవదాసు'లోని జగమే మాయా, అప్పుడు నిర్మాణంలో ఉన్న(ఆ సంగతి ఘంటసాల మాష్టారే కచేరిలో చెప్పారు) 'లవకుశ'లోని ఏ నిమిషానికి ఏమి జరుగునో, వగైరా సుమధుర గీతాలతో పాటు, స్వీయ సంగీత దర్శకత్వం అవటం చేత 'మాయాబజార్'లో మాధవపెద్ది సత్యంగారు అద్భుతంగా పాడిన 'వివాహభోజనంబు' పాట ఘంటసాల గారు మహాద్భుతంగా పాడి వినిపించారు. ఆ పాట ఆ అమరగాయకుని నోట వినటం మరుపురాని మధురానుభూతి! ఈనాడున్న టేప్‌రికార్డర్‌లాంటివి ఆనాడు సామాన్యులకు అందుబాటులో లేకపోవడంచేత, చిన్న వయసు అవటంచేత, ఆ జ్ఞాపకాలు మనసుపొరల్లో మాత్రమే మిగిలిపోయాయి. ఘంటసాలగారు అప్పట్లో కచేరీల్లో పాడుతుండే ఆ పాట మాస్టారి స్వర ఉపాసకుల్లో ఎవరి దగ్గరైనా ఉందేమో!

**-కార్టూనిస్ట్ ఎమ్మెస్ రామకృష్ణ,**
**హైదరాబాద్**

నవంబరు 1-15 సంచికలో ఆ పాత/ట మధురంలో 'చిరంజీవులు' చిత్రంలోని పాటల




వెనక ఉన్న వివరణ చాలా బాగుంది. మాఇంట్లో అందరికి ఇష్టమైన సినిమాల్లో చిరంజీవులు ఒకటి. అలాగే దాశరథి గురించి ఇచ్చిన సమాచారం చాలా బాగుంది.

**-కె.విజయరాఘవన్,**
**వరంగల్**

అల్లసాని పెద్దన మనుచరిత్రలో మహోన్నతమైన హిమగిరుల సౌందర్యం చూసి పులకించిన ప్రవరాఖ్యుని వలె, సినిమాలో చూడటం, రేడియోలో వినడం తప్ప ఎప్పుడు పత్రికా ముఖంగా చూడని "మాయాబజార్" పాటలు 16-30 నవంబరు సంచికలో చూసి మనసు ఆనందంలో పులకరించిపోయింది. వీలైనంతవరకు పాత సినిమాలలో అన్ని పాటలు ప్రచురించండి.

**-యామిని సరస్వతి**
**హైదరాబాద్**

'హాసం' ప్రతి 15 రోజులకు చదువుతున్నాను. సంగీత ప్రియులకు మంచి విషయాలు తెలియజేస్తున్నారు. పాటలు ఏ రాగంలో కూర్చారో తెలియజేస్తున్నారు. ముఖ్యంగా ఈసారి ఆకాశవాణి సంగీత సమ్మేళనం గురించి తెలియజేసారు. రామనారాయణగారి సంగీతసాధనం సారంగికచేరి విన్నాము. ఇలా పత్రిక ద్వారా తెలుసుకొనేట్లు చేసిన మీకు కృతజ్ఞతలు.

**-మోహనబాబు,**
**ఉప్పాల**

సదా ముఖచిత్రంతో వెలువడిన 'హాసం' పత్రిక ఆకర్షణీయంగా ఉంది. ఇందులో జోక్స్ బాగుంటున్నాయి. ఇవే కాకుండా సినిమా ప్రముఖుల అనుభవాలు ముచ్చటిస్తుంటే మా మనస్సు చాలా ఆనందోత్సాహాలతో నిండిపోతుంది. యువరత్న సినీ పాటలు మరియు మా అభిమాన పాటల రచయిత



**'మా మామయ్య ఘంటసాల' అనే మకుటం పై శ్రీమతి సావిత్రి ఘంటసాల తెలిపిన అనుభవాలు 'స్మృతి తరంగాలు' అనే పుస్తకంలోనివి. ఆ అనుభవాలను 'హాసం' పాఠకులకు అందించడానికి అనుమతినిచ్చిన శ్రీమతి సావిత్రి ఘంటసాల గారికి, శ్రీ ఘంటసాల రత్నకుమార్ గారికి, ఈ విషయంలో సహాయ సహకారాలను అందించిన డా॥కె.వి.రావు గారికి మనఃపూర్వక కృతజ్ఞతలు. -ఎడిటర్**

వెన్నెలకంటి పాటలు మాకు చాలా ఆనందాన్ని కలిగించింది. ఇంతటి చక్కని పత్రికను అందిస్తున్న మీకు మా అభినందనలు

**-బూర్లు నానాజీ,**
**పాలకొల్లు**

నేటి టీవీ సంస్కృతిలో, సీడీ జాడ్యంతో మొద్దుబారిన మన మెదళ్లకు కాస్త ఉత్సాహం, ఉత్తేజం, వినోదం, విజ్ఞానం ఇస్తూ మన కళ్లకు వరమై మనందరికీ పక్షానికోమారు ప్రత్యక్షం ఔతున్న 'హాసం' మనందరి సుమధుర 'దరహాసం' మన ఆంధ్రులందరి ప్రియనేస్తం!

**-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి**

వెళ్ళవయ్యా వెళ్ళు! అంటూ తనదైన శైలిలో నటించిన సదాగారి చిరునవ్వు ముఖచిత్రంగా 16-30 నవంబరు 2002 హాసం ఎంతో అలరించింది. గతం పాటలు ఆపాత మధురాలు! పాటశాల అంటూ ఇలవేల్పు పాటలు అందించారు. ఎంత చక్కని సాహిత్యము. లలిత సంగీతానికి ప్రత్యేక విలువ ఉంది భారతావని, రావోయి బంగారి మామ, నీతోటి రహస్య మొకటున్న దోయి అంటూ ఘంటసాలగారి గానం లలిత గీతాలకే ఓ మధురం. డా॥ ఆచార్య తిరుమల గారి విశేషాలు విజ్ఞానదాయకాలు! ఇందులో ప్రతి శీర్షిక చాలా ఆసక్తిగా సాగించి పాత కొత్తల కలయికగా యువరత్న ఖడ్గం పాటలు బాగున్నాయి. మాయాబజార్ పాటలు విశేషాలు అత్యంత మధురాలు! వెన్నెలకంటి గారి గీతాలు వెన్నెల సౌకుమార్యాలు.

**-ఎమ్.కె.వి.వి. సత్యనారాయణమూర్తి**
**తుని.**

సంపుటి : 2 సంచిక: 5

1-15 డిసెంబరు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

29

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

ఈ పక్షంలో కొంతమంది కర్నూలు వాసులు అమరగాయకుడు ఘంటసాల అభిమాన సమితి ఏర్పరచబోతున్నారు. ఆంధ్రదేశంలో ఇప్పటికే ఇటువంటి అభిమాన సంఘాలు ఎన్నో ఉన్నాయి. అయినా కొత్తవి స్థాపించడానికి అభిమానులు ముందుకు వస్తూనే ఉన్నారు - అదీ ఆయన భౌతికంగా మననుంచి వెళ్లిపోయిన మూడు దశాబ్దాల తర్వాత కూడా! ఆశ్చర్యంగా లేదూ!?

ఒక ప్రముఖ నటుడు లేదా నటీమణి టాప్‌లో ఉండగా వారిపేర అభిమాన సంఘాలు ఏర్పడడం సహజం. వాటిని చూసి ఆ నటీనటులు గర్విస్తారని, మరింత ఉత్సాహం పుంజుకుని నటన మెరుగుపరుచుకుంటారనీ, అభిమానులను ఆదరిస్తారనీ సంఘాలు ఏర్పాటు చేసేవారి ఉద్దేశం. కానీ ఘంటసాల విషయంలో ఆయన నుండి ఇక కొత్తపాటలు రావని మనకు తెలుసు, చూసి సంతోషించడానికి ఆయన లేరనీ తెలుసు. అయినా ఆయన అభిమానసంఘం పెట్టాలని ప్రజలు తహతహలాడుతున్నారంటే ఏమనుకోవాలి?

రిటైరయిన నటీనటులకు ఏర్పడని అభిమానసంఘాలు భౌతికంగా మన మధ్యలేని గాయకుడికి ఎందుకు ఏర్పడుతున్నాయంటారు? అందచందాలతో, రంగుల దుస్తులతో, నృత్యవిన్యాసాలతో చూడగానే మనను ఆకట్టుకోగలిగే తెరవేలుపులకంటె సాదాసీదాగా కనబడే గాయకులు మనకు ఎక్కువ చేరువ కాగలరా? ఎక్కువకాలం ఆకట్టుకోగలరా?

సంగీతంలో ఎక్కువకాలం మనగలిగే గుణం ఒకటున్నట్టుంది. జానపదగేయాలు ఎన్ని తరాలైనా బోరు కొట్టవు. అలాగే శాస్త్రీయసంగీతం కూడా - అనురక్తి కలిగితే, వందేళ్ల క్రితంనాటి శ్రోతలు వాటిని ఎలా ఎంజాయ్ చేశారో, ఇప్పుడు మనమూ అలాగే ఎంజాయ్ చేయగలుగుతాం. పాత సినిమాపాటల్లో వాయిద్యాలు తక్కువున్నాయని అనిపిస్తున్నా మెలోడీ విని ముగ్ధులవుతాం. ఆ పాట మరీ స్లో ఉన్నట్టుగా ఫీలవుతే, కనీసం రీమిక్స్ వెర్షన్‌లోనైనా ఎంజాయ్ చేస్తాం.

ఒక్కోసారి పాట విని ఏమేమో ఊహించుకుంటాం. తీరా తెరపై చూడబోతే చిత్రీకరణ మనకు నచ్చదు. గాయకుల స్థాయికి ఆ నటీనటుల స్థాయి ఏమాత్రం సరిపోదు. పాట విని వూరుకుంటే బాగుండేదే! అనిపిస్తుంది. 'ఎ' క్లాసు గీతకారులు, సంగీతకారులు 'బి', 'సి' గ్రేడు లెవెల్ సినిమాలకు పాటలు కూర్చిన సందర్భాలు అన్ని భాషల్లోనూ ఉన్నాయి. సినిమాలు ఫెయిలయినా పాటలు హిట్ అయిన ఉదాహరణలు కోకొల్లలు.

అందువల్ల ఇటీవల చాలాసార్లు పాటను విని ఆనందించి ఊరుకుంటున్నాం కానీ దాన్ని సినిమాలో చూసి తీరాలని అనిపించడం లేదు. ఈమధ్య "దిల్ చాహతా హై" లో "ఓ లడ్కీ హై కహాఀ" పాట హిట్ అయ్యింది. దాన్ని తెరమీద చూపించినప్పుడు పాత సినిమాల్లో దాన్ని ఎలా చిత్రీకరిస్తారో ప్యారడీ చేసి చూపించి ఈనాటి ప్రేక్షకులనుండి నవ్వులు రాబట్టారు. ఏతావాతా తేలుతున్నదేమిటంటే స్మృతిపథంలో మొహాలు చెరిగిపోతాయి, గొంతు నిలిచిపోతోంది. నటీనటులకు ఎక్కువ గ్లామర్ ఉంటుందని అప్పటికప్పడు మనకు అనిపించినా చిరకాలం నిలిచే గ్లామరు పాటదేనన్నమాట! అందానికి, వేషధారణకు నిర్వచనాలు మారుతున్నాయి కానీ మెలోడీకు నిర్వచనం మారటం లేదనిపిస్తోంది.

అందువల్లనే ఆనాడు ఘంటసాల పాడిన పాటల్లో మాధుర్యం శ్రోతలు ఈనాటికీ మరువలేకుండా ఉన్నారు. మళ్లీ, మళ్లీ గుర్తుకు చేసుకుని ఆనందించడానికీ సాటి అభిమానులను చేరదీస్తున్నారు. ఆయన పాటలకు శాశ్వతత్వం కలిగిస్తున్నారు. ఆయన్ని చిరంజీవి చేస్తున్నారు.

పాటల గురించి, వాటి సృష్టికర్తల గురించి చర్చించే "హాసం" వ్యాసాలు అన్ని తరాల వారినీ ఆకట్టుకోవడానికి కారణం - పాట పాతబడకపోవడమే అని అర్థమవుతోంది కదూ!

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# చింతకాయ పచ్చడి

# 'చిరాకు' దంపతులు

- నల్లబాటి రాఘవేంద్రరావు

"హలో... కృష్ణమూర్తా ... బాగున్నావా? పాత చింతకాయపచ్చడి రుచి అదిరిపోద్ది ... పంపమంటావా?"

"ఎవరు మాట్లాడేది?"

"నేనురా ... రామచంద్రపురం నుండి శివరామకృష్ణయ్యని మాట్లాడుతున్నాను ... మీ ఇంటి దగ్గర పనిచేసే ఆ పొడవాటి కుర్రాడు నూకరాజుని పంపు. అటకెక్కించి పచ్చడిజాడిదింపించి పాత చింతకాయ పచ్చడి నీకు పంపుతాను."



"వాడు నిన్ననే మానేసాడురా."

"ఏడ్చావ్ ... ఆ సంగతి ముందే చెప్పొచ్చుగా. ఫోన్ పెట్టెయ్ ... రూపాయి వేస్తూ..."

"మరి పచ్చడి ఎప్పుడు పంపుతావురా ... అసలు నాకు తెలియకుండా మీ ఇంట్లో ఆ పచ్చడి ఎట్లావుందీ అని ..."

"ఆపు నీ వెధవ అనుమానం ... నీకు తెలియకుండా ఉండబట్టే ఇన్నేళ్ళూ ఉంది . ఇదిగో ఎల్లుండి ... మా కొడుకులు, కోడళ్ళు ... కూతుళ్ళు, అల్లుళ్ళు ... వాళ్ళవాళ్ళ పిల్లలు జంటలతోసహా వస్తారు. అందరం తిన్నాక మిగిలితే పంపుతాలే, వింటున్నావా ..."

"మళ్ళీ ... ఏదో అరకాసులో తిరకాసు పెడ్తున్నావ్. వాళ్ళంతా వచ్చి రెండు నెలలేగా అయింది. ఇప్పుడెలా వస్తారు?"

"అదంతే, నాకు చూడాలనుంది. వాళ్ళంతా వచ్చితీర్తారు. పావులు కదుపు తున్నాగా."

***

"వెన్నెల్లో పిండారబోసినట్లు
ఆపిండితో చేగోడీలు చేసుకుతిన్నట్లు
నీ ముఖం ఎంత 'కరకరలాడుతుంది'...
'సారీ'... కళకళ
లాడుతూంది ...!"

ఎలాగుంది నా కవిత్వం. లే... తెల్లవార బోతోంది.

కిర్రుకిర్రు కాలిచెప్పుల్లా ... కిసుక్కున నవ్వే నీ నవ్వు శబ్దం ...

టెంకలేని తాటిపండులా ... పళ్ళులేని నీ నోటి అందం...

ఓహ్ ...! భలే కుదరిందోయ్ కాత్యాయనీ... అసలు నే ఎన్ని కవితలు చదివినా నీకు మెలుకువరాదా?"

శివరామకృష్ణయ్య తన యవ్వనంలో కవిత్వంలో శ్రీకృష్ణదేవరాయలంత దిట్ట! అన్ని పత్రికలూ - అవి బ్రతికినన్నాళ్ళూ - అతని కవిత్వాలు ప్రచురించేవి - భార్య కాత్యాయని ఫోటోతోసహా! అతని కవిత్వగంధంలో కాస్తంత సుగంధం ఆమెకూ అంటుకుంది. దాంతో అప్పట్లో ఇద్దరి ఫోటోలతో కవిత్వాలు తరచూ ప్రచురితం అయ్యేవి. ఇది నాలుగు పుష్కరాలక్రితం మాట. అతనికిప్పుడు తొంభై! ... ఆమెకు పది తక్కువ!

"మనవాళ్ళందర్నీ మళ్ళీ చూడాలనుందా నీకు?"

"మీకు మాత్రం ఉండదా ... మీ ఆశ కాకపోతే వాళ్ళంతా మళ్ళీ ఎలా వస్తారిపుడు?

"రేపు వస్తారు ..."

"నాకు నమ్మకం లేదాయె ..."

"ముందు ... నువ్వు లే. కొంపదీసి నడుంగాని పట్టేసిందా మళ్ళీ?"

"నే చెప్తే విన్నారూ ... ఆ అటక మీద పాతచింతకాయ పచ్చడి జాడీ గురించి మీరు శ్రమపడటం కాకుండా నా చేత కూడా ఎక్సర్‌సైజులు చేయించారాయె. ఆ ముదనష్టపు జాడీ కాదుగానీ ఒళ్ళంతా ఒకటే నొప్పులు!" అంది కాత్యాయని నెమ్మదిగా లేస్తూ.

"అదిసరేగానీ ఎదురింటి అవతారం వచ్చాడా ..."

"ఖాళీ అయినపుడు వచ్చి అటక ఎక్కి చింతకాయపచ్చడి జాడీ దింపుతానని మాటిచ్చాడుగా. అతనికి 'అటకెక్కిన అవతారం' అనే బిరుదు కూడా ఇస్తానని నమ్మబలికారుగా."

"అన్నావూ, కోరిక తీరకుండా ఛస్తే దెయ్యాన్నై నిన్ను పీక్కుతింటానేమోనని..."

"ఇన్నాళ్లూ పీక్కుతిన్నది చాలదూ?"

"ఏం.. నేనేం... తక్కువ చేసాను?"

"నిజమే... పిల్లల్ని ఇంజనీర్లు చేశారు. కోడళ్ళు ఉద్యోగస్తులు. కూతుళ్ళని బ్యాంకు మేనేజర్లుగా చేశారు. బిజినెస్ మాగ్నెట్‌లని అల్లుళ్ళుగా తెచ్చుకున్నారు. మనవలంతా కంప్యూటర్ మనుషులయ్యారు. వాళ్ళ పెళ్ళాలూ జాబ్‌హోల్డర్సే! నేను మాత్రం ఇలాగే ఉన్నాను - చిన్ననాటి ఒంటిరాయి పుడకని ముడురాళ్ళ పుడకగా మార్చుకుందామని పెళ్ళయిన దగ్గర్నుంచి అనుకుంటూ ..."

"దేనికైనా కాలం అనేది ఒకటుంటుంది ..."

"మరే నాకు తెలియదు సుమండీ ..."

"ఆ వెటకారం ఏంటి?"

"మీ ఆశలన్నీ త్వరత్వరగా తీరిపోవాలా ... లేకపోతే దెయ్యమై పీక్కుతింటారా ... నేను కోరుకునే వాటికి మాత్రం కాలం అనేది ఒకటుంటుందా..." అంది సరదాగా దెబ్బలాడుతూ.

శివరామకృష్ణయ్య సంతానం, వాళ్ళవాళ్ళ సంతానం అందరూ జంటలయ్యారు. జంటనగర వాసులూ అయ్యారు. అందరివీ జెట్‌విమానంలా క్షణం తీరికలేని ఐదంకెల జీతాల ఉద్యోగాలే! ఎ.సి. బ్రతుకులు. వాళ్ళందరికీ శివరామకృష్ణయ్య దంపతులంటే అభిమానమే!

"నువ్వు చెప్పు కాత్యాయనీ నీ పుట్టింటి దగ్గర్నుండి 60 ఏళ్ళ క్రితం తెచ్చుకున్న ఆ నల్లకావడి పెట్టె దెయ్యంలా ఉందీ ... అమ్మేస్తానూ అంటే ఒప్పుకున్నావూ ... అలాగే నేనూను. అలవాటు పడిపోయిన బి.సి. (బ్రహ్మాండమైన, చక్కని) బ్రతుకు వదలి ... ఆ ఎ.సి. (అలవాటు కాని క్లాస్) బ్రతుకులోకి వెళ్ళి ఇమడలేను." అని అంటుంటాడు. ఇది అతని అభిప్రాయం.

ఇలా ఆ పల్లెటూళ్ళో శివరామకృష్ణయ్య దంపతులు పాత జ్ఞాపకాల భవంతిలో జంటగువ్వల్లా కాలం గడిపేస్తున్నారు. అదే వారికిష్టంగా ఉంది. ఎవరురమ్మన్నా వెళ్లరు. వెళ్ళినా ఉండలేరు.

"ముక్కుపుడకేగా... చేయిస్తాను. ఆ మూలన టీపాయ్ మీద టాబ్లెట్స్ ఉన్నాయి ఇస్తావూ."

"ఏం...నేను బలంగా వున్నాననా. మీ ముక్కుపుడకొక దండం ... నా టాబ్లెట్స్ బాక్సు ముందు మీరు తెచ్చి ఇస్తే రెండు బిళ్ళలు మింగి మీ టాబ్లెట్స్ తెచ్చి ఇవ్వగలను."

"మా అమ్మ పెళ్ళిరోజే అన్నది ... 'ఈ అమ్మాయి వాలకం చూస్తుంటే నీ వార్ధక్యంలో నిన్ను సుఖపెట్టేలా లేదురా' అని ...! అన్నంతపనీ అయ్యింది. పోనీ ఆ మూలనున్న చేతికర్ర తెచ్చి ఇస్తావూ సహాయానికి"

"సింహద్వారం ప్రక్కన నా చేతికర్రావుంది. అది కాస్తా మీరు తెచ్చిస్తే ... ఆ మూడుకాళ్ళతో వెళ్ళి మీ మూడోకాలు తెచ్చివ్వగలను. ఎలాగోలా లేచి 'టీ' కాసిస్తాను. కాస్తంత గుటకేసి మీ పనులు మీరు చూసుకోండి."

"నీకేం తెలుసు జీవితమంటే ... దాన్ని కాచివడబోసిన వాడిని."

" రోజూ టీ, కాఫీలు నేను కాచివడబోస్తూనే ఉన్నాను. మీకన్నా ఏం తక్కువ కాదు."

"నీ సతాయింపు ఆపి కావలసిన కార్యం గురించి ఆలోచించరాదూ."

"మీరనేది అటకమీద పాతచింతకాయ పచ్చడి జాడీ విషయమేనా? ... అసలు ఆ జాడీకి, మనవాళ్ళందరూ రావడానికీ దగ్గర సంబంధం ఏమిటీ అంట!"

"కథ క్లైమాక్సులో అర్థమవుద్ది."

అటకమీద ఉన్న పాత చింతకాయ పచ్చడి జాడీ కిందకు దించటం కోసం వారం రోజులుగా ప్రయత్నిస్తున్నారు ఆ వృద్ధ దంపతులు. పాతచింతకాయ పచ్చడి రుచి చూడొచ్చన్న ఆశతో పాలుపోసే పోతరాజు నిచ్చెన ఎక్కబోయి నిచ్చెన కాలేకాదు... తన కాలూ ఇరగ్గొట్టుకున్నాడు. బట్టలుతికే అప్పిగాడు అతికష్టం మీద అటక ఎక్కేసి 'తేలు కుట్టింది బాబోయ్' అని క్రింద పడ్డాడు. అతని నడుమూ విరిగింది. ఆ నడుము క్రిందపడ్డ తేలు నడుమూ విరిగింది.

చూసిచూసి ఓ రోజున వృద్ధులిద్దరూ జాడీ క్రిందకు దింపాలని తెగప్రయత్నం చేశారు. కుదరలేదు. ఒళ్ళు నొప్పులు మిగిలాయి!

ఇంతలోనే ఫోన్ 'రింగ్' అయింది. శివరామకృష్ణయ్య రిసీవర్ అందుకున్నాడు.

"హలో శివరామకృష్ణయ్యా, నేనురా కృష్ణమూర్తిని.అసలు అటకమీది పాతచింత కాయపచ్చడి జాడీకి, జంటనగరాల నుండి మీ 'పటాలం' అంతా దిగిరావడానికి 'లింకు' కనిపించటంలేదు. ఏమిటీ కథ ... సస్పెన్సా ... ?"

"సారీ ... ఇది శివరామకృష్ణయ్యగారి ఇల్లుకాదు. రాంగ్‌నంబర్ ..." రిసీవర్ క్రిందపెట్టేశాడు శివరామకృష్ణయ్య.

"పాయింటు 'లీకొ' చేద్దామని చూస్తున్నాడు ...నేను 'లీకొ' అవనిస్తానూ."

"ఇంతకీ ఎవరు ఫోను."

"ఎవడో ఏబ్రాసి కృష్ణమూర్తట!"

"అయ్యో అయ్యో... వరుసకు మా అన్నయ్యండి. ఆ పసలపూడి కృష్ణమూర్తి."

"పసలపూడో, చింతలపూడో, అనవసరమైన కూపీలు లాగాలనుకుంటే రాంగ్ నంబరే ..."

"సర్లేండి, నాకెందుకు ... ఇంతకీ ఆ జాడీలో చింతకాయపచ్చడి ఎప్పటిది?"

"మాతాతల కాలంలోది...ఏం( నువ్వు తినవా?"

"బావుంటుందంటారా?"

"బాగుంటేనే తింటావా?"

"ఏం లేదు ఖాళీజాడీ ఇస్తే ఏ ఉప్పో

## కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్



**కట్ అయినా రక్తం చిమ్మనిది?**

**టెలిఫోన్**



**1975** నుండి కలం పట్టిన నేను రమారమి 200 చిన్న పెద్ద కథలు- నాటికలు- నాటకాలు- స్కెచ్‌లు ప్రసారం ప్రచురణ ద్వారా వెలుగు చూసాను.

నా కథలకు ప్రేరణ నా గురు ద్రోణాచార్యులు 'చలం'గారు. నాచేత బల వంతంగా కలం పట్టించి సాహిత్య రాజ్య రంగంలోకి విసిరింది ప్రఖ్యాత సినీ దర్శకులు-నా ప్రియ స్నేహితులు 'వంశీ'... నాకన్నా వయసులో చిన్న అయినా నా గురుతుల్యుడే! మిగిలిన సాహిత్య మహామహుల గురించి మాట్లాడే అర్హత నాకు లేదు.

రామచంద్రాపురం (తూ.గో.) లో రెండున్నర దశాబ్దాలుగా శ్రీ సీతారామ న్యూ ఫ్యాన్సీ బిజినెస్ నిర్వహిస్తున్న నాకు భార్య (గోవిందీశ్వరి), బాబు (వెంకట రామకృష్ణ), పాప (సౌభాగ్య)

హాస్యం బ్రతికున్నన్నాళ్ళూ.... మంచి కథలు బ్రతుకుతాయని "హాసం" నిరూపించగలదని భావిస్తూ ధన్యవాదాలు తెలియజేసు కుంటున్నాను.


**నల్లబాటి రాఘవేంద్రరావు**
**15-1-72, మెయిన్‌రోడ్,**
**రామచంద్రపురం.**


పోసుకుందామనీ."

"అది సరేగానీ కాత్యాయనీ, మనిద్దరం మోడ్రన్‌డ్రస్‌లో ఫోటో దిగటం గురించి ఏమాలోచించావ్?"

"ముందు చింతకాయపచ్చడి జాడీ అన్నారు - ఇప్పుడు మోడ్రన్‌డ్రస్ ఫోటో అంటున్నారు చిన్నపిల్లాడిలా ఏమిటీ కోరికలు. నేను రెడీ అనుకోండి ... కానీ మీరైతే పౌడరు పూసు కుంటారు - పళ్ళు తగిలించుకుంటారు. జోళ్ళు తుడుచుకుంటారు. తెల్లవెంట్రుకలకు నల్లపెన్సిల్ రుద్దుతారు. నాదేం పోద్దిగనుక. ఫోటోలో నేను ముసల్దానిగా పడి, మీరు పడుచుకుర్రాడిలా పడితే చూసినవాళ్ళు నవ్విపోరూ."

"దాన్దేముంది నిన్ను పనిమనిషి తల్లివని చెప్తాన్లే."

"పనిమనిషి తల్లితో ఫోటో తీయించు కున్నవాళ్ళని ఏమంటారో తెలుసా?" అంది కాత్యాయని మూతి ముప్పైఆరు వంకర్లు తిప్పుతూ.

శివరామకృష్ణయ్య అటకమీద పాత ట్రంకు పెట్టెలో దాచిన పాతమోడల్ బట్టలతో ఫోటో తీయించుకోవాలని ఆశ పెట్టుకున్నాడు. ఎవరైనా అటక ఎక్కితే ఆ పెట్టెని దించుకోవచ్చని అతని ఉద్దేశం. అది దృష్టిలో పెట్టుకునే తన ఫ్రెండు 'అబ్బిరాజు స్టూడియోలో' పురమాయించాడు... చాకులా బాగా పొడుగ్గా ఉండి, ఫోటోలు బాగా తీసేవాడిని పంపమని!

ఆ అబ్బాయి వచ్చే టైమయింది. అతను వచ్చాక ఎలాగోలా ఒప్పించి ముందు అటక ఎక్కించి ఈశాన్యం మూలన దాచిన ట్రంకుపెట్టె తీయించి అందులో దాచిపెట్టిన పొడుగు ఫాంటు, కురచ కాలరు షర్టూ తనేసుకొని; తనకు పెళ్ళయిన కొత్తలో కాత్యాయని వేసుకొని వదిలేసిన లంగాఓణీ, బుట్టచేతుల జాకెట్టు ఆమెచే ధరింపచేసి సరదాగా ఫోటో తీయించుకొని రోజూ దాన్ని చూసుకుంటూ పాత జ్ఞాపకాల ఆనందాన్ని అనుభవించాలని ... అదో చిలిపి కోరిక శివరామ కృష్ణయ్యది. ఫోటో 'సీక్రెట్'గా ఉంచుతాను అని శివరామ కృష్ణయ్య మాట ఇవ్వటంతో తనూ రెడీయే అంది కాత్యాయని. పైకి మాత్రం భర్త కోరిక తీర్చలేని ఆడదానిగా ముద్రపడటం తనకు ఇష్టం లేదంది.

శివరామకృష్ణయ్య స్నానం ముగించి వచ్చేసరికి అబ్బిరాజు పంపిన ఫోటో అబ్బాయి వీధిలో రెడీగా ఉన్నాడు.

"నిన్నేనా మా అబ్బిరాజు గాడు పంపింది... నీ పేరేంటి?"

"సత్తిపండు"

"మామిడి పండు, వెలగ పండు, అరటి పండు... మరి ... సత్తిపండు? ఏ చెట్టుకు పండుద్దబ్బాయి? కొందరు పెద్దవాళ్ళకి బుద్ధులుండవ్ అనడానికి ఇదే సాక్ష్యం. ఆలోచించి పెట్టాలి పేరు. 'ఆనందం' అనో 'సంతోషం' అనో పెట్టొచ్చుగా. సరే... మా అబ్బిరాజుగాడు... అదేనయ్యా ఆ వెధవ ఏమవుతాడేంటి నీకు?"

"మీ వెధవాండీ ... నాకు గురువవుతాడండి."

"అయ్యో, అయ్యో నువ్వుకూడా వెధవ ... అని అంటావేంటి? గౌరవం లేకుండా"

"అలాగంటేనే కాని మీకు అర్థం అవ్వదేమోనని..."

"ఏం చెప్పాడేంటి ఆ అప్రాచ్యుడు నీకు."

"మీరు చెప్పినట్టు నన్ను వినమన్నాడండి."

"అద్గదీ ... నే చెప్పేలే వాడికి ... నీ చేతికి పాతచింతకాయ పచ్చడి ఇచ్చి పంపిస్తానని. ఆ వెధవ చింతకాయ పచ్చడి పెడతానూ అంటే పెళ్ళాన్ని కూడా అమ్మేస్తాడు. అంతిష్టం వాడికి. ముందు ఆ ఎత్తుపీట మీద ఈ మొక్కలపీట వేసుకొని అటక ఎక్కుతావూ ..."

"మొక్కలపీటో ... ముక్కాలపీటో ... వచ్చాక చేయక ఛస్తానా ..."

"ఏమిటి గొణుక్కుంటున్నావూ ... ముందు ఆ జాడీ క్రిందకు దించుతావూ. బాగా ఘుమఘుమగా ఉంటుంది. నీకు ఓ ఉగ్గిన్నుడు పెడతాలే."

అంతే ఆ అబ్బాయి ఎత్తుపీట మీద చిన్నపీట వేసుకొని 'జంప్' చేసి అటక ఎక్కేశాడు. బేట్రీలైటు

**కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**



**బాధని దాచుకున్న కాయ?**

**చింతకాయ**

సహాయంతో జాడీ వెదికాడు. అదెక్కడా కనబడలేదు.

"సత్తి పండూ మా ఎదురింటి అవతారంకి అదృష్టం లేదు. అతని కిద్దామను కున్నాను 'అటకెక్కిన అవతారం' అనే బిరుదు. ఇప్పుడు నీకిస్తున్నాను 'అటకెక్కిన సత్తిపండు' బిరుదు ... అందుకో. పచ్చడి సువాసన మధురంగా ఉందా? తొందరపడి నోట్లో వేసుకోకే. క్రిందకు దించాక నీకూ కొంచెం పెడతానని మాటిచ్చాగా." అంటూ క్రిందనుండి శివ రామ కృష్ణయ్య డైరెక్షన్ ఇస్తున్నా జాడీజాడ తెలుసుకోలేక పోయాడు సత్తిపండు.

"సరే, పచ్చడి అంతా ఎలుకలు తినేసుంటా యేమో ..." శివ రామ కృష్ణయ్య తనే సర్ది చెప్పాడు.

"అవునుగానీ, జాడీని కూడా ఎలుకలు తినేసుంటాయంటారా "అంది కాత్యాయని లోపల్నుండి వస్తూ.

"హైటెక్‌యుగం...ఎలుకలు తినేసినా తినేసి ఉండొచ్చు. సత్తిపండూ జాడీ తీరిగ్గా వెతికించి మరీ తీరిగ్గా పచ్చడి పంపుతానని మీ గురువుకి చెప్పు. ఎలాగూ ఎక్కావుగా చిన్నపని చేసిపెడుదూ...ఆ తూర్పు మూలన ఈశాన్యం వైపు తిరుగూ ... ఆc ... అటే ... కొంచెం దూరంగా చూడు ... దెయ్యంలా నల్ల ట్రంకుపెట్టె కనిపించటంలేదూ అది లా క్కొచ్చేయ్."

"ఆ ... అలాగే సార్..." అంటూ అతి కష్టం మీద సత్తిపండు ఆ పెట్టెతోసహా అటక దిగాడు. "పాతచింతకాయ పచ్చడి ... అటక ... అటక అంటూ పైకెక్కించారు. చివరకు పాతట్రంకు పెట్టెతో దింపించారు." చిరాకు పడ్డాడు ఫోటో సత్తిపండు.

"మాలాంటి పెద్దోళ్ళని నీలాంటి కుర్రకుంక లందరూ ఇలాగే విసుక్కుంటారు ముందు. కథ అర్థమయ్యాక సాష్టాంగదండాలు పెడతారు ... గోచి పెట్టుకోవటం తెలియని కూర్మాపురం కుర్రోడిలాంటోడివి. నీకసలే అర్థం కాదు."

చివరికి శివరామకృష్ణయ్య దంపతులు పాత బట్టలు వేసుకొని రెడీ అయ్యారు. సత్తిపండుకి చాలా చిరాకు వేసింది వాళ్ళ 'డ్రస్' చూసి. తన గురువు ఆ ఫోటోతీస్తే కోప్పడతాడేమోనని అనుమానించాడు. శివరామకృష్ణయ్యకు అతని పరిస్థితి అర్థమైంది.

"చూడు సత్తిపండూ ఈ ఫోటో చాల సీక్రెట్! నీకూ, నాకూ, మా ఆవిడకు తప్పించి ఏడోకంటికి తెలియకూడదు ... ఇంకోమాట ... జాగ్రత్తగా విను ... మీ ప్రక్కవీధిలో 'శ్రీ ఆంధ్రాపేపరు' ఎడిటర్, ... అతను మీ గురువుకీ, నాకు ప్రాణ స్నేహితుడు. 'శ్రీ ఆంధ్రాపేపరు' నీకు తెలుసుగా. ఆంధ్రా అంతా గొప్ప సర్క్యులేషన్ పత్రిక అదే. ఆ పత్రిక ఎడిటర్‌కి మాత్రం ఈ ఫోటో నువ్వు చచ్చినా కనబడనివ్వకే."

"మళ్ళీ ఇంకోమలుపు తిప్పారు సారూ... బుర్ర పగిలిపోతోంది..."అన్నాడు సత్తిపండు.

"వస్తున్నా వస్తున్నా పాయింటు కరెక్టుగానే ఉంది. నోట్లో వేలు పెట్టుకొనే యానాం ఎదుర్లంక టైపు కుర్రాడివి నువ్వు ... అందుకే నీకేం అర్థమవ్వటం లేదు.

అసలు విషయం ఏమిటంటే ఆ ఎడిటర్ ఇలాంటి గమ్మత్తయిన ఫోటోలు సేకరించి తన పేపర్లో 'తీపిగుర్తు' శీర్షికలో వేస్తుంటాడు. ఫోటో ఇచ్చినవాళ్ళకి 'వెయ్యి రూపాయలు'.... వినబడుతుందా 'అక్షరాల వెయ్యిరూపాయలు' బహుమతి ఇస్తుంటాడు. ఆ ఎడిటర్ ఆవిధంగా సర్క్యులేషన్ పెంచేసు కుంటున్నాడు ... వింటున్నావా ... ఇదో గొప్ప బిజినెస్ టెక్నిక్ ... నీకు తెలియటం కష్టంలే... నిడదవోలులో గేదెల పాలు పితికే కుర్రాడి వయసు నీది."

"ఏంటీ... ఫోటోఇస్తేవెయ్యి రూపాయలిస్తాడా." ఆశ్చర్యంగా అడిగాడు సత్తిపండు.

"ఆ వెయ్యి కొట్టేయాలను కుంటున్నావా? నీ ముఖం వాలకం చూస్తుంటే అలాగే చేస్తావని పిస్తుంది. ఏదీ అలాంటి ఉద్దేశం నీకేకోశానా లేదని నా కళ్ళలోకి చూసి చెపుతావూ."

"అబ్బే అలా నేనెందుకు చేస్తానండి? చచ్చినా చేయను."

"చచ్చేక నువ్వేం చేస్తావు. చేసేదేమయినా ఉంటే బ్రతికుండగానే చెయ్యాలి. నిన్ను చూస్తుంటే ఖచ్చితంగా తు.చ. తప్పకుండా నే చెప్పేసినట్టే చేసేసి ఆ వెయ్యి కొట్టేస్తావని నాకనిపిస్తుంది. సత్తిపండూ ఫోటో ఎడిటర్‌కిచ్చినా ఫర్వాలేదు. ఈ ఫోటో 'చిరాకు దంపతులదని' చెప్పకే."

"చిరాకు దంపతులంటే ? ..." అమాయకంగా అడిగాడు సత్తిపండు.

"అదోపెద్ద ఫ్లాష్‌బాక్... నా పేరు షార్టుకట్టులో 'శి.రా.కృ.' ఆ పేరే నా కవితా ఖండికలలో 'శ్రీ ఆంధ్రా పేపరతను తరచూ వేసేవాడు. రానురాను నీలాంటి నోరు తిరగని కాకిముక్కు ముఖం వెధవలవల్ల నా అందమైన పేరు కాస్తా 'చి.రా.కు ... చిరాకు దంపతులుగా' రూపం మారి పోయి పెద్దప్రాచుర్యం పొందింది. ఇదంతా ఆ ఎడిటర్‌కి గుర్తుచేసి ... మా ఫోటో అతనికిచ్చి వెయ్యిరూపాయలు కొట్టేద్దామని నువ్వు ఖచ్చితంగా నీ మనసులో తీర్మానం చేసుకున్నట్టున్నావు. బాబ్బాబూ ... అలా చేయకే..." శివ రామకృష్ణయ్య బ్రతిమలాడాడు.

'మీ పరువు నేనెందుకు తీస్తాను సార్. ఈ ఫోటోలో మీ తీపి, చేదు, కారం, పులుపు వగైరాలు 'గుర్తని' నాకూ తెలుసుగా ...'

'అమ్మయ్య ...అన్నట్టు సత్తిపండూ అసలు ఆ ఎడిటర్ నీకు తెలుసా ...?'

"తెలుసండీ, వెంకటరామకృష్ణ గారు. వాడ్రేవువారి వీధి, డోర్‌నెంబరు 14-1-12. మా ఇంటి ప్రక్కనే. ప్రతిరోజూ తెల్లవార కుండానే కబుర్లాడుకుంటూ చెరో చెంబునీళ్లతో ఊరవతల ద్రాక్షారామ మైలు రాయి దగ్గరకు కలిసే వెళ్తాం ... ఆయనా నేను."

"అతను ఫోటో ఎవరికీ ఇవ్వనంటున్నాడు కదా పాపం. టైము వేస్టు. ఇదిగో నేను లంగా, ఓణి ..బుట్టచేతులు జాకెట్టు వేసుకున్నాను. మీరు కూడా

**కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్**



కాయల్లోను,పండ్లలోను దొరకని పిక్క?

**సొంటి పిక్క**

పొడుగు గొట్టం ఫొంటూషర్టూ వేసుకున్నారాయే. పాత జ్ఞాపకాలు ముసిరేస్తున్నాయి... ఫోటో అబ్బాయి తొందరగా సిచ్చు నొక్కు నాయనా" కంగారు పెట్టింది కాత్యాయని. సత్తి పండు పరమ చిరాకు చెత్తఫోజుతో ఫోటో తీసి వెళ్ళబోయి వెనక్కు వచ్చాడు.

"అన్నట్టు చిరాకుగారూ, మరచి పోయాను. ఆ ఎడిటర్ గార్కి మీ ఫోటో ఇస్తే ఎంతి స్తాడన్నారూ..?"

"వెయ్యిరూపాయలు తక్కువ కాకుండా ఇస్తాడు. డిమాండు చేస్తే, రెండువేలు గిట్టొచ్చు. అతనికి లాభం ఏమిటంటే ... సర్క్యులేషన్ పెరగడమే కాదు ... 'ఫోటో అవార్డు' రావచ్చు! ఏమిటీ ... ఇంతకీ నువ్వు ఇదే ప్లానులో ఉన్నావా..."

"మీరు నిశ్చింతగావుండండి చిరాకుగారూ. నేను పసలపూడి పెర్ఫెక్ట్ పడుచుకుర్రాడి లాంటివాడిని. ఇప్పుడు మీరు నాకు చెప్పిన దంతా మరచిపోయూ ననుకోండి. ఆ ఫోటో, ఆ ఎడిటర్, ఆ రెండు వేలూ అంతా మాయ, ఒక కల!" అంటూ వెళ్ళిపోయాడు సత్తిపండు.

***

ఆ మర్నాడు... ఫోన్ మోగింది. రిసీవర్ అందుకున్నాడు శివరామకృష్ణయ్య.

"అవతలున్నది 'చిరాకు' గాడేనా "

"అవును శివరామ కృష్ణయ్యనే, మాట్లాడేది కృష్ణమూర్తే అని గుర్తుపట్టాను కూడా."

"నువ్వేసేది కాకుండా మా చెల్లెమ్మ చేతకూడా వెధవ వేషాలు వేయిస్తున్నావన్నమాట. ఇప్పుడే పేపరు చూశాను. ఛీ ఛీ .. ఉండు వచ్చి డైరెక్టుగా తిడతాను. నువ్వేమీ నాకు చెప్పమాకు. ఫోను పెట్టేస్తున్నాను" అవతలి వ్యక్తి రిసీవర్ పెట్టేశాడు.

సాయంత్రం వరకు నిమిషం సంవత్సరం గా గడిపారు వాళ్ళిద్దరూ. సాయంత్రం అయ్యింది. రెండు మూడు మారుతీకారులు స్పీడుగా వచ్చి శివరామకృష్ణయ్య ఇంటిముందు ఆగాయి.

ఆ కార్లలోంచి తన సంతానం, ఆ సంతానం యొక్క సంతానం అందరూ శ్రీ ఆంధ్రా న్యూస్ పేపర్లు చేత్తోపట్టుకొని దిగడం శివరామకృష్ణయ్య గమనించి 'సీన్' అర్థమైపోయి వీధిలో మెట్లమీదే కూర్చున్నాడు పరమానందంగా! అతని పక్కగా కాత్యాయని మహదానందంగా నిలబడివుంది. వచ్చినవాళ్లలో పెద్దవాళ్ళు ఆ దంపతుల దగ్గరకువచ్చి మండిపడినట్టు మాట్లాడారు. ఇలాంటి ఫోటోలు న్యూస్ పేపర్లలో పడటంవల్ల తమ పరువు పోతుందని ఇంకెపుడూ ఇలాంటి పని చేయొద్దని సాదాచీవాట్లు, సీదా వార్నింగులు లాంటివి కడుపునిండా పెట్టారు. వాటితోపాటు వాళ్ళందరూ తెచ్చిన స్వీట్లు, హాట్లూ పూర్తిగా తిన్నారు ఆ దంపతులు. వాళ్ళందర్నీ బాగా చూసుకొని, తనివితీరా ముద్దాడుకొన్నారు. రాత్రి గానుగ చెట్టుక్రింద వాలు కుర్చీలో కూర్చున్న ఆ దంపతుల దగ్గర శలవు తీసుకొని వచ్చిన మారుతీకారులన్నీ రైలు పెట్టెల్లా కదిలివెళ్ళి పోయాయి జంటనగరాల వైపు.

"మనం తిరగలేమని, తిరిగినా వీళ్ళంతా ఒకచోట కన్పించరని, వీళ్ళందర్నీ రప్పించడం కోసం ప్లాను వేసి మీ కోరిక తీర్చుకున్నారు. తనివితీరా చూసుకొని తాదాత్మ్యం పొందారు. రెండునెలల క్రితంవీళ్ళందరినీ చూడాలని ఆశపడి నాకు వంట్లో బాగా లేనట్టు నటింపజేసి వాళ్ళందరిని ఇలానే రప్పించారు. ఇప్పుడిది మీప్లానేనని నేను పసిగట్టాన్లెండి'' అంది కాత్యాయని.

"నువ్వు మాత్రం ... ఆ చిన్నపిల్లలతో ఆడుతూ ... ఆ పెద్దాళ్లతో తిరుగుతూ ఎంత ఆనందించావో నేను గమనించాను. ఇంతసేపు గుండె నిండా ఎంతో సంబరాన్ని నింపుకున్నావు. ఆనందమయ మైన ఈ క్షణాలు చాలు మనం మరో ఆర్నెల్లు ఉత్సాహంగా గడిపెయ్య డానికి... కాటికి కాలుచాపిన మనకు వీళ్ళందరి రాకతో మళ్ళీ యవ్వనం వచ్చేసి నట్టుంది కదూ!!!"

" ఇంతకీ అటకమీద ఆ పాతచింతకాయ పచ్చడి విషయం ఏం చేశారు..?"

"పాతబట్టల ట్రంకు పెట్టె అటకమీద ఉంది అటక ఎక్కండిరా' అని ఎవర్ని బ్రతిమలాడినా మన గోడు వినరు. అందుకనే అలా చెప్పాను. పాతచింత కాయపచ్చడి 'ఆశ' పెడితేనే కదా ఆ అబ్బిరాజు ఫోటో సత్తిపండుని పంపించింది. వాడొస్తేనే కదా అటకమీద ట్రంకుపెట్టె క్రిందకుదిగింది. ఆ ట్రంకుపెట్టె దిగితేనే కదా పాత బట్టలు తీసింది. పాతబట్టలు వేసుకుంటేనే కదా మనవాళ్లకి తిక్కరేగే ఫోటో వచ్చింది. ఆ ఫోటో వస్తేనేకదా పేపర్లో తీపిగుర్తు శీర్షికలో పడింది. పేపర్లో పడితేనే కదా ... అదిచూసి కోపమొచ్చి మన వాళ్లందరూ చీమలదండులా వచ్చింది. వాళ్ళు సరదాపడే ఫోటో అయితే ఇలా వస్తారా... చాలాకోపమొస్తేనే కదా... మనల్ని తిట్టడానికైనా వాళ్ళంతా వచ్చితీర్తారు. ఎలాగోలా వాళ్ళంతా రావడమే నాకు కావలసింది! వాళ్ళందర్నీ కళ్లనిండా మరోమారు చూసుకోవాలన్న నా ఆశ తీరింది."

"అందరూ ఒకచోట ఉంటే ఎంత ఆనందం! కాని ఎలా కుదుర్తుంది? ఈ కంప్యూటర్ యుగంలో బంధాలు, అనుబంధాలు కాల గమనంలో అటకెక్కు కుండా కుదురు తుందా?" భర్త వైపు నవ్వుతూ చూస్తూ అంది కాత్యాయని.

"అందుకనే మన అటకెక్కిన ఆనందాన్ని మరోమారు క్రిందకుదింపే ప్లాన్ సిద్ధం చేస్తున్నాను" అన్నాడు శివరామకృష్ణయ్య భార్యవైపు చిలిపిగా చూస్తూ.

"ఈసారి డైరెక్షన్ నాది" అంది కాత్యాయని.

'వృద్ధదంపతులిద్దరూ' నవ్వుకున్నారు ... మనసారా!!

## కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్



తినలేని, అరగించుకోలేని 'జామ్'?

ట్రాఫిక్ జామ్



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## క్షణమధునా నారాయణం

ప॥ క్షణమధునా నారాయణం
అనుగతమనుసర రాధే
చ॥ కిసలయ శయన తలేకురు కామిని
చరణ నళిన వినివేశం
తవపద పల్లవ వైరి పరాభవ
మిదమను భవతు సువేశం ॥
చ॥ అధర సుధారస ముపనయ భామిని
జీవ యమృత మివ దాసం
త్వ యి వినిహిత మనసం విరహానల
దగ్ధవ పుషమ విలాసం ॥
చ॥ శ్రీజయ దేవ భణితమిద మనుపద
నిగ దిత మధురిపు మోదం
జనయతు రసిక జనేషు మనోరమ
రతిరస భావ వినోదం ॥



| | |
|---|---|
| గానం, సంగీతం | : ఘంటసాల |
| రాగం | : ఘూర్జరితోడి (హిందుస్తాని సంగీతం) |
| తాళం | : ఆది (కర్ణాటక సం॥) కహరువా (హిందూస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ మ ద ని స |
| అవరోహణ | : స ని ద మ గ రి స |

- షడ్జము, శుద్ధ రిషభం, సాధారణ గాంధారం, ప్రతి మధ్యమం, శుద్ధ దైవతం, కాకవినిషాదం - ఈ రాగంలోని స్వరాలు.

హిందుస్తాని సంగీతంలోని పది సంపూర్ణ రాగాల (థాట్)లో రాగ్ తోడి ఒకటి. ఇదే కర్ణాటక సంగీతంలో 45వ మేళకర్తయగు శుభపంతురావళి రాగం. హిందుస్తానిలో తోడి సంపూర్ణరాగమైన అందులో పంచమం అల్పంగా వాడబడుతుంది. దీని యొక్క జన్యరాగమే పంచమ వర్జితమైన ఘూర్జరితోడి. స గ మ ప ని స - స ని ద ప మ గ రి స అనే మూర్ఛనతో ఔడవసంపూర్ణ రాగంగా ముల్తాని అనే మరొక జన్యరాగం ఉన్నది. ఏదిఏమైనా లలితసంగీతంలో స్వతంత్ర సంచారం గావించే వెసులుబాటు ఉన్నది కదా. కాబట్టి తోడిరాగ స్వరాలు అనేక రీతులుగా లలితసంగీతంలో ఉపయోగించబడుతూ వుంటాయి. తోడి హిందుస్తానిలోని ఉదయం పాడే రాగాలలో ప్రముఖమైనది. కర్ణాటక



సంగీతలోని శుభపంతురావళి రాగం లో త్యాగరాజ విరచిత "నే పొగడకుంటే నీకేమి కొదవో" ముత్తుస్వామి దీక్షితులు రచించిన "శ్రీ సత్యనారాయణం ఉపాస్మహే నిత్యం" అనే కీర్తనలు ప్రసిద్ధమైనవి. సాధారణంగా శాస్త్రీయ సంగీత విద్వాంసులు తమ కచేరీలలో చివర జయదేవ అష్టపదులు గానం చేయడం జరుగుతూ వుంటుంది. అయితే ఇటీవలికాలంలో లలితసంగీత కళాకారులు కూడా లలితశాస్త్రీయ (Semi - Classical) పద్ధతిలో అష్టపదులు, అన్నమయ్య, రామదాసు, సదాశివ బ్రహ్మేంద్ర కీర్తనలు తరచుగా పాడడం జరుగుతున్నది. 1950వ దశకంలో ఆకాశవాణి మద్రాసు కేంద్రం నుండి ఘంటసాల "ప్రవిశరాధే", "క్షణమధునా నారాయణం" అనే అష్టపదులను గానం చేశారు. బహుశా లలితసంగీత కళాకారులు అష్టపదులు పాడడం అనేది ఘంటసాల గారితోనే ప్రారంభమయిందేమో అనిపిస్తుంది. ఆయన పాడిన "ప్రవిశరాధే" అనే యమన్ రాగంలోని రచనను 1954లో నేను కాలేజి విద్యార్థిగా ఉన్నప్పుడు నేర్చుకునని ఆంధ్ర అభ్యుదయోత్సవాల లలితసంగీత పోటీలలో పాడి ప్రథమ బహుమతి పొందడం జరిగింది. ఘంటసాల పాడిన ఈ అష్టపదులు ఈ తరం వారికి అంతగా పరిచయం లేనివి.

### జయదేవుడు

12వ శతాబ్దంలో జన్మించిన జయదేవుడు మహాకవి, పరమ భాగవతోత్తముడు.

**శ్లో॥ శ్రీవాసు దేవ రతికేళి కథా సమేత
మేతం కరోతి జయదేవ కవి: ప్రబంధమ్.**

శ్రీకృష్ణునిపై అపారమైన భక్తితో శ్రీవాసుదేవ రతికేళితో కూడిన కథను "గీత గోవింద" ప్రబంధంగా రచించాడు. ఇది కావ్య ప్రపంచంలో మహాకావ్యంగా ప్రసిద్ధికెక్కి మహోన్నత స్థానాన్ని పొందినది. కావ్యనాయిక అయిన రాధ నాయకుడైన శ్రీకృష్ణుని కొరకు విరహావేదనతో పరిపరివిధములుగా తపించి, తన చెలికత్తె నెరపిన దూతకృత్యం వలన శ్రీకృష్ణుని పొందడం ఇందులోని ఇతివృత్తం. ఈ గేయ ప్రబంధం పన్నెండు సర్గలుగా విభజించబడింది. 24 గీతములు గల ఈ గ్రంథంలో ఒక్కొక్క గీతం ఎనిమిది చరణాలు కలిగివుండడం చేత అష్టపది

ప॥ ; రిగారిరి సా, ని | సధాని సా; ॥
. క్షణమధు సా. నా | . రాయ ణం. ॥

; సరిసరి గమదద | ;మదాదసా ;,నిదమగరిసా ॥
. అనుగత మనుసర | . రా. ధే. . . . . . . . ॥

1.చ॥ ; సరిగమా దదదమ | మదనిమదమగగ రిగరి రిససా ॥
. శ్రిసలయ శయనత | వే. . . . మ.రు నా. . మి. ని ॥

; సరిగమా దదదని | మదనిస సా ; ; ॥
. చరణాన ళనవిని | వే. . . శం. . ॥

; దదాసరి గరిసరిగగగా | ;రిగాగమా రిగరి రిససా ॥
. దవపద ప. . . ల్లవ | . వై. రిప రా. . భ. వ ॥

; ససిగరిసా నిదమగ | మదనిదదా; మగరిస ॥
. మిద. మను భవ తుసు | వే. . . శం. . . . . ॥

॥క్షణమధు సా

మిగిలిన చరణాలు మొదటి చరణం వలె పాడాలి.



అని పిలువబడుతున్నది. ఈ కావ్యము సంగీత సాహిత్య నాట్య సమ్మేళనము.

జయదేవుడు తన గీతములును గానం చేయుగా ఆయన సహధర్మచారిణియగు పద్మావతి నృత్యం చేసేదట. ఇది శృంగార కావ్యమే అయినా, మధురభక్తి అంతస్స్రోతంగా కలదని విజ్ఞులు చెబుతారు. ఇందులో రాధ జీవాత్మఅని, ఈర్ష్యాద్వేషాలతోను, అహంకారంతోను భగవంతునికి దూరం కాగా గురూపదేశం వలన ఆత్మజ్ఞానము పొంది పరమాత్ముని శరణు కోరగా, ఆయన అనుగ్రహముతో జీవుడు పరమేశ్వరునియందు ఐక్యమగుట ఈ కావ్యంలోని నిగూఢమైన ఆధ్యాత్మిక విషయము.

ఆకాశవాణి, దూరదర్శన్‌లలో చాలా కాలంగా అనేకమంది గాయనీగాయకులు జయదేవుని అష్టపదులు గానం చేయడం మనకు తెలిసిన విషయమే. చలనచిత్రాలలో కూడా అవి ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి. విప్రనారాయణ చిత్రంలో "సావిరహేదవదీనా", తెనాలి రామకృష్ణలో "హరిరిహ ముగ్ధవధూని కరే" బహుళ ప్రచారాన్ని పొందాయి. జయదేవునికై కథను "భక్త జయదేవ" అనే చలనచిత్రంగా నిర్మించి అందులో చాలా అష్టపదులను అత్యంత రసభరితంగా చక్కని సంగీతంతో రూపొందించారు. సాలూరు రాజేశ్వరరావు సంగీతం ఆ చిత్రానికి ప్రాణం. ఘంటసాల

## శుభపంతువరాళి రాగం ఆధారంగా కొన్ని సినీ గీతాలు





| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | మహాప్రాణదీపం | శ్రీమంజునాథ | శంకర మహదేవన్ | హంసలేఖ |
| 2. | ప్రభో వేంకటేశా విభో శ్రీనివాస | శ్రీ ఏడుకొండలస్వామి | బాలు, చిత్ర | ఇళయరాజా |
| 3. | వేణువై వచ్చాను భువనానికి | మాతృదేవోభవ | చిత్ర | ఎం.ఎం. కీరవాణి |

## రాగ్ ఘూర్జరి తోడి ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఆశలే మారునే మమతలే తీరునా | దొంగల్లో దొర | ఘంటసాల | యం,యస్.రాజు |
| 2. | రావేలా కరుణాల వాల | శ్రీరామకథ | పి.సుశీల | ఎస్.పి. కోదండపాణి |
| 3. | తనువు కెన్ని గాయాలైనా | ఆడబ్రతుకు | పి.బి.శ్రీనివాస్ | విశ్వనాథం -రామ్మూర్తి |
| 4. | మాధవా మౌనమా సనాతనా | శ్రీ సత్యనారాయణ మహత్మ్యం | ఘంటసాల | ఘంటసాల |

ప్రైవేటు రికార్డుగా కొన్ని అష్టపదులను పాడగా, రాజేశ్వరరావు "కృష్ణం వందే జగద్గురం" అనే శీర్షికతో అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, జయదేవ మున్నగు వాగ్గేయకారుల రచనలను పి.సుశీలతో పాడించారు. దక్షిణాది వారైన అన్నమయ్య మొదలగువారి రచనలకు కర్ణాటక సంగీత రాగాలను, ఉత్తరాది వాడైన జయదేవుని అష్టపదులకు లలిత్, చంద్రకోస్ వంటి హిందుస్తాని రాగాలను ఉపయోగించి చూపిన ఔచిత్యం రాజేశ్వరరావు ప్రతిభకు, విజ్ఞతకు తార్కాణం. జన్మతః ఓఢ్ర (ఇప్పటి ఒరిస్సా) దేశస్థుడైన జయదేవుడు వాగ్గేయకారుడుగా, ఆది ప్రబంధకర్తగా భారతదేశానికంతకూ ఆరాధ్యుడైనాడు. నేటికీ ఒడిస్సీ నృత్యంలో అష్టపదులకు విశిష్టస్థానం ఉన్నది. హిందుస్తాని రాగాలలో జయదేవకృతులను ఆ ప్రాంతంవారు గానం చేస్తారు.

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

❖ **1944**

'రతన్' సినిమా విడుదలయి నేషద్‌కు అంతులేని ఖ్యాతి తెచ్చిపెట్టింది. 'అభిమా మిలాకే' 'మిల్‌కే బఛడ్ గయి అభియా' పాటలు మారుమ్రోగాయి. 800/-రూ॥ల పారితోషికం (అప్పట్లో చాలా ఎక్కువే!) నేషద్‌కు లభించింది.

❖ ఎకో - ఎఫెక్టు రావడానికి విభిన్నంగా మైకులు ఏర్పాటు చేయడం పాటకు, వాయిద్యాలకు వేర్వేరు మైకులు వాడడం వంటి నేషద్ ప్రయోగాలు విజయవంతమయ్యాయి. ఇతరులకు అనుకరణీయాలు అయ్యాయి.

❖ సజ్జాద్ హుసేన్ 'దోస్త్' భీమ్‌చంద్ ప్రకాష్ 'భర్తరి కి ఇచ్చిన పాటలు హిట్ అయ్యాయి

❖ **1945**



ముకేష్

'దిల్ జల్ లేహై' (పహ్‌లీనజర) ద్వారా ముకేష్ ప్రవేశం. అనిల్ బిశ్వాస్ సంగీతం, సైగల్‌పాట అనిపించేలా పాడినా, తర్వాత ముకేష్ తన స్వంత శైలి అలవర్చుకున్నాడు.

❖ తెరపై ఇవ్వాలి చెప్పుకోదగ్గ స్థాయిలో కనబడింది 'జీనత్' సినిమాలో. 'ఆహేం నభరీ షిక్వే నకియే' అనే ఈ ఇవ్వాలీ గీతం జోరాబాయి, నూర్జహాన్, కళ్యాణా పాడారు. హఫీజ్ ఖాన్ సంగీతం అందించిన ఈ పాటలో తర్వాత వ్యాంప్‌గా ప్రసిద్ధికెక్కిన శశికళ తొలిసారిగా తెరపై కనబడింది.



తాలత్ మెహమూద్

❖ తలత్ మెహమూద్ పరిచయం. "రాజ్ లక్ష్మి'' చిత్రం ద్వారా రాబిన్ చటర్జీ, ధీరేన్ మిత్రా సంగీత దర్శకులు.



చిత్రగుప్త

❖ **1946**

నలుగురు దిగ్గజాలు హిందీ సీమకు పరిచయమయిన సంవత్సరమిది. ఎస్.డి. బర్మన్ (ఎయిట్ డేస్, షికారీ) చిత్రగుప్త (లేడీ రాబిన్ హుడ్, ఇంకో రెండు చిత్రాలు)



ఇందీవర్



మజూ సుల్తాన్ పురి

సంగీత దర్శకులుగా, మజూ సుల్తాన్ పురి (షాజహాన్), ఇందీవర్ (డబుల్ ఫేస్) గేయ రచయితలుగా వచ్చారు.

❖ చైనీస్ వాతావరణంలో నిర్మించిన డా॥ కొట్నీస్‌కీ అమీర్ కహానీ సినిమాకై ప్రత్యేకంగా 'చల్‌ఆ'అనే పాటను చైనీస్ స్కేల్‌పై సంగీతాన్నిచ్చేరు. వసంత్‌దేశాయి అదొక వెరయిటీ



గీతాదత్

❖ అప్పటిదాకా ఘజల్, జానపద గీతాలకే పేరుతెచ్చుకున్న గీతారాయ్ (పెళ్లయ్యాక గీతాదత్ అయింది) 'భక్త ప్రహ్లాద' సినిమాకై భక్తిగీతాలు పాడింది.

❖ హన్స్‌రాజ్ బెహల్ 'సంగీత దర్శకుడుగా' పూజారి' సినిమాతో పరిచయం. ఈయనే తర్వాత ఆశా భోంస్లేను చిత్రసీమకు పరియయం చేశారు.

ఈ ఏడాది మ్యూజికల్ హిట్స్ - "రాజ్‌పుతానీ" (సంగీతం - బూలో సి.రాణి) "1857" (సజ్జాద్ హుస్సేన్), "షాజహాన్" "అన్‌మోల్ ఘడీ" (నేషద్), "మిలన్" (అనిల్ బిశ్వాస్).

---



ప్రముఖ సంగీత విద్వాంసులు డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణను మరొక అవార్డు వరించింది. ఇసై సంగం 2002 సంవత్సరానికి ప్రసిద్ధికెక్కిన సంస్థ "తమిళ ఇసై పేరారిజ్ఞార్" అవార్డుకు ఆయనను ఎంపిక చేసింది.

ఈ పక్షం డిసెంబరు 14వ తేదిన మద్రాసులోని రాజ అన్నమలై మన్రమ్‌లో ఆ సంస్థ జరుపనున్న 60వ సంగీతోత్సవ సభలో ఈ బహుమతి ప్రదానం జరుగుతుంది. డా॥ బాల మురళీకృష్ణ ఇటీవల మ్యూజిక్ థెరపీపై దృష్టి సారించిన విషయం సంగీతాభిమానులకు విదితమే!

ఇటీవలే హైద్రాబాద్ వచ్చిన శ్రీ బాలమురళి "ఫ్యూజన్" వంటి ప్రక్రియను తాను ఆదరిస్తానని చెప్పారు. వాటిని తిరస్కరించడం, తప్పు పట్టడం ఆరోగ్యకరమైన తీరు కాదన్నారు. సంగీతం ద్వారా పలు శారీరక, మానసిక రుగ్మతలను నయం చేయడానికి పదికోట్ల రూపాయల ఖర్చుతో 'మ్యూజిక్ థెరపీ' ప్రాజెక్టు ఆస్పత్రిని నెలకొల్పుదామనుకుంటున్నామని, ప్రభుత్వం, సంగీతాభిమానులు దీనికి తోడ్పడాలని అన్నారు. బాలమురళి సంగీతంపై అధ్యయనం చేస్తున్న డాక్టర్ సరస్వతి saraswati@eth.net ద్వారా ఆయన గురించిన సమాచారం లభ్యం చేస్తున్నారు.

**అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

**- ఆచార్య తిరుమల**

## సాహిత్యంలో గాడిద పద్యాలు

**మా**నవ జీవితం అనేక పశుపక్ష్యాదుల మీద ఆ ధారపడి ఉండడమే కాదు వాటితో బాగా ముడిపడి ఉంది. దేవతల వాహనాలు కూడా అవే కావటం వల్ల వాటికి పౌరాణిక ప్రాశస్త్యం కూడా ఉంది. సాహిత్యంలో రామాయణం నుండి నేటి వరకు చూస్తే అపారమైన జంతు ప్రపంచం, అనంతమైన పక్షిలోకం కనిపిస్తుంది పశు-పక్ష్యాదులే పాత్రలుగా విష్ణుశర్మ పంచతంత్రం అనే మహా కావ్యాన్ని అందించాడు. అది అపూర్వం, అద్భుతం. గాడిద-ఒక అమాయకపు ప్రాణి. దీన్ని సంస్కృతంలో ఖరం, గార్దభం అంటారు. దీని వాడుక సాహిత్యంలో చాలా కనిపిస్తుంది. కవులే కాదు సామాన్యులు కూడా గాడిదని చులకన గానే చూశారు, తిట్టారు. తెలివి తక్కువతనం, సోమరిపోతు తనం, అనాలోచిత వ్యవహారం, గుణాన్ని గ్రహించలేకపోవటం, బరువు మోతల వంటి అనేక అవలక్షణాలకి గాడిదని ప్రతీకగా తీసుకుని హేళన చేశారు. పాపం! గాడిద. దాన్ని చూస్తుంటే జాలేస్తుంది. నవదుర్గల్లో ఒక దేవియైన 'కాళరాత్రి'కి వాహనమైన గాడిద, అమెరికా వంటి సంపన్నదేశానికి జాతీయ జంతువైన గాడిద లోక వ్యవహారానికి చుల్కనైపోయింది, నీచమైపోయింది. కొన్ని పుట్టువుల కర్మలంతే కాబోలు!

ఈ వ్యాసంలో కొన్ని గాడిద పద్యాలు, చమత్కారాలూ ప్రస్తావిస్తాను. గాడిద పద్యాలంటే గాడిదలు రాసిన పద్యాలు కాదు, గాడిద మీద రాసిన భాగవతంలో కృష్ణుడు పుట్టినప్పుడు వసుదేవుడు గాడిద కాళ్ల పట్టుకున్నాడని పుకారు పుట్టించారు గానీ ఆ విషయం భాగవతంలో లేదు. కాకపోయినా అంత అర్ధరాత్రి, ఆ కారాగారం దగ్గర గాడిదెందుకు అరుస్తుంది చెప్పండి? తమాషా ఏదోటి పుట్టించి ప్రచారం చేయటం మనకలవాటు. అయితే గాడిదని గూర్చి భాగవతంలో లేకపోలేదు. ధేనుకాసురుడనే రాక్షసుడు గార్దభాకారంలో వచ్చి తాటితోపులో తిరుగుతున్న బలరాముడి మీద పడి ఱొమ్ము మీద తంతాడు. బలరాముడు వాడి విషయం కనిపెట్టి, ఆ గాడిద నాలుగు కాళ్ళూ కలిసి పట్టుకుని గిరగిరా తిప్పి విసిరి కొట్టి చంపుతాడు. వాడి బంధువులైన మిగతా గాడిదల్ని కూడా బలరామకృష్ణులు విసిరి విసిరి కొట్టి చంపేస్తారు. భాగవతంలోనే కంసునితో దేవకి- **"అన్న శమింపుమన్న తగదల్లుడు గాడిది మేనగోడలౌ"** అని వేడుకుంటుంది. ఆ పద్యపాదాన్ని 'రాముని తోక' లా చేసి ఒక ప్రబుద్ధుడు "అల్లుడు గాడిది" అని చదివాడు. "అన్నా! ఊరుకో! చంపకు! అల్లుడు కాదు ఇది మేనగోడలు నీకు" అని దేవకి కంసుణ్ని బ్రతిమాలుకుంటుంది. అసలు విషయం విడిచి అల్లుణ్ని గాడిదని చేశాడు.

గాడిద తన్నుల్ని దృష్టిలో పెట్టుకునే కాబోలు డా. ఉండేల మాలకొండారెడ్డి గారు "గంతలు మోస్తుంది కదా అని గాడిదను తరిమేవు! వెనుక కాళ్లతో తంతే వెల్లకిలా పడేవు'' అని హెచ్చరించటమే కాదు

**"ఒకే ఒక్క గాడిద కాళ్లు**
**పట్టుకున్నాడట వసుదేవుడు నాడు**
**ఎన్ని గాడిదల కాళ్లు**
**పట్టుకుంటున్నాడో సగటు మనిషి యీనాడు"**

అని ఛెళ్లు మనిపించారు. ఇంతెందుకూ, రాజులే బుద్ధిలేని గాడిదల్లా ఉంటారంటాడు పూర్వకవి ఒకడు.

**రేరే రాసభ! వస్త్రభార**
**వహనాత్ కుగ్రామ మశ్నాశికిం?**

రాజాశ్వావసథం ప్రయాహి, చణకాభ్యూషా సుఖం భక్షయన్ సర్వా పుచ్ఛవతో హయా ఇతి వదంత్యత్రాధికారే స్థితాః రాజాతైరుపదిష్టమేవ మనుతేన్ సత్యం తటస్థాః పరే!!

ఈ శ్లోకానికి భావమేమిటంటే "ఓ గాడిదా"! బరువులు మోస్తూ యీ చిన్నివూళ్లో ఎన్నాళ్లిలా తిరుగుతావు? రాజు గారి అశ్వశాలకు వెళ్లు! అక్కడ మంచి సెనగ గుగ్గిళ్లు తిని హాయిగా ఉంటావు. భయపడకు వెళ్లు! అక్కడి రాజాధి కారులు 'తోకలున్న వన్నీ గుఱ్రాలే' అని చెబితే ఆ రాజు నమ్ముతాడు. మిగిలిన వాళ్ళు నోరెత్తర'ని గాడిదకి హితవు పలుకుతాడు. రాజులంత గుడ్డిగా ఉంటారని హాస్యోక్తి.

రాజులే కాదు "మూఢో మూర్ఖో గార్దభశ్చైకరాశిః'' అన్నట్టు అరసికుడు, అవివేకి, లోభి-గాడిదతో సమానులంటూ ఒక కవి-

**చదివిన పద్యమందు గల సారమెరుంగలేని యజ్ఞుడున్**
**హృదయము హాయిగన్నను కవీంద్రుని మెచ్చకపోవు కొంటెయున్**
**పదవి విశేషముండి కృతిపద్యము లూరకకోరు లోభియున్**
**గద భువి మూఢ మూర్ఖజన గార్దభముల్ ముగురేకరాశియై"**

అనే పద్యంలో తెలియజేశాడు.

పద్యసారాన్ని తెలుసుకోలేని అజ్ఞానిలాగే, అర్థాలు తెలుసుకోకుండా శాస్త్రాలు వల్లించే వాళ్ల బరువునే గానీ చందన గంధాన్ని తెలియని గాడిదల్లాంటి వాళ్లని-

**యథా ఖర శ్చందన భారవాహీ**
**భారస్య వేత్తానతు చందనస్య**
**ఏవం హి శాస్త్రాణి బహూనధీత్య**
**చార్థేషు మూఢాః ఖరవద్వహంతి!!**

అనే శ్లోకం ద్వారా శుశ్రుతం అనే కావ్యం తెలిపింది.ఇలాంటి తిట్టుపడని శాస్త్రజ్ఞుండడేమో! శాస్త్రార్థం తెలియకపోతేనే కాదు ఆడిన మాట తప్పినవాడూ గాడిదే! అలాంటి వాణ్ని గాడిద కూడా భరించలేక ఏడిచిందని-

**ఆడిన మాటను దప్పిన**
**గాడిద కొడుకంచుఁ దిట్టగా విని యయ్యో!**
**వీడా నాకొక కొడుకని**
**గాడిద యేడ్చెంగదన్న ఘన సంపన్నా!!**

అనే పద్యం తెలియజెప్తూ ఉంది.

కొండవీడులో కవులూ, వాళ్ళల్లో కవి గాడిదలూ ఎక్కువేమో, శ్రీనాథ మహాకవికి ఒళ్ళు మండిపోయి

బూడిద బుంగవైయొడలు పోడిమి దప్పి మొగంబు వెల్లనై
వాడల వాడలం దిరిగి వచ్చెడు వారలు చొచ్చుచో యనన్
గోడల గొందులం దొదిగి కూయుచు నుండెడు కొండవీటిలో
గాడిద! నీవునుం గవివిగావు కదా యను మాన మయ్యెడున్!!

అని ఓ గాడిదనే అడిగాడు. ఏ కాలంలోనైనా తల తిక్కగాళ్లు చాలా మందే ఉంటారు. ఒకసారి శ్రీనాథుడొక సభకు వెళ్తే, అక్కడివాళ్లు

**"అందరు నందరే మరియు నందరు నందరె యంద రందరే"**




అని సమస్యిచ్చి పూరించమని వెటకరించారుట! అసలే శ్రీనాథుడు, మహారాజసకవి. వెంటనే-

**కొందరు భైరవాశ్వములు కొందరు పార్థుని తేరి టెక్కెముల్**
**కొందరు ప్రాక్కిటీశ్వరులు కొందరు కాలుని వెక్కిరింతలున్**
**కొందరు కృష్ణజన్మమున గూసిన వారలు నీ సదస్సులో**
**నందరు నందరే మరియు నందరు నందరె యందరందరే!!**

అని పూరించి వాళ్ల నోళ్లు మూయించాడు. భైరవాశ్వాలంటే కుక్కలు, పార్థుని తేరి టెక్కాలంటే కోతులు, ప్రాక్కిటీశ్వరులంటే పందులు, కాలుని వెక్కి రింతలంటే దున్న పోతులు, కృష్ణజన్మమున కూసినవారంటే గాడిదలు -అంటే-ఈ సభలో వాళ్లంతా కుక్కలు , కోతులు, పందులు, దున్నపోతులు, గాడిదలని అర్థం. ఇలాంటి వాళ్లు జనాలుగా ఉంటే ఇంక వేరే చెప్పుకోవాలా?

ఆడిదం సూరకవి అని ఓ పూర్వకవి ఉండేవాడు. ఆయన్నోసారి ఓ కుక్క తరుముకు వచ్చింది. పరుగెత్తుకుంటూ వచ్చి వీధి చివరనున్న గుంపుని చేరు కున్నాడు. వాళ్లు కవి గార్ని ఏడిపించాలని-"ఏవిటి కవీ! అలా గాడిదలా వొగుర్చుకుంటూ వచ్చా''వని అడిగారు. వెంటనే సూరకవి-"ఏంలేదు ఓ కుక్క తరుముకొచ్చింది. ఇంక భయం లేదు, స్వజనంలో పడ్డాను గదా!" అనగానే వాళ్లంతా నోరుమూసేశారు.

ఇలాంటి ఊరి గాడి దల్ని దల్చుకుంటే మరో జోక్ నుండి తాతా చూడాలని వచ్చిన ముట్నూరి కృష్ణారావుగారి మనవ రాలు వస్తూ వస్తూ వూరంతా చూసి "ఏవండీ! తాతగారూ! ఈ వూరినిండా గాడిద లేనే" అంది. దానికాయన నవ్వుతూ "ఔనమ్మా అవి చాలక, వాటిని చూడ టానికి పొరుగూరి గాడిదలు కూడా వస్తావుంటా'' యన్నారట! ఇలాంటిదే ఊరిముచ్చట మరోటి; ఒక ఊళ్లో ఓ చెట్టుకింద చేరి కొంత మంది సైనికులు వచ్చేపోయే వాళ్లని వెకిలిగా ఆటలు పట్టిస్తూ వినోదిస్తుండ గా ఇద్దరు కుర్రాళ్లు ఒక గాడిదని అటూ ఇటూ పట్టుకుని జాగ్రత్తగా నడిపించు కుంటూ రావటం చూసి "ఎందుకురా! ఆ గాడిదనంత జాగ్రత్త గా నడిపించు తీసుకెళ్తున్నా" రని అడగగానే- "మరేం లేదు, వదిలేస్తే యీ గాడిదకూడా, సైన్యంలో చేరు తుందని భయం" అంటూ పరుగెత్తుకు పోయారట! ఇక-

**"గంగిగోవు పాలు గరిటెడైనను చాలు**
**కడివెడైన నేమి ఖరము పాలు"** అనిన వేమన
**"భూతి దేహమందు బూసిన నేమయ్యె**
**నిష్ఠ శివుని యందు నిలుపలేక**
**కనగ భస్మమందు గాడిద పొర్లాట"**

అని భక్త గాడిదల్ని దుయ్యబట్టారు. వేమన్నని ఇష్టపడే శ్రీశ్రీ తన సిరిసిరి మువ్వ శతకంలో

**అవురా! మన తెలుగింట్లో**
**కవిరాజులు కవివరాహ గార్ధభ శునకా**
**ద్యవతార మూర్తులెందరొ**
**శివమెత్తినటుల్ నటింత్రు సిరిసిరిమువ్వా!**

అనే పద్యంలోనూ,

**ఏడీ కవిగాడీ భువి**
**గాడిద యేడుపును పాడగలిగిన వాడౌ**
**చౌడప్ప కీడు? కర ని**
**ష్ఠీడన కర్షుండు వాడు సిరిసిరి మువ్వా!!**

అనే పద్యంలోనూ కవి బిరుదుల్ని హేళన చేస్తూ గాడిద ప్రస్తావన తెచ్చాడు. నిజమే! కవి బిరుదాల్లో జంతు వినోదం చాలా ఉంది కదా! ఒకసారి ఒక సభలో గుమ్మన్నగారి లక్ష్మీ నరసింహశర్మ అవధాని గారికి ''ఖరము నెక్కి నతడు ఖ్యాతినొందె" అని సమస్య యిస్తే ఆయన

**ఒక మహస్సముత్సకోన్నతినందంగ**
**భారతీయ తత్వ భారతార్థి ఒకడు**
**నొక్క మను మహోన్నత హిమవత్**
**శిఖరవ నెక్కినతడు ఖ్యాతినొందె!!**

అని పూరించి ప్రశంస లందుకున్నారు. గాడిదెక్కి కీర్తి పొందాడు కాస్తా, హిమాలయ శిఖర మెక్కికీర్తి పొందాడయ్యింది. ఇక్కడ 'ఖరము' ఖరము కాదు శి'ఖరము'.

నేనెప్పుడో 'గాడిద గర్జించింది' అనే బాలల గేయాన్ని రేడియో ప్రసారం కోసం రాశాను. పులితోలు కప్పుకొని తిరుగుతూ బాధ కలగ్గానే సొంత గొంతుతో కూసి దెబ్బలు తిన్న ఒక గాడిద కథ అది. తనికెళ్ల భరణి "గార్ధభాండం" ఎంత ప్రసిద్ధమో మీకూ తెలుసు. చివరగా ఓ జోక్-

ఓ యింటి ముందు గాడిద చచ్చిపోయింది. ఆ ఇంటి యజమాని ఆ విషయాన్ని ఆ గాడిద సొంతదారునికి చెప్తే, అతగాడు చిరాగ్గా "నాకు చెప్పేదేముంది తీయించేయండి-'' అనగానే ఇంటాయన నవ్వుతూ-

"అలాగే, తీయించే ముందు బంధువులకి చెప్పాలి గదాని చెప్పాను." అని వెళ్లిపోయాడు.




**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడికి విజయ్ అనే నిరుద్యోగి తారసిల్లుతాడు. విజయ్‌కి తల్లిలేదు, తండ్రి రామదాసు అప్పులు చేసాడు, చెల్లెలి మీనా కాపురం చిక్కుల్లోపడింది. డబ్బుంటేఉండే కష్టాలగురించి అజయ్ చెప్తాడు. అతనికి బాల్యం లోనే తల్లి, ఇటీవలే తండ్రి పోయారు. మేనేజరు భానోజీదే పెత్తనమంతా. ఒక సంవత్సరంపాటు ఇద్దరూ తమ తమ స్థానాలను మార్చుకుని, పరిస్థితులను ఎదుర్కొనాలని నిశ్చయించుకుంటారు. విజయ్ ఇంటికి వెళ్లిన అజయ్‌కు పొద్దున్న లేవగానే అప్పులవాడు వచ్చిపడ్డాడు. అజయ్ వేషంలో ఉన్న విజయ్‌ను సరిగా తిన నీయడు -అనారోగ్య భయంతో చెక్కు మీద సంతకం పెట్టమని భానోజీ అడిగితే తప్పించుకోడానికి వేలు కోసుకుంటాడు విజయ్.

(ఇక చదవండి)



# అన్నపూర్ణా వారి ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నవల 6

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**



అత్తయ్య గదిగుమ్మంలో ఆగాడు విజయ్. పూజకి ఏర్పాటు చెయ్యమని లచ్చిని పురమాయిస్తున్న 'అత్తయ్య' అడుగుల చప్పుడు విని 'ఎవరూ?' అంది.

'చిందొర వచ్చిన్రమ్మా' అని చెప్పి లచ్చి వెళ్లిపోయింది.

'అజయా... రా నాయనా, రా ఏమిటి నాయనా వేలు కోసుకున్నావట? ఎలా వుంది' అందావిడ కంగారుగా రెప్పలల్లార్చుతూ.

ఈ ఇంట్లో అజయంటే నిజంగా అపేక్ష వున్నది ఈవిడ ఒకర్తేనని తోచింది విజయ్‌కి.

'అబ్బే, ఏం లేదత్తయ్యా. ఈ మాత్రానికేనా ఇంత కంగారు' అంటూ లోపలికి వెళ్లాడు విజయ్. వెళ్లి అత్తయ్య మంచంమీదే, కొంచెం ఎడంగా కూర్చున్నాడు.

'ఈ ముసలి ప్రాణానికి నీ గురించి కాకపోతే ఎవరి గురించి కంగారు? ఏమిటో నాయనా, నీవైఖరి బొత్తిగా అయోమయంగా వుంది. పొద్దున్న ఆ నోరులేని వాడిమీద కసురుకున్నావుట. ఏఁవిటిదంతా నాయనా' అందావిడ.

'రాత్రంతా మనసేమీ బాగా లేదత్తయ్యా!'

'అవును ఏమి బాగుంటుంది? రాత్రి ఇంటికి ఏ పరిస్థితిలో వచ్చావో గుర్తుందా? ఏం పనయ్యా అది. ఎంత అప్రతిష్ట! మీ నాన్నే ఉంటే ఇలా జరిగేదా?'... ఆమె మనసులో క్షోభ విజయ్‌కి అవగతమైంది. అజయ్‌మీద ఉవ్వెత్తున కోపం వచ్చింది. ఈసారి కనబడగానే చివాట్లెయ్యాలి.

'పొరబాటయిందత్తయ్యా. క్షమించు. ఇకమీదట అలాటి పాడుపన్లు చెయ్యను' అన్నాడు. మిత్రుడి తరపున భారీ వాగ్దానం ప్రకటిస్తూ. కనీసం ఇక్కడవుండే ఏడాదీ అలాటి పని ఇక జరగదుగదా అని ధీమా.

అజయ్ ఇంత నెమ్మదస్తుడిలా మాట్లాడ్డం, ఈ అణకువ, ఈ మాటతీరూ అత్తయ్యకి చిత్రంగా తోచాయి. పైగా, ఎన్నడూ లేనిది చాలా ఎడంగా కూర్చున్నట్టున్నాడు. ఇంకా - అదేదో 'పుచ్చుకునే' ఉన్నాడా?...

'అదేమిటి అజయ్, అంత దూరంగా ఉన్నావ్? రా నాయనా, దగ్గరకు రా... నాయనా. నీ పద్ధతులన్నీ మార్చుకోవాలి.'

'మారిపోయా అత్తయ్యా. రాత్రినుంచీ పూర్తిగా మారిపోయాను' అన్నాడు విజయ్. సజ్జనుల సమక్షంలో సత్యం, అసత్యాల రూపేణానైనా వెలికివచ్చి తీరుతుందన్న పెద్దలవాక్కు సత్యమైంది అనుకున్నాడు విజయ్.

అత్తయ్యకీ అజయ్ చెబుతున్న మార్పుమీద గురీలేదు; విజయ్ ధ్వనించిన మార్పుగురించి శంకాలేదు. 'చూడు బాబూ, కర్తవ్యాన్ని గాలికి వదిలివేస్తే పరిస్థితులకు బానిసలం అయిపోతాం. చదువుకున్న వాడివి. సమర్థుడివి. నువ్వు ధైర్యంగా నిలబడితే దేన్నయినా సాధించగలవు' అంది.

విజయ్ ఆ వాక్యాలు విని, ఉత్తేజితుడయ్యాడు. తన స్థితిలో, తను మననం చేసుకోవలసిన మహా మంత్రాలు అవి; దీవెనలు అవి.



'తప్పకుండా సాధిస్తానత్తయ్యా, మీ అభిమానం, ఆశీర్వాదం ఉంటే దేన్నయినా సాధిస్తాను' అన్నాడు ఆవేశంతో.

'అదేవిటి అజయ్! నా అభిమానం ఆశీర్వాదం నీక్కాకపోతే ఇంకెవరికి?' అంటూ, అత్తయ్య తన మేనల్లుడి బుగ్గలు ఆప్యాయంగా నిమిరింది ఉత్తర క్షణంలో ఆమె చేతులు విద్యుదాఘాతం తిన్నట్టు వెనక్కి వచ్చేశాయి. ముఖ కవళిక మారిపోయింది.

'ఎవరు నువ్వు' అంది భయంతో కంపించిపోతూ.

విజయ్ కొయ్యబారి పోయాడు. ఇది అనుకోని దెబ్బ.

'నువ్వు నా అజయ్‌వి కావు. చెప్పు, నిజం చెప్పు. ఎవరు నువ్వు' అని

నిలదీసి అడుగుతోందావిడ.



'నేనే అత్తయ్యా. అజయ్‌ని' అన్నాడు విజయ్ - నీరసంగా.

'ఛీ దుర్మార్గుడా. నన్ను మోసం చెయ్యాలనుకున్నావా? కళ్లు లేని దాన్నయినా నా అజయ్‌ని గుర్తుపట్టగలను. ఎవరు నువ్వు. చెప్పు. చెప్తావా లేదా?' అందావిడ. ఆ ఆవేశం ఆ ఆగ్రహం విజయ్‌కి దుర్భరం అయిపోయాయి. ఇక చెప్పక తప్పదు. ఆమె ఆమోదిస్తే తప్ప ఈ నాటకం, ఈ ఉద్యమం సాగవు...

'అమ్మా నేను అజయ్‌ని కాను' అన్నాడు తల వంచుకుని, నెమ్మదిగా.

అత్తయ్య, స్వరం తగ్గించింది - ఎవరన్నా వింటారన్న భయంతో.

'మరి నువ్వెవరు?'



'నా పేరు విజయ్!'

'ఆ! అయితే నా అజయ్ ఎక్కడ? నా అజయ్‌ని ఏం చేశావు?' అందావిడ ఆందోళనతో.

'అమ్మా మీ అజయ్ క్షేమంగానే ఉన్నాడు. మా యింట్లోనే ఉన్నాడు'.

'చెప్పు. ఏం జరిగిందో చెప్పు'.

'నిన్న రాత్రి అజయ్, నేనూ విచిత్రమైన పరిస్థితులలో కలుసుకున్నాం..' అన్నాడు విజయ్.

నమ్మశక్యంగాని ఆ గాథను ఆమె నమ్మగలదో లేదో తెలియకపోయినా, ఉన్నదున్నట్టు చెప్ప నిశ్చయించుకున్నాడు విజయ్. తనకీ అజయ్‌కీ జరిగిన సంభాషణ దగ్గరనుంచి,గుర్తున్నంతవరకూ పూసగుచ్చినట్టు చెప్పుకొచ్చాడు.

కథంతా విన్నా, అత్తయ్య మాట్లాడలేదు.

'ఈ ఏర్పాటు స్వయంగా అజయ్‌బాబే చేశాడు' అన్నాడు విజయ్.

అత్తయ్య ఆగ్రహాన్ని, దుఃఖాన్ని అణచుకుని నిగ్రహంతో కూర్చున్నదన్న వైనం, ఆమె ఆగ్రహం విజృంభించేవరకూ తెలియలేదు విజయ్‌కి.

'అబద్దం! మోసం! ఇందులో ఏదో ద్రోహం వుంది. నా అజయ్‌కి ఏదో ద్రోహం జరిగింది' అందావిడ. దుఃఖోద్వేగంతో గొంతు జీరపోయింది.

'లేదమ్మా! ఇందులో ద్రోహంలేదు. మీ పాదాల సాక్షిగా నా మాట నమ్మండి. నేను డబ్బులేనివాణ్ణి కాని, నీతిలేనివాణ్ణి మాత్రం కాను' అన్నాడు విజయ్.

'అయితే నా అజయ్‌ని నాకు చూపించు'.

'అలాగే, మీరాందోళన పడకండి. అజయ్‌బాబును తీసుకువస్తాను. ఈ రాత్రే తీసుకువస్తాను' అన్నాడు విజయ్.

అతనా మాట మనస్ఫూర్తిగానే అంటున్నాడని మాటనిబట్టి కాకపోయినా, కంఠస్వరంబట్టి అత్తయ్యకు గురి కుదిరింది.

విజయ్ సెలవు తీసుకున్నాడు. వెళ్లి బట్టలు వేసుకుని, ఫలహారాల బల్లదగ్గర తన కోసం కూర్చున్న సరళకి తరవాత కనిపిస్తానని చెప్పి, కారు తీసుకు బయటకు వెళ్లిపోయాడు.



ఆ రాత్రే, అన్నమాట ప్రకారం అజయ్ బాబును తీసుకువచ్చాడు. 'అత్తయ్యా' అన్న అజయ్‌బాబు పిలుపు వినగానే ఆవిడ తన మేనల్లుడిని గుర్తుపట్టింది.



'అజయ్, ఏమిటి నాయనా! ఇదంతా నిజమేనా?'

'అవునత్తయ్యా! నా సమ్మతి మీదనే ఈ యేర్పాటు జరిగింది'.

అత్తయ్య ఒక్క క్షణం మౌనం వహించింది.

'అయినా, 'నా' అన్నవారందరినీ విడిచి, అక్కడ యెలా వుండగలవు అజయ్!' అంది నెమ్మదిగ.

'దిగులుపడక అత్తయ్యా! ఒక్క ఏడాదీ యెంతలో గడిచిపోతుంది... విజయ్ చదువుకున్న వాడు; సమర్థుడు; కష్టాలంటే తెలిసినవాడు. నా సమస్యల్ని పరిష్కరిస్తాడనే నమ్మకం నాకుంది' అన్నాడు అజయ్.



'విజయ్! నిన్ను అనవసరంగా ఏవేవో అన్నాను. అవేమీ మనసులో పెట్టుకోకు నాయనా!' అంది అత్తయ్య మృదువుగా.

'దానికేముందండి... అజయ్ బాబు కోరిన ప్రకారం నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను' అన్నాడు విజయ్ - తన మిత్రుడికేసి చూస్తూ.

'నాయనా, నీ స్నేహితుడికి మేలు చెయ్యి! నీకూ మేలు కలుగుతుంది' అంది అత్తయ్య.

******

చిలకల చిన్నారావు చిన్నసైజు రౌడీ. చిలకలలాగే రంగు హంగు బట్టలేసుకు తిరుగుతాడు. కులాసా ఎక్కువైతే, ఓ యెగురెగిరి పడుతూవుంటాడు.

పెళ్ళికాని పిల్లలు తల్లితండ్రులకు బరువని చిన్నారావుకు ఎవరో చెప్పారు. పెళ్ళిఅయీ మొగుడేలుకోనివాళ్లు మరీ బరువని కూడా చెప్పారు. సాధ్యమైనంత వరకూ అలాటి బరువులు దించి సంఘసేవ చేయాలని చిన్నారావు ఉబలాటం. రామదాసు గారింట ఆడబడుచు చాల బరువనీ, ఆయన్దో మాలోకమనీ, సన్నగా రివటలా పొడుగ్గా, అర్భకంగా ఉండే మునలిదానుగారికది దుర్భరమనీ, ఆ పిల్లదాని అన్నదమ్ముడుట్టి జులాయి వెధవనీ, మూణ్ణాళ్ళకోసారింటికివచ్చి తినిపోతాడని, ఆ వాడలో పెద్దమనుషులు అనుకోగా, కొళాయి దగ్గర గొప్పింటి ఆడోళ్ళు ఆడిపోసుకోంగా వాడు విన్నాడు. దాసుగారింటి కిసింటా కొళాయి ఎదురుగా ఉన్న కిళ్ళీ బడ్డీ వాడిహెడ్డాఫీసు. బిందె పట్టుకొని మీనా అటు రాగానే, 'వచ్చిందోయ్ చిలక' అన్నాడు చిన్నారావు జనాంతికంగా.





బడ్డీవాడు, ప్రస్తుతః ఎవడైనా, ఆవాడలో వ్యాపారం చేసుకోవా లంటే పెద్దమనిషి తరహాగా ఉండక తప్పదు.

'తప్పు తప్పు నిప్పులాంటి పిల్ల



తన్నులు తినగలవ్' అన్నాడు. బడ్డీలవాళ్లు అసలు వాళ్ల వాళ్ల వీధుల్లో ఆడంగుల తీరు తెన్నుల మీద అధారిటీలు అయిఉంటారు. ఏ యింటి పడుచు పతివ్రతో, ఎవరు 'బహుపతి - వ్రతో' వాళ్లకి తెలిసినట్టు మరొకళ్ళకి తెలీదు. అడిగితే చాలా జాతకాలు చెప్పగల్రు. కానీ, చిన్నారావుకి బడ్డీరావు మీద గురిలేదు. పోవాయ్ వంకాయ్ అంటూ కుళాయివైపు షికారు లేచాడు. 'నీకూ నీ వారు లేరు, నాకూ నా వారు లేరు ఏటి వడ్డున ఇల్లుకడదాం పదవే' అన్నాడు.

మీనా, తలవంచుకుని నీళ్లు పట్టుకొంటోంది - కాని ప్రాణాలు గుప్పిట్లో ఉన్నాయి.

'నీకూ నీ మొగుడు లేడు .... నాకూ పెళ్ళామూ లేదూ -'

మీనా ధైర్యం సడలిపోయింది. దుఃఖం పెల్లుబికింది. బిందెనక్కడే వదిలేసి ఒక్క పరుగున ఇంటికి వెళ్ళిపోయింది.

'నే చెప్పితే విన్నావట్రా. దా సోడా తాగు' అన్నాడు బడ్డీవాడు. చిన్నారావు తాగడం మంచిదే అయింది. తినబోయే లెంపకాయలకి అడ్వాన్సు కట్టుదిట్టం.



ఇంకో క్షణంలో రామదాసుగారు పెద్ద పెద్ద కేకలు వేస్తూ వచ్చేశారు.

'ఎవడ్రా నీచుడు - మారీచుడు - మా అమ్మాయిని పట్టుకొని నోటికొచ్చినట్టు కూశాట్ట రమ్మనిటు. డొక్కచింపి డోలు కట్టేస్తా. ఏడీ వాడు' అంటూ చిందులు తొక్కసాగాడు.

'పోనీండి బాబూ ఏదో బుద్ధితక్కువై కూశాడు' అన్నాడు బడ్డీవాడు - బడ్డీవారకి జరిగి నక్కుతున్న చిన్నారావుని ఓరకంట చూస్తూ.

'అసలు నీకురా బుద్ధిలేంది. చిల్లరకొట్టనిపెట్టి, అల్లరిమూకని చేరుస్తావ్? ఉండు నీ కొట్టూ గిట్టూ లంకాదహనం చేస్తాను' అంటూ కొట్టువాడి మీదికి విరుచుకు పడ్డారు రామదాసుగారు.



బజారు నించి వస్తున్న అజయ్, ఈ గొడవ చూసి పరుగున వచ్చాడు. 'ఏమిటి నాన్నా ఎవరిమీద కేకలు' అంటూ.

'అడుగో ఆ కొట్టులో దూరాడు రౌడీ వెధవ, అమ్మాయి నీళ్ళు పట్టుకోవడానికని కొళాయి దగ్గరికొస్తే, అడ్డమైన కూతలూ కూశాట్ట.'



'ఏయ్ ఎవడ్రావాడు. రా బయటికి' అంటూ రౌద్రంగా కొట్టుమీదికి వచ్చాడు అజయ్.

బడ్డీవాడి ప్రాణం బేజారైపోయింది. 'పోరా, నా కొంపమీదికి తెచ్చావ్, పో' అంటూ చిన్నారావుని ముందుకు నెట్టాడు.

'బాబోయ్, తప్పయిపోయింది. నన్నొదిలిపెట్టండి బాబూ' అంటూ గోలపెట్టాడు చిన్నారావు.



అప్పటికే అజయ్ వాడి జుట్టు దొరకబుచ్చుకున్నాడు. 'నిన్నంత తేలిగ్గా వదుల్తాన్రా' అంటూ బరబర వాణ్ని ఇంటికి ఈడ్చుకు వెళ్లాడు.

హాలులో, మీనా కుమిలి కుమిలి ఏడుస్తోంది. అజయ్ చిన్నారావుని ముందుకు తోసి, 'కాళ్ళమీదపడు; చెంపలేసుకో' అన్నాడు.

'బుద్ధొచ్చింది' అన్నాడు చిన్నారావు చెంపలేసుకుని.

'ఎప్పుడైనా సంసార్లని కన్నెత్తి చూస్తావా?'

'ఈ పేటకే రాను.'

'ఇంకోపేట కెళ్తావన్నమాట' అంటూ చెయ్యెత్తాడు అజయ్.

'లేదుబాబూ, లేదు.'

'ఫో' అని, వాణ్ణి బయటకు నెట్టేడు.



మీనా వెక్కి వెక్కి ఏడుస్తోంది.

'ఎందుకు చెల్లెమ్మా, ఇంకా ఏడుస్తావ్? వాడికి గట్టిగా బుద్ధి చెప్పానుగా.'

'ఒకర్నని ఏం లాభం అన్నయ్యా! నా కర్మ ఇలా కాలినప్పుడు' అంది మీనా తలవంచుకుని.

అజయ్ కుంగిపోయాడు. నిజమే, తను ఈ ఇంటికి వచ్చి, ముఖ్యంగా ముందర చూడవలసింది ఈ సమస్య .... ఈ చెల్లెలి సుఖం.

'అంతేలే అంతే. పెళ్ళయినపిల్ల అత్తారింటికెళ్ళకుండా ఇంట్లో పడుంటే అందరికీ లోకువే -' అంటూ కుర్చీలో కూలబడ్డాడు రామదాసుగారు.

'.... అమ్మను బతికించుకోడానికి అత్తవారిచ్చిన నగలన్నీ అమ్మింది. అది చచ్చి స్వర్గానవుంది. ఇది ఇట్టా నరకం అనుభవిస్తోంది. నేనేమో చచ్చీ చావకుండా ....' పిల్లల మొహాలు చూసి నిట్టూర్చాడాయన. 'ఆ శ్రీరామచంద్రుడు ఇంకా ఎంతకాలం ఇలా పరీక్షిస్తాడో, ఏనాటికి ముక్తి కలిగిస్తాడో....' అంటూ అలసటతో కళ్లు మూసుకున్నాడు.



'బాధపడకు నాన్నా. నా బరువు తీరిపోతుందిలే! త్వరలోనే తీరిపోతుంది' అంది మీనా భారంగా.

'చెల్లెమ్మా!' అన్నాడు అజయ్ అదిరిపడి. చెల్లెమ్మ తలవంచుకుంది.

'ఎవ్వరూ బాధపడనక్కర్లేదు. వాళ్ళెందుకు తీసుకువెళ్ళరో, ఎలా తీసుకువెళ్ళరో నేను తేలుస్తాను' అన్నాడు దృఢస్వరంతో.

'హేం తేలుస్తావురా నాయనా. డబ్బురా డబ్బు. అంతా డబ్బులో ఉంది' అన్నాడు తండ్రి నిస్పృహతో.

'డబ్బు. వెధవ డబ్బు కోసం బంధాలూ, అనుబంధాలూ తెంచుకుంటారా? అమానుషంగా ప్రవర్తిస్తారా? చూస్తాను' అన్నాడు అజయ్ కోపావేశంతో.

చూసింది, చూస్తున్నదీ, చూడబోతున్నదీ ఆదేనన్న సత్యం అతని లేతమనస్సులో నాటలేదు....

.... .... .... ....

మీనాక్షి మెడలో తాళిగట్టినవాడు, అనుబంధాలు ఉంచడం, తెంచడం, తెంచుకోవడం గురించి ఆలోచించే దేమిటో తెలీదుగాని లోకానిక్కనబడేది మటుకు అతను కండలు పెంచుకోవడం. అలా బస్కీలు తీసి కసరత్తు చేశాక, అమాంతం ఓనాడు తండ్రి నెదిరించి వెళ్ళి పెళ్ళాన్ని తెచ్చుకుంటాడని కొందరూ, కాదు; బావమరిది తన్నడానికొస్తాడనే భయం



చొప్పున జాగ్రత్త పడుతున్నాడని మరి కొందరూ చెప్పుకుంటారు. కాని అతనలాటి చెప్పుడుమాటలు వినడు. తండ్రిమాట తప్ప మరోమాట వినడు. అదేనా తండ్రి తంతాడన్న భయంకొద్దీ.

అతన్ని బుజ్జిగాడంటారు. గుమ్మడి పండులాటి పిల్లడు. గుండ్రని మొహం, గుండ్రని చక్రాల్లాటి కళ్ళు. ఇరవైనాలుగేళ్ళ చిల్లర. అ లెఖ్ఖగూడా తెలీదు. తెలిసిందల్లా ....



'98, 99 .... న్నూరు. జై రామభక్త హనుమాన్! ... .. అమ్మా .... అమ్మోయ్!' అని గావుకేక వేశాడు బుజ్జి - నూరో బస్కీ కాగానే.

'ఏం నాయనా! ఏం;' అంటూ పరుగున వచ్చింది సూరమ్మగారు.



'నీరనం, నీరనం పాలు - గుమ్మపాలు.'

'ఇదిగో, తెస్తున్నా!...'

'చిందొరా! పెద్దొరున్నారా' అంటూ మంగలి వచ్చాడు.

'అలా కూర్చుని బిచానా తెరు, వస్తున్నా' అన్నాడు బుజ్జీ దర్జాగా. వాళ్ళ నాన్న పరంధామయ్య గారు కూతవేటు దూరంలో ఉంటే, భయభక్తులికీ - లేకుంటే దర్జాకీ, లోటు చెయ్యడు బుజ్జి.

సూరమ్మగారు, గంగాళవంత గ్లాసులో పాలుపోసి దిష్టి తగలకుండా చెంగు చాటుచేసి అందిచ్చింది. బుజ్జికూడా చిటికెలో గుటక మింగేశాడు.



ఆవిడ మండువా వసారాలో మంగలి బిచాణా చూసి కంగారుపడింది. 'ఇదేమిట్రా! మంగళవారం పూటా! మీ నాన్న చూశారంటే -'

'చూస్తే ఏం? 'బుద్దిలేని గాడిద! పెళ్ళాన్ని ఏలుకోలేని చవట-' అని ఆగి తల్లి మొహం చూసి -' అంటాడు. అంతేగా నాకేం భయమా' అన్నాడు బుజ్జి, చమత్కారవంతావాడేసి.

'సరే ఆ దుర్వాసుడు రాకముందే త్వరగాకానీ, ఆ తువ్వాలు నిండుగా కప్పుకో. దిష్టితగుల్తుంది' అంటూ లోపలికి వెళ్ళిపోయింది తల్లి.



మంగలి, బుజ్జి గడ్డానికి నబ్బువూసి క్షురకర్మ ఆరంభించాడేగాని దృష్టంతా ఎక్కడో ఉంది.

'బాబూ పెద్దొరొస్తే నన్ను చంపుతారేమో. నాచెయి వణుకుతోంది' అన్నాడు వణుకుతూ.

'ఒరేయ్ నువ్వు కత్తిపట్టిన వీరుడివి, నేను కండలు పెంచిన ధీరుణ్ణి. ఇద్దరం ఉన్నాం కానీ' అన్నాడు బుజ్జి - తండ్రి ఇప్పుడప్పుడే రాడనే ధీమాతో'.

(ఇంకావుంది)

ఈ చిత్రానికి డైలాగులు మొత్తం కొర్రపాటి గంగాధరరావు వ్రాశారు. ట్రబుల్ మేకర్‌గా ప్రసిద్ధి చెందిన ఆత్రేయకు కొద్దిపాటి వియోగాన్ని కలిగిస్తేనన్నా కొంచెం దారికి వస్తారన్న ఉద్దేశంతో ఆదుర్తి, మధుసూదనరావు కూడబలుక్కొని కావాలని కొర్రపాటి గంగాధరరావును నియమించారు. ఆయన ఈ చిత్రానికి చాలా చక్కగా పాత్రోచితమైన డైలాగులు వ్రాసి మంచి పేరు తెచ్చుకున్నారు.

కానీ బావట్లలో డాక్టర్‌గా తాను చేసుకుంటున్న ప్రాక్టీస్ దెబ్బతింటుందనే భయంతో ఆయన చిత్ర పరిశ్రమలో కొనసాగలేదు.



'ఇద్దరు మిత్రులు' శతదినోత్సవ సభలో సావిత్రి నుండి మెమెంటో అందుకుంటుంటన్న మాటల రచయిత కొర్రపాటి గంగాధర రావు

"ఇద్దరు మిత్రులు" ప్రీవ్యూ షోలు చూసిన పరిశ్రమ ప్రముఖులందరూ అభినందించారు.

ఫస్ట్‌కాపీ వచ్చిన వెంటనే వాహినీ స్టుడియోలో కట్టవలసిన బిల్లులను చెల్లించటానికి వెళ్లారు మధుసూదనరావు. వాహినీ స్టుడియో అధిపతి నాగిరెడ్డి మధుసూదనరావును చూడగానే... 'అ యామ్ జలస్ ఆఫ్ యూ' అన్నారు. 'ఎందుకండీ' అన్నారు మధుసూదనరావు ఆశ్చర్యంగా. 'ఇంత పెద్ద స్టుడియో పెట్టుకొని మేము ఇలాంటి చిత్రాన్ని తీయలేకపోయాము. రాత్రి మీ "ఇద్దరు మిత్రులు" పిక్చర్ చూశాము. రియల్లీ సుపర్బ్' అంటూ అభినందనలు కురిపించారాయన! అంత పెద్ద వ్యక్తి నుండి అభినందనలు అందుకోవడం గొప్ప అనుభూతి అంటారు మధుసూదనరావు.

మద్రాసు సినీ వర్గాల టాక్ ఆంధ్ర ప్రేక్షకుల తీర్పు ఒకటయ్యే సందర్భాలు చాలా అరుదు. వారు ఫ్లావ్ అన్న చిత్రాన్ని ప్రేక్షకులు సూపర్ హిట్ చేస్తారు. వారు హిట్ అన్న చిత్రాన్ని జనం తిప్పి కొడతారు. 1961 డిసెంబర్ 29న విడుదలైన 'ఇద్దరు మిత్రులు' ఈ రెండింటిని సమన్వయం చేస్తూ సెన్సేషనల్ హిట్ అయింది.

అప్పటి భారత కార్మికమంత్రి వి.వి.గిరి గారు హైద్రాబాద్ దీపక్ మహల్‌లో ఈ చిత్రాన్ని సతీనమేతంగా చూసి ప్రశంసల వర్షం కురిపించడం మర్చిపోలేని మధుర ఘట్టం అంటారు మధుసూదనరావు.

హైద్రాబాద్ తాజ్‌మహల్ హోటల్‌లో పనిచేసే ఒక సప్లయర్ 'ఇద్దరు మిత్రులు' చిత్రాన్ని 26 సార్లు చూశాడట! ఈ విషయం హోటల్ సూపర్వయిజర్ మధుసూదన రావుతో చెప్తే ఆయన నమ్మలేదు. ఆ సప్లయర్‌ను పిలిపించి అడిగితే, "అవునండీ ఇవ్వాళ 27వ సారి వెళ్తున్నాను" అని చెప్పాడట. ఆ చిత్రంలో అంతగా నచ్చినది ఏమిటయ్యా అని అడిగితే "ఏ ముందండీ! పగలంతా కష్టపడి పనిచేస్తాం. రాత్రి వెళ్లి హాల్లో కూర్చుంటే ఆ పాటలు వింటూ సీనులు చూస్తుంటే కష్టమంతా మర్చిపోతాము" అని చెప్పాడట.

డిసెంబరు 5 పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు జయంతి సందర్భంగా...

# 'గాయకసార్వభౌమ' పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు (1883-1951)




ఆంధ్రదేశంలో రెండు శ్రీకాకుళాలు ఉన్నాయ్. ఒకటి శ్రీకాకుళం జిల్లా... రెండోది కృష్ణాజిల్లాలోని 'శ్రీకాకుళం' గ్రామం. ఈ శ్రీకాకుళంలోనే ఆంధ్రమహావిష్ణువు దేవాలయం ఉంది... శ్రీకృష్ణదేవరాయలు ఈ దేవుణ్ణి దర్శించే ... అదే ప్రాంగణంలోని ఒక మండపంలో 'ఆముక్తమాల్యద' కావ్యానికి శ్రీకారం చుట్టాడు...

అలా సంగీతసాహిత్యాలకి నెలవైన శ్రీకాకుళంలో 1883 డిసెంబర్ 5వ తేదీన పారుపల్లి శేషాచలం, మంగమాంబ గార్లకు పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు జన్మించారు.

తండ్రి శేషాచలం గారు సంగీత విద్వాంసులు...

కాబట్టి ఉగ్గుపాలతోటే సంగీతం అబ్బింది...

అదే ప్రాంతానికి చెందిన సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిగారు దాదాపు నూటాయాభై ఏళ్ళ క్రితం .... సంగీతం నేర్చుకోవడానికి కాలి నడకన తమిళనాడు వెళ్ళి ... అక్కడ శ్రీ త్యాగరాజస్వామి వారి శిష్యులైన ఆకుమళ్ళ వెంకటసుబ్బయ్య గారు (ఆయన్నే మానాంబు చావడి వెంకటసుబ్బయ్య గారంటారు) దగ్గర శిష్యరికం చేసి మళ్ళీ కాలినడకన ఆంధ్రదేశం వచ్చి ...

ఎంతోమంది శిష్యుల్ని తయారుచేశారు. అందులో అగ్రగణ్యులు పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులుగారు ...

రాజనాల వెంకటప్పయ్య శాస్త్రి, ద్వివేదుల లక్ష్మణశాస్త్రి, సుసర్ల గంగాధరశాస్త్రి, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, మహావైద్య నాదయ్యర్ మొదలైన మహామహులంతా పారుపల్లి వారి సహాధ్యాయులే....

ఒకసారి ఊహించండి అదో సంగీత గురుకులం...

బ్రాహ్మీ ముహూర్తానికి అంతా నిద్దర్లు లేవడం...

శిష్యులంతా గబగబా క్రిష్ణా నదికెళ్ళి పోయి...స్నానాలూ...సంధ్యలూ ....

తర్వాత విబూది పెట్టుకునేవారూ .... నామం దిద్దుకునేవారూ....

అంతా వచ్చి నిశ్శబ్దంగా.... వినయంగా కూర్చుంటే ....

మంద్రమంద్రంగా వస్తున్న తంబురా నాదం మధ్యలోంచి సరస్వతీ స్వరూపులైన సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రుల వారి కమ్మని కంఠ స్వరం సంగీత పాఠాలు చెప్తోంటే.... శిష్యులు శ్రద్ధగా .... ఏకాగ్రతతో వినడం నేర్చుకోవడం.

అంతా ముక్తకంఠంతో ఆలపిస్తోంటే... ఆ నాదం ప్రకృతి అంతా ప్రతిధ్వనించడం

మల్లెలు తెల్లబోయి చూడ్డం,

మామిడిపిందెలు తలలూపడం ....

కోకిలలు సిగ్గుతో కొమ్మల్లోకి దూరి పోవడం ....

భ్రమరం తేనె కోసం పిల్లల చుట్టూ ప్రదక్షిణాలు చెయ్యడం.



పారుపల్లి

రామక్రిష్ణయ్య పంతులు

ఉదయం పాఠాలవగానే ...

శిష్యులే వంట ప్రయత్నాలు ... కండువాలేసి నడుం కట్టీ ....

గాడిపొయ్యి మీద గుండిగిలు పెట్టేవారు కొందరు.

నీళ్ళు తోడేవారు... పాలు పితికేవారు ....

కూరలు తరిగేవారు.... పప్పురుబ్బేవారు ...

పచ్చడి చేసేవారు ... వండేవారు ... వార్చేవారు ... వడ్డించేవారు

ఓహ్ అదో పెళ్ళివారిల్లూ!!

పాలూ - పంచదార కలిపి సరళీస్వరాలయేది

కత్తిపీట - కొత్తిమీర జంటస్వరాలయేది

అన్నం కుతకుతలో - ఆలాపన

అప్పడాలు వేగటంలో - వర్ణాలు

పులుసు చేస్తూ కృతులు - పరమాణ్ణం తయారు చేస్తూ కీర్తనలు వంటశాల సంగీతశాలై పోయీ...

నవరసాల్తో శ్రవణేంద్రియాలన్నీ - అక్షుల్ని - కుక్షుల్ని కూడా నింపేసేది!

అలాంటి వాతావరణంలోంచి వచ్చిన సంగీతవేత్త పారుపల్లి వారు. చల్లపల్లి అడవి చిన రామయ్యగారి దగ్గర ఠాణేదారుగా ఉద్యోగానికి తర్ఫీదు పొందీ - పెదకళ్ళేపల్లిలో ఠాణేదారుగా తన పన్నెండో ఏట నియమితులయ్యారు. కానీ సంగీతం సాహిత్యం అబ్బినవాడికి ఉద్యోగాలు రుచిస్తాయా ... తేనె రుచి మరిగినవారికి బెల్లం పాకం వెగటేయదూ!

అంచేత ఉద్యోగానికి తిలోదకాలిచ్చి ... అచ్చంగా సంగీతాన్ని ఆపోసన పట్టడం ప్రారంభించీ ... వయొలిన్, వేణువు, మృదంగం, కంజిర ఇలా అన్ని వాయిద్యాల్లోనూ నైపుణ్యం సంపాదించారు. సరే గాత్రం ఎలాగ ఉండనే ఉంది....



మొక్కపాటి రామకృష్ణమూర్తి

(1927-69)

మా నాన్నగారు మొక్కపాటి రామకృష్ణమూర్తి గారికి కర్ణాటక శాస్త్రీయ సంగీతం అంటే చాలా ఇష్టం. మా స్వస్థలమైన రాజమండ్రిలో ఏటేటా త్యాగరాజోత్సవాలు నిర్వహించడంలో ఆయనది ప్రధాన పాత్ర. శాస్త్రీయ సంగీతకారుల జీవితాలను రసవత్తరంగా అందిస్తూ వారిపట్ల, వారి కళ పట్ల ఈ తరం వారికి గౌరవాభిమానాలను పెంచుతున్న ఈ శీర్షికలో ఈ సారి వ్యాసాన్ని డిసెంబరు 11 నాన్నగారి వర్ధంతి సందర్భంగా ఆయన స్మృత్యర్థం పాఠకులకు సమర్పిస్తూ...

- ప్రసాద్

ఇంక ఆంధ్రదేశమంతటా సంగీత కచేరీలు ప్రారంభించారు.

1915లో చెన్నపట్నం పాలకులైన పెట్లండ్ ప్రభువు గారిచే తెనాలి పురపాలక వర్గం వారు సమర్పించిన స్వర్ణపత్రాన్ని అందుకున్నారు. బరోడాలో అఖిలభారత సంగీతసభలో పాల్గొని సన్మానితులయ్యారు. 1928లో కాకినాడ శ్రీరామసమాజం వారు పంతులుగారికి బంగారు గొలుసూ, పతకంతో సన్మానించారు.

పుష్పగిరి పీఠాధిపతుల చేత 'కనకాభిషేకం' చేయించుకున్నారు.

1906లో పశ్చిమ గోదావరి డిప్యూటీ కలెక్టర్‌గా ఉన్న భక్తవత్సలంగారు పంతులుగారి సంగీతానికి ముగ్ధులైపోయి 'తెలుగు రాయుని పాలెం' గ్రామానికి కరణంగా నియమించారు.

1921లో కె.వి.శ్రీనివాస అయ్యంగారు మద్రాసులోని 'గోఖలే' హాల్లో పంతులుగారి గానసభ ఏర్పాటు చేశారు.

పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు - గాత్రం

మైసూరు ఆస్థాన విద్వాంసులు చౌడయ్యగారి వయొలిన్

అలహానంది పిళ్ళే - మృదంగం

వేలాయుధం పిళ్ళే - కంజిర

ఆనాటి సంగీత కచేరీ - తరతరాల వరకు విన్నవారి స్మృతిపథంలో ఒక మధురానుభూతి మిగిలించారు. కారణం - అంతా సరస్వతీ పుత్రులే. కిటకిటలాడి పోయిన హాలు ఒక 'రసిక సముద్రం.'

ఆ సంవత్సరంలోనే ఆంధ్రా రీసెర్చ్ యూనివర్సిటీ చేత 'భారతీ తీర్థోపాధ్యాయ' అన్న పట్టాన్ని కూడా పొందారు.

1931లో అఖిలాంధ్ర పరిషద్వార్షిక మహాసభలో ... ఎంతోమంది సంగీత విద్వాంసులూ, వేలకొద్దీ రసికులూ ... విద్యావేత్తలు ... పురప్రజల సమక్షంలో సభ దద్దరిల్లిపోయేలా హర్షధ్వనుల మధ్య 'గాయకసార్వభౌమ' బిరుదు పొందారు.

అంబ నవాంబుజోజ్వల కరాంబుజ పులకరించి... చల్లగా దీవించింది. పంతులుగారి శిష్య వాత్సల్యానికి ఓ మచ్చుతునక.

అరవైడెబ్బై ఏళ్ళక్రితం ...

తిరువాయూరు త్యాగరాజ ఆరాధనోత్సవాల్లో కమిటీ మెంబరు పంతులుగారు. సరే తనతోపాటు శిష్యుడు చిరంజీవి మంగళంపల్లి బాలమురళీ కృష్ణని తీసికెళ్ళారు.

అప్పటికా కుర్రాడికి ఎనిమిదేళ్ళు.

అయితేనేం చిచ్చర పిడుగు... సరే ఆరాధనోత్సవాలు మొదలయ్యాయి. భారతదేశం నలుమూలల్నించి వచ్చిన సంగీత విద్వాంసులు తమతమ ప్రతిభా పాటవాల్ని చూపిస్తున్నారు...

బాలమురళి గురువుగారికేసి బేలగా చూశాడు!

గురువుగారికి అర్థమైంది ... కమిటీ వాళ్ళతో మాట్లాడి మా శిష్యుడు చిరంజీవి బాలమురళి కృష్ణ కచేరి చేస్తాడు అన్నారు ...

ఠత్ ... త్యాగరాజ ఆరాధనోత్సవాలంటే పిల్లలాటా, లేకా బాలానందం ప్రోగ్రామా ... వీల్లేదంటే వీల్లేదన్నారు! అక్కడి పెద్దలు.

అప్పుడు పంతులుగారు "సరే ఒక పని చేయండి. ఆరాధనోత్సవాల్లో నేను పాడటానికి కేటాయించిన సమయంలో నేను పాడను. నా శిష్యుడు పాడతాడు. మిమ్మల్ని మెప్పిస్తాడని నా నమ్మకం" అన్నారు.

సంగీత సభ ఆత్రంగా ఎదురుచూస్తోంది.

బాలమురళి గురువుగారికేసి చూసి నమస్కారం చేశాడు.

కళ్ళతోటే ఆశీర్వదించారు గురువుగారు.

ఏమి పాడాడో... బహుశా ఎందరో మహాను భావులు అన్న ఉద్దేశంతో పాడివుంటాడు.

బాలమురళి నాదం ... సభయావత్తునీ మత్తులో ముంచేసింది.

పెద్దలు అంతా చప్పట్లు కొట్టి మంగళాక్షితలు చల్లారు.

గురువుగారు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మురిసిపోయారు. ఈ సంఘటన గురించి మంగళంపల్లి వారు చెమర్చే కళ్ళతో ఎన్నిసార్లు చెప్పుకున్నారో... 'గురువంటే ఆయనా ... ఆయన శిష్యరికం నా పూర్వజన్మ సుకృతం' అనీ.

పారుపల్లి వారిదిగూడా సుసర్లవారి పద్ధతే. ఆయనకు కూడా గురుకులం ఉండేది. అయితే ఆయన ఇంట్లో అన్ని అన్ని వర్గాల వారూ, అన్ని వర్ణాల వారూ ... అన్యమతస్తులు కూడ సంగీతం నేర్చుకోవడానికి వచ్చేవారు. అందర్ని సమదృష్టితో చూసిన ఉత్తమ గురువు పారుపల్లి. ఉదాహరణకు అన్నవరపురామస్వామి, దాలిపర్తి పిచ్చిహరి, పాతూరి సీతారామయ్య చౌదరి, వంకదారి వెంకటసుబ్బయ్య గుప్త, షేక్‌చినమౌలానాసాహెబ్, జి.వి.రామ కుమారి, నల్లాన్ చక్రవర్తుల క్రిష్ణమాచార్యులుగారు, మంగళంపల్లి బాల మురళీకృష్ణ, నేతి శ్రీరామశర్మ, అరుంధతీ సర్కార్, చిలకలపూడి వెంకటేశ్వరశర్మ, ఇలా ఎంతోమంది శిష్యులకి సంగీతంతో పాటు ఇంగితజ్ఞానం కూడా నేర్పిన మహానుభావుడు ఆయన.



సుసర్ల దక్షిణా మూర్తిగారు కాలం చేశాక, ప్రతియేటా ఆయన పేరున ఆరాధనోత్సవాలు జరుపుతూ స్వయంగా 'తద్దినం' పెట్టేవారు పంతులు గారు.

అది 1951 ... సుసర్లవారి ఆరాధనోత్సవాలు ... విజయవాడలో దుర్గాపురంలో శరభయ్యగుళ్ళల్లో జరుగుతున్నాయ్.

అపరాహ్ణం వేళ!

గురువుగారికి ఆబ్దీకం పెట్టీ..

మేడదిగి కిందకి వెళ్లీ ... తూర్పు వేపున గురువుగారిని స్మరిస్తూ సాష్టాంగ ప్రమాణం ఆచరించిన పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులుగారు మరి లేవలేదు!!!

గురుస్మరణ చేసుకుంటూ నాదబ్రహ్మంలో ఐక్యమైపోయారు!

**- తనికెళ్ళ భరణి**

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్ర ప్రదేశ్ సంస్థానాలు-సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

**-భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ల భరణికి తెలియజేయదలుచుకునే వారు

**తనికెళ్ల భరణి,**
కేరాఫ్ : "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం,
13-1-212, మోతీనగర్,
హైదరాబాదు-500 018
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

**గౌరవనీయులైన భరణిగారికి,**

నమస్కారం. 1-15 నవంబరు 'హాసం'లో ద్వారం నాయుడుగారి గురించి రాసిన మీ వ్యాసం చదివి పరమానందభరితుణ్ణయ్యాను. ఆయన్ని సజీవంగా మా కళ్ళముందు సాక్షాత్కరింపజేసారు.

ద్వారం వారి గురించి నాకు తెల్సిన ఓ సంఘటన ఈ సందర్భంలో మీతో పంచుకోవాలనిపించింది. ఎక్కడో ఓ సారి జరిగిన నాయుడుగారి సంగీతసభలో ఆయన వాద్యాన్ని విని ముగ్ధుడైన ఓ ఆంగ్లేయుడు "మిస్టర్ నాయుడూ, కెన్ యు ప్లే ఇంగ్లీష్ మ్యూజిక్" అని అడిగాడట. దానికి నాయుడుగారు నోటితో సమాధానం చెప్పకుండా కమానుతో ఫిడేలు మీద ఓ రెండు రాపులు రాసి, వెంట వెంటే పాశ్చాత్య సంగీతం వినిపించారట. ఆయన రాసిన ఆ రెండు రాపులు 'వై నాట్' అని స్పష్టంగా వినిపించినట్టు ఆ కచేరి విన్న మా నాన్నగారు నాతో అన్నారు. శారదా వరప్రసాదులయితే తప్ప అంతటి మహత్తరమైన వాద్యం అబ్బుతుందా!

35 సంవత్సరాలు ఒరిస్సాలో ఉండి ఓ రెణ్ణెల్ల నుండి స్వస్థలం విజయనగరంలో ఉంటున్న నన్ను గత నాలుగు సంచికలుగా 'హాసం' అలరిస్తోంది. పత్రిక కొనగానే మొదట చదివేది మీ రచన్నే. ఓ 'పాటల రామన్న'ను, ఇంకో 'వెంకటసామయ్య'ను మరో 'పప్ప వెంకన్న'ను, ఇప్పుడు 'ఫిడేల్ నాయుణ్ణి' మాకు దగ్గరచేసి, ముమ్ముందు మరెందరో మాకు చేరువ చేయబోయే మీ వ్యాసాలు అనితర సాధ్యాలు. ఈ మహా మహితాత్ములెలా చిరస్మరణీయుల్లో, వారి ఘనతనీ, జీవిత విశేషాల్ని మాకు తెలియజేస్తున్న మీరూ బహుధా శ్లాఘనీయులే.

మీకు నా అభినందన చందనాలు

భవదీయుడు
**వెత్సా రామక్రిష్ణ**

# పద్మనాభం ఆత్మకథ



## సీరియల్ 6

దీని తరవాత నాటకరంగంపై దృష్టి మళ్లించాము. మనం నాటకంవేసి పొట్ట పోసుకోవడమే కాక ఓ నాటక కంపెనీ పెడితే పదిమందికి భుక్తి దొరుకు తుంది కదా అన్న ఆలోచన వచ్చింది. తమిళ యాక్టర్లలో ఇది పరిపాటి. వారికి సినిమా రంగానికి, నాటక



రంగానికి రెండింటికీ కేంద్రస్థానం మద్రాసే కాబట్టి పెద్ద ఇబ్బంది లేదు. నాటకాభిరుచి సినిమా షూటింగులకు అడ్డురాదు. కానీ తెలుగునటులకు అది కుదరదు. ఉండేది మద్రాసు. నాటకాలు వేయవలసినది ఆంధ్రాలో. రాకపోకలలో ఏ ఇబ్బంది వచ్చినా (అప్పట్లో ఇన్ని రైళ్లు, బస్సులు ఉండేవి కావు) సినిమా షూటింగులకు హాజరు కాలేము. అందువల్ల తెలుగురంగంలో ప్రముఖులు అభిరుచి ఉన్నా నాటకాల జోలికి పోయేవారు కారు. కానీ మేం, అంటే నేనూ, వల్లం నరసింహారావు , మాత్రం నాటకరంగాన్నించి వచ్చినవాళ్లం కదా, ఏదైనా చేయాలని గట్టిగా అనుకుని ఓ నాటకసంస్థ స్థాపించాం. దానికి రేఖా మురళి ఆర్ట్సు అని పేరు పెట్టాం. రేఖ నరసింహారావు కూతురిపేరు. మురళి మా అబ్బాయి పేరు. వాళ్లిద్దరి పేరు మీద సంస్థగా రూపొందించాము.

కమ్మర్షియల్ డ్రామా అయితేనే నలుగురూ చూసేది, నాలుగు డబ్బులు వచ్చి నటీనటులకు జీవనం గడిచేది. తమిళనాట ఆల్‌రెడీ పాప్యులర్ అయిన నాటకం తీసుకుంటే (రీమేక్ చిత్రంలా) అక్కడా, ఇక్కడా అభిరుచులు ఇంచుమించు ఒకలాగే ఉంటాయి కాబట్టి ఢోకా ఉండదనుకుని మంచి తమిళ డ్రామాకై చూడబోయాం. అదీ తమిళ సినీ నటులు వేసినదయితే (నేను సినీనటుడిని కాబట్టి) మరీ మంచిదనుకున్నాం.

ఎస్.వి. సహస్రపనామం పేరు కెక్కిన మంచి తమిళ హాస్యనటుడు. తమిళనటుల్లో చాలామంది లాగానే నాటకరంగం నుండి వచ్చినవాడు. సినిమాలకు వచ్చినా నాటకరంగాన్ని విడవని వాడు. వారి తమిళ డ్రామా 'మల్లియం మంగళం'. చాలా విజయ వంతంగా ప్రదర్శింప బడుతున్న నాటకమది.

దీనిని పద్మరాజు గారు తెలుగులో అనువదించారు. తెలుగు నాటకం పేరు - 'శాంతి నివాసం'. దీనిలో నాతోబాటు వడ్లమాని విశ్వనాథం, మహంకాళి వెంకయ్య, మోహనదాసు, రామచంద్రరావు, చిన్నచలం, ఆదోనిలక్ష్మి, మీనాకుమారి, రమాదేవి, బృందావన చౌదరి వేశారు.

దీనికి మ్యూజిక్ ఇచ్చినది - ఎస్.పి. కోదండపాణి. 1957 లో టి.నగర్ లో అబ్దుల్ అజీజ్ స్ట్రీట్‌లో ఓ అద్దె యింట్లో కోదండపాణి, సుదర్శనం, నేను వుండేవారం. అప్పటికే కోదండపాణి కొలంబియాలో తన సంగీతదర్శకత్వంలో మాధవపెద్ది సత్యంచేత ఓ ప్రైవేట్ రికార్డు పాడించారు. పాట విని నేను కోదండపాణిని జగ్గయ్యగారికి, జి. వరలక్ష్మిగారికి పరిచయం చేశాను. అప్పుడు తెనాలిలో కాలేజికై విరాళాల కోసం 'మనోహర' నాటకం బెనిఫిట్ షో వేస్తున్నారు. నాటకంలో పాటలకు కోదండపాణి ట్యూన్స్ ఇచ్చారు. అవి అందరినీ బాగా ఆకట్టుకొన్నాయి. లక్షరూపాయలు వసూలు అయింది. శ్రీ జగ్గయ్యగారు చాలా సంతోషించారు. సేలం స్టూడియో ఓనరు, నిర్మాత యం.ఎ.వి. వేణుగారికి కోదండపాణిని రెకమెండ్ చేశారు. ఆ విధంగా కోదండిపాణికి ప్రథమ చిత్రం 'పదండి ముందుకు' కు అవకాశం వచ్చింది.

కోదండపాణి మ్యూజిక్ లాగే వీటూరి పాటల రచన 'శాంతినివాసం'తో ప్రారంభమైంది. ఆయన కొన్ని పాటలు రాశారు. జానకి, సత్యారావు, మాధవపెద్దితో ప్లేబాక్ పాడారు. పాటల రికార్డింగ్ ప్రకాష్ స్టూడియోలో జరిగింది. సాంకేతిక విషయాలకొస్తే సెట్స్, లైటింగు తంగప్ప, పెరుమాళ్లు చాలా గొప్పగా నిర్వహించారు.

మొదటి ప్రదర్శన బి.యన్.రెడ్డిగారి అధ్యక్షతన మద్రాసులోని కృష్ణగాన సభలో జరిగింది. లైట్స్ ఆన్ అండ్ ఆఫ్, క్షణాల్లో సెట్సు మారడం సినిమాలా నడిచింది నాటకం. సినిమాలో లాగేనే నాటకంలో కూడా పాటలు పెట్టాం. అయితే ఓ పాట గురించి కాస్త చర్చ జరిగింది.

ఓ సన్నివేశంలో తమ్మునికి, వదినకు సంబంధం ఉన్నదని పెద్దన్న రాజు అనుమానిస్తాడు. గర్భవతిగా ఉన్న భార్యను కాలితో తన్ని వెళ్ళిపోతాడు. అప్పుడు భార్య లక్ష్మి 'దేవా ఇది న్యాయమా, నా మొర వినవా దయగనవా' అని దుఃఖంతో పాట పాడుతుంది. 'ఈ పాట వద్దు' అని రామయ్యగారు అనే తమిళకవి అన్నారు. "సినిమా అయితే ఫర్వాలేదు. స్టేజి మీద ఏడుస్తూ పాడితే ఒకవేళ జనం నవ్వారనుకో, రసాభాస అవుతుంది. నటించే



ఆర్టిస్టు మూడ్ దెబ్బ తింటుంది. సినిమాలో ఈ రిస్కు ఉండదు. ఇలాటి పాట స్టేజీమీద చూపడం రిస్కు. ఈ పాట వద్దు పద్మనాభం' అని నచ్చచెప్పబోయారు. 'ట్యూన్ చాలాచక్కగా, భావయుక్తంగా ఉన్నది. ఉంచడానికి ఈ ఒక్క అవకాశం నాకు ఇవ్వండి" అని చెప్పి వారిని ఒప్పించాను.



ప్రదర్శనలో ఈ సన్నివేశం వచ్చింది. ప్లేబాక్ పాడినది జానకి. స్టేజి మీద ఆదోని లక్ష్మి నటించింది. పాట పూర్తయింది. జనం 'వన్స్‌మోర్' అన్నారు. టేప్ రివర్సు చేసి మళ్ళీ పాడించాం. రామయ్యగారు నన్ను గట్టిగా కౌగిలించుకొని 'నువ్వే గెలిచావోయ్' అన్నారు.

ఆంధ్రలో 'శాంతినివాసం' దాదాపు 40 ప్రదర్శనలు ఇచ్చాము. నాటకం విజయవంతం కావడం చూసి నిర్మాత సుందర్‌లాల్ నహతా గారు, దర్శకులు సి.యస్.రావు గారు మా నాటకాన్ని అదే టైటిల్‌తో 'శాంతినివాసం' పిక్చర్ తీశారు. నా వేషం నాగేశ్వరరావుగారు వేశారు.

తరువాత మా సంస్థ వేసిన నాటకం - 'శ్రీకాళహస్తి మహత్మ్యం' నాటకం. సినిమాలో కాశి పాత్ర వేసానుగా. కథ నాకు కొట్టినపిండి. నేను, యస్.యల్. పెరుమాళ్లు గారు, వల్లం నరశింహారావు కూచుని బి.యల్.ఎన్. ఆచారితో స్క్రిప్టును పకడ్బందీగా వ్రాయించాం. ముఖ్యపాత్రలు వల్లం నరశింహారావు, పెరుమాళ్ళు, మహంకాళి వెంకయ్య, రాజు, రామచంద్రరావు, ప్రమీలారాణి, ఇందిరారాణి వేశారు. వేరే చెప్పనక్కరలేదు, నేను కాశీ పాత్ర వేశాను. మ్యూజిక్ కోదండపాణియే. దాదాపు మూడు వందల ప్రదర్శనలు జరిగాయి.

1958లో అబ్దుల్ అజీజ్ స్ట్రీటు నుంచి నాగార్జున నగర్‌కు తరలివచ్చాం. బాలకృష్ణ భాస్కర శాస్త్రిగారు మాకు ల్యాండు చూపించారు. నేను సుదర్శనం, కోదండపాణి, కబీర్‌దాస్ లాండ్ కొని బావులు త్రవ్వించి, పాకలు వేసి గృహప్రవేశం చేశాం. వర్షం జోరుగా వస్తూవుంది. టి. నగర్ నుంచి కోడంబాకంకు బండిలో సామాన్లు వేసుకొని రావాలి. అయినా స్వంత ఇల్లు ఆనందం కదా, తడుస్తూ నడిచి వచ్చి చేరాము. 1950లో సైకిలు కొనడం జరిగితే 1958 నాటికి ఇల్లు కొనడం జరిగింది. అంచలంచెలుగా జీవితం ఎదుగుతూ వచ్చింది.

1959. 'వెలుగునీడలు' సినిమా. అన్నపూర్ణావారి షూటింగ్. ఆదుర్తి సుబ్బారావుగారు డైరెక్టర్, నిర్మాత డి. మధుసూదనరావు గారు, అక్కినేని నాగేశ్వరరావు గారి స్వంత సినిమా. పరిచయస్తులైన డ్రామా కాంట్రాక్టర్లకు వాహినీ స్టూడియో చూపించడానికి వారితో నేను వెళ్ళాను. అక్కడ షూటింగు జరుగుతోందని తెలిసి మధుసూదనరావు గారిని, నాగేశ్వరరావు గారిని సెట్‌లో కలిశాను. 'నీకు వేషముంది, సమయానికి వచ్చావు . వెళ్ళి వేషం వేసుకో' అన్నారు. నేను నమ్మలేక పోయాను. నేను అప్పుడు వేసుకున్న డ్రస్సు బాగుందన్నారు. మార్చక్కరలేదన్నారు. వెంటనే మేకప్ చేసుకోవడం, నాగేశ్వరరావు గారి గ్రూప్‌లో కలిసిపోయి పాటలో పాల్గొనటం క్షణాలలో జరిగిపోయింది. నేను సంపూర్ణ హాస్యనటుణ్ణి కావడానికి దోహదం చేసిన చిత్రం 'వెలుగునీడలు'.

ఈ చిత్రాన్ని పి.ఎ.పి. (ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్) అధినేత సుబ్బారావు గారు, దర్శకుడు ప్రత్యగాత్మ గారు చూసి, అప్పుడు వారు తీస్తున్న 'భార్యాభర్తలు' చిత్రంలో ఇన్సూరెన్స్ ఏజంటు ఆంజనేయులు పాత్ర ఇచ్చారు. అప్పటికి హాలీవుడ్ కమెడియన్ జెర్రీలూయిస్ చిత్రాలు చూశాను. క్రూకట్ క్రాపు జెర్రీ లూయిస్ లాగా చేయించుకున్నాను. ప్రత్య గాత్మ గారు హాస్యాన్ని పండించడంలో అందెవేసిన చెయ్యి. నన్ను పక్కన కూర్చో బెట్టు కొని డైలాగులు వ్రాసే వారు. స్పాన్టేనియస్‌గా నేను జోక్స్ చెప్పేవాణ్ణి. ఆ విధమైన కలయికలో నా పాత్ర అద్భుతంగా రావడం, కమెడియన్‌గా ముద్రపడడం జరిగింది. రేలంగిగారు, సూర్యకాంతం, గిరిజ కాంబినేషన్ అప్పటికి అద్భుతంగా సాగుతోంది. నాకూ ఓ చిన్న స్థానం దొరికింది.

(ఫోటోకర్టసీ: సంజయ్‌కిషోర్) **(ఇంకావుంది)**

శ్రీ సారథి స్టూడియోస్ వారి 'ఆత్మబంధువు' సినిమాలో పద్మనాభంది కీలకమైన పాత్ర. భానుమతి గారి భర్త శ్రీ పి.రామకృష్ణ ఈ చిత్రానికి దర్శకుడు. తమిళంలో వచ్చిన 'పడిక్కాద మేదై' చిత్రాన్నే తెలుగులో 'ఆత్మబంధువు' గా తీసారు. ఈ సినిమాలో శారదని ప్రేమించి, ఆమెతో పెళ్ళికి పెద్దవాళ్ళు ఒప్పుకోక పోవటంతో ఇంట్లోంచి వెళ్ళిపోయిన పాత్ర పద్మనాభంది. తీరా కాపురం పెట్టాక 'ఆస్తి కోసం దావా వెయ్యి' అంటూ శారద నిత్యం పోరుతూవుంటే భరించలేక సన్యాసుల్లో కలుస్తాడతను. ఆ తర్వాత హీరో (ఎన్.టి.ఆర్)ద్వారా బుద్ధి తెచ్చుకున్న భార్యను చేరుకుని క్లయిమాక్స్‌కి ఉపయోగపడే పాత్రలో పద్మనాభం సహజమైన హాస్యాన్ని పండించారు.



ముఖ్యంగా ఆస్తిలో వాటా అడగమని ఒత్తిడి తెచ్చే భార్య (శారద)తో "ఇదిగో... వాటా వాటా అంటూ గలాట చేశావో మా నాన్న వీపు తాటవాలిచి 'ఒరే బేటా ఇదిగోరా నీ వాటా' అంటూ నా చేతికిస్తాడు" అనే డైలాగుకి థియేటర్ లో మంచి రెస్పాన్స్ వచ్చింది.

పెళ్ళికి ముందు ప్రేమాయణం సాగించే సన్నివేశంలో శారదతో పద్మనాభం పాడే డ్యూయెట్ ఇది. ఈ పాటను శ్రీ శ్రీ రాయగా కె.వి.మహదేవన్ సంగీతాన్ని సమకూర్చగా పి.బి. శ్రీనివాస్, జమునారాణి పాడారు. పేరుకు హాస్యనటుని కోసం సృష్టించిన పాటే అయినా ఈ రోజుల్లో హీరో హీరోయిన్లపై చిత్రీకరిస్తున్న యుగళగీతాలకి ఏమాత్రం తీసిపోని ఆనాటి ఆపాట స్థాయిని ఆసాంతం గమనించండి.

రఘు: దక్కెనులే నాకు నీ సొగసు
జానకి: ఈ టక్కు లెందుకో తెలుసు
దారులలో పలు వంకరలు
పెడదారి ప్రమాదం మనకసలు
రఘు: నీ అండగా డియర్ నే నుండగా
ఇక ఏ గండమూ లేదు ఇది సిసలు
జానకి: ఏనుగు గోతిని దిగబడదా మరి
ఎందుకు మిస్టర్ యీ పొగరు
రఘు: దక్కెనులే నాకు నీ సొగసు
జానకి: ఈ టక్కులెందుకో తెలుసు
నిలకడలేనిది మగ హృదయం
అది తలచానంటే నాకు భయం
రఘు: అగాధమైనది స్త్రీ హృదయం
అది అందగలుగుటే నా విజయం
జానకి: కాలం యోగం కలియాలి
నీ ఆగం వేగం తగ్గాలి
రఘు: దక్కెనులే నాకు నీ సొగసు
జానకి: ఈ టక్కు లెందుకో తెలుసు




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



కొన్నేళ్ళక్రితం -

ఒకానొక రోజున ఒకానొక షూటింగ్‌లో అల్లురామలింగయ్యగారు, రాజబాబు, నేనూ ఇత్యాదులం ఉన్నాం. కరెంటు పోయినప్పడో, షాటుకి 'దీపారాధన' జరుగుతున్నప్పడో నటీనటులు బయటకూచుని బాతాఖానీ వెయ్యడం సహజం. ఆ సహజసమయంలో ఏవేవో టాపిక్కులు. పొద్దున్న ఇడ్లీ తిన్నానని ఎవరైనా అన్నారంటే, అందరూ ఇడ్లీ మీదనే కబుర్లు. ఇడ్లీ అంటే ఇలా ఉండాలనీ, బెజవాడ బాబాయి హోటలు, మరేదో పల్లెటూరు, మద్రాసులో ఎక్కడో ఉన్న కుంభకోణం హోటలూ ఆ పేర్లన్నీ వస్తాయి. "ఫలానా దగ్గర ఇడ్లీ చెత్త' లాంటివి వస్తాయి. ఆ తర్వాత ఇడ్లీ ఎలా చెయ్యాలీ, ఎలాంటి చెట్నీలుండాలీ అన్నవీ చర్చల్లోకి వస్తాయి. అలా, విజ్ఞాన దాయకమైన విషయంలో సాగే చర్చలకి మంచి టైము షాటుకి లైటింగ్ టైము.

ఆ రోజు టాపిక్కు రాజబాబుని ఎవరో ఎప్పడో మోసం చేశాట్ట - గనక మోసం మీద, మోసాల మీదా కబుర్లు లేచాయి. "నువ్వు ఎలాగ వాడి వల్లో పడ్డావురా?" అని రామలింగయ్య విషయం అంతా కనుక్కున్నారు, విన్నారు. "నన్ను మాత్రం ఎవరూ సులభంగా ఏమార్చలేరు. నేను మాత్రం పడను" అన్నారు రామలింగయ్య - స్ట్రాంగ్‌గా. "అలా ఎలా చెబుతాం? కొన్ని కొన్ని నమ్ముతాం. కొందర్ని నమ్ముతాం. వాడు ఏమారిస్తే ఏం చేస్తాం?" అన్నాన్నేను వశిష్ట మహర్షిలాగో, వాల్మీకిలాగో మొహం పెట్టి. "నన్ను మాత్రం ఎవరూ ఏమార్చలేరు. అంత సులువుగా గోతిలో పడే రకం కాదీ రామలింగయ్య" అన్నారు అల్లువారు. చూద్దాంలెండి, టైము రాకపోతుందా!" అని నేను అనేలోగా ఇక్కడ టైము వచ్చింది. షాటుకి పిలిచారు.



ఇది జరిగిన ఓ మూడునెల్ల తర్వాత - 'ఏం చేద్దామా' అనిపించి, ఆలోచించి 'సరే' అనుకున్నాను.

ఉదయమే అల్లువారింట ఫోన్ మోగింది. కుర్రాడెవరో తీశారు. "రామలింగయ్య సారు ఉండారా?" అని అడిగాడు ఫోను చేసిన ఆయన. మీరెవరన్నాడు కుర్రాడు. "నేనుదా .... మురుగేశా ప్రొడక్షన్సు అనీ, దాని మేనేజరు మాట్లాడుతుండా. సారు వింటిలో వుంటురా, షూటింగా ఏమి?" అన్నాడు ఫోన్ చేసినవాడు. అతని మాట శుద్ధంగా లేదు. తెలుగు రాదు సరిగా. వచ్చీరాని తెలుగులో ఉంది మాట. కుర్రాడు చెప్పగా, రామలింగయ్య గారు ఫోన్‌లోకి వచ్చారు - సినిమా కంపెనీ మేనేజరు గనక.

మేనేజరు మళ్ళీ ముందు చెప్పిందే చెప్పి - "మేము ఒక బొమ్మ తీస్తిమి అరవంలో, అది బాగా నడుస్తాది. అందుకు, మేమే దాన్ని తెలుగులో తియ్యాలని తలిస్తిమి. డేరక్టరు దొడ్డవాడు. బాగా తీస్తుడు. ఆ తమిళ్ సినిమాలోని నాగేష్ కారెక్టరు తమరు వెయ్యాల. నేను వచ్చి తమతో డేట్సు రేట్సు అంతా మాట్లాడవాల. ఎప్పుడు, ఈ దినం వస్తునా? తమరు వింటిలో వుంటారా? ఇప్పుడు రమ్మంటే వస్తును. అడ్వాన్సు చెక్కు కూడా తెస్తును. మీ రిమ్యూనిరేషను ఎంతయినా, అదేం ఇబ్బంది లేదు. మీరుదా ఆ కారెక్టరుకి ఉండవాల - అని డేరక్టు చెప్పినారు" అని చెబుతున్నాడు.

"నేనూ - ఇవాళ నాకు షూటింగు లేదు. ఓసారి బాంకుకి పోయి రావాలి. మీరిప్పుడొస్తానంటే బాంకుకి వెళ్ళను. తర్వాత వెళతాను" అన్నారు రామలింగయ్య.

"ఇప్పుడుదా వస్తును సామీ. తొంబిది దాటితే రాగుకాలం వచ్చును. తోడ్తనే వస్తును సారూ, తమ ఇల్లు రామకృష్ణ స్ట్రీటులో కదా .... తెలుసు సారూ, వస్తును. జూన్ నుంచి షూటింగు. అవును సామీ .... టైముంది .... ముందుగా తమకి డేట్సు ఇచ్చేస్తే .... అవును సారూ, వస్తును" అని ఫోన్ పెట్టేశాడు. తమలపాకులు నిద్రలో కూడా నమిలి నమిలి, నాలికా నోరూ పళ్ళూ అన్నీ మొద్దుబారిపోయి, ముద్దగా ఉంది అతని మాట. కొంత అర్థమైంది రామలింగయ్యగారికి. సరే, ఎవడైతేనేం - వేషం మంచిది. రెమ్యునిరేషను "బేరం" ఆడనంటున్నాడు. జూన్ నెల నుంచి షూటింగంటున్నాడు. అబ్బో ఇంకా మూణ్ణెల్లుంది అనుకుంది అల్లు మనసు - ఆశగా.

రామలింగయ్యగారు స్నానాదికార్యాలు ముగించుకుని సిల్కు జుబ్బా తొడిగి దర్జాగా కూచున్నారు. మేనేజరు చెప్పినట్టు "తొంబిది" దాటుతోంది రావాలి; మనం కాలు మీద కాలేసుక్కూచుని పక్కన కుర్రాడిచేత భుజాలు నొక్కించుకుంటూ ఉంటే, మేనేజరు రెమ్యూనిరేషను పెంచినా పెంచవచ్చు. ఆ పని



కానిమ్మన్నారు రామలింగయ్య. ఫోను మోగింది. ఆయన తీశారు. "సారూ నాన్దా మేనేజరు, మురుగేశన్ ప్రొడక్షన్స్ - ఏమిలేదు సారూ - షూటింగ్ జరుగుతావుంది అడయార్లో - నేను రావడం మాల్లేదు. మీరు బాంకుకి పోయి రండి. నేను పండ్రెండు గంటకు వస్తును సామీ" అన్నాడు. సరే అన్నారు అల్లు. "ఇక, బాంకు మూడ్ పోయింది. ఇంక వెళ్ళను - పన్నెండుకొస్తాడుగా" అనుకున్నారు.

'పండ్రెండు'కి మళ్ళీ ఫోను. "లంచ్ టైములో ఫ్రీగా ఉంటాను. అప్పుడుదా వస్తును సామీ. తాము నిదరపోతారా - అప్పుడైతే నాలుగ్గంటకి వస్తునా - అది బెస్టు సామీ! వస్తును" అంది ముద్దమాట నోరు. లంచ్ తర్వాత నిద్రపోయి, ఆ నిద్రలోనే కాసిన్ని కలలు కూడా కనేసి - తొందరగా లేచిపోయి, మళ్ళా సిల్కు జుబ్బా ధరించి సోఫాని అలంకరించారు నాలుగు దాటింది. విసుగులాంటిదీ వచ్చింది. పొదునుంచి ఎక్కడికీ కదలనీయకుండా ఈ మేనేజరు ఇంట్లో కూచోపెట్టినందుకు చిన్న మంట కూడా పుట్టింది. దాన్నీ చుట్టమంటనీ చల్లార్చుకుని, గుమ్మం ముందు వసారాలో తారాడ్డం మొదలుపెట్టారు.

నేను మామూలుగా రామలింగయ్యగార్ని చూడ్డానికి వెళ్ళాను. ఆయన పచార్లు చేస్తున్నారు. నన్ను చూసి రమ్మన్నారు - కూచోమన్నారు. "మీరేదో ఆందోళనతో ఉన్నట్టున్నారు - అడావుడిగా" అన్నాను. "ఏం లేదు" అని మురుగేశా ప్రొడక్షన్ మేనేజరు సంగతి చెప్పారు. "నా పనంతా పాడు చేశాడు, ఎప్పుడొస్తాడో ఏమిటో" అన్నారు చిరాకు ప్లస్ విసుగుతో.

"వాడు ఏమి వస్తుడు? వాడు రాడు సామీ" అన్నాన్నేను. ఒక్కసారి ఆ గొంతు వినిపించగానే ఛట్టున తిరిగి చూసి - "ఏమిటి - మీరా అది? మీరేనా అలా మాట్లాడి నా పనంతా చెడగొట్టింది? ఏంటయ్యా ఆ పని?" అన్నారు రామలింగయ్య విసుగు ప్లస్ చిరాకులకి చిరుకోపం కూడా మిళాయించి.

"అయ్యా కోప్పడకండి. మూణ్ణెల క్రితం మీరు అన్నారు - మిమ్మల్నెవరు ఏమార్చలేరని - గుర్తుందా? ఆ పని నేనే చేదామని ఇలా చేశాను. ఇంతకీ ఇవాళ ఏప్రిల్ ఫస్టు" అన్నాను కూల్‌గా. ఆయనకి మండింది. నోట్లో చుట్ట కూడా మళ్ళీ మండింది. ఆ మంటల్లోంచి - అగ్నిలోంచి ద్రౌపది పుట్టినట్టు - చిరునవ్వు పుట్టి చిలికి చిలికి, హాసమై అట్టహాసమైంది. "భలే వాడివయ్యా నువ్వు" అన్నారు.

"అప్పుడప్పుడు ఇలాంటి వన్ని చెయ్యకపోతే హాస్యం పుట్టదు. అందులో రామలింగయ్య గారు కాబట్టి ఎలాంటి ప్రాక్టికల్ జోకైనా చెయ్యొచ్చు" అన్నాన్నేనున్నూ పళ్ళు ఇకిలిస్తూ.

***

నాకో చిన్న జబ్బుంది. కొంతమందిని అనుకరించడం. ఆరుద్ర గారినీ, ఆయన ఉపన్యాస విధానాన్నీ అనుకరించేవాణ్ణి - సరదాగా బాపు, రమణ గార్ల దగ్గరా అక్కడా. సరస హృదయులు గనక, బాగా ఎంజాయ్ చేస్తారు గనక, గుమ్మడి గారి దగ్గర ఆరుద్ర గారి స్పీచ్‌ని అనుకరిస్తూ పారడీ చేశాను.



ఆయన పకపక నవ్వి "సరదాగా రికార్డు చేదాం. వినేవాళ్ళు ఆరుద్ర గారనే అను కుంటారా, లేదా చూదాం" అన్నారు. 'ఎందుకు లెండి' అనినేను మొహమాటపడినా, ఆయన ఎదురుగా టేప్‌రికార్డరు పెట్టి "కానీండి" అనగానే తప్పలేదు. రికార్డు చేసి వినిపించారు. 'కరెక్ట్' అన్నారు. కాస్సేపు ఆయనతో జోకులు పంచుకుని ఇంటి కెళ్ళిపోయాను. వెళ్ళిన పావు గంటకి ఫోను కొట్టింది. ఆరుద్రగారి భార్య రామలక్ష్మి గారు! "చాలా బావుంది - ఆరుద్ర ఉపన్యాసం .... పారడీ బావుంది" అన్నారామె. నా గుండె ఝల్లుమంది. ఏమిటి గుమ్మడి గారు చేసింది! వెళ్ళి వెళ్ళి వాళ్ళింటికే వెళ్ళి వాళ్ళకే వినిపించేశారా! .... ఇష్టం వచ్చినట్టు పారడీ చేసి మాట్లాడేశానే .... అంతలో ఆరుద్రగారు ఫోన్‌లోకి వచ్చారు. "చాలా బాగుంది. నా కంటే బాగా మాట్లాడారు" అన్నారు ఆనందపడిపోతూ. అది అభినందనా - మందలింపా - తెలీలేదు. అంతలో పకపకమని నవ్వు ఫోన్‌లో - గుమ్మడిగారు. "ఏమిటి సార్ మీరూ .... అంతలో తీసుకెళ్ళి ఆయనకే వినిపించేశారా .... ఏం బావుంది" అన్నాను. "చాలా బావుంది. ఆ ఆనందాన్ని వాళ్ళతో పంచుకోవాలని, తెచ్చి వినిపించాను. ఏం అనుకోర్లెండి .... బాగా ఎంజాయ్ చేశారు " అన్నారు వెంకటేశ్వరరావు గారు. ఆరుద్ర గారు చాలా స్పోర్టివ్. తెలుగు మాస్టారి మీద పెట్టి ఆయన మీద ఎన్ని జోకులు వేసినా భరించే హృదయ వైశాల్యం ఆయనది. ఐనా .... ఈ పారడీ .... గుండె ఓ అరగంటపాటు కొట్టుకుంటూనే ఉంది. "నేను దెబ్బతిన్నానే" అనుకున్నాను. ఇంకా నయం! గుమ్మడిగారి టేపులో ఎన్.టి.రామారావు గారిని అనుకరించడం కూడా ఉంది. అది తీసుకెళ్ళి రామారావు గారికి వినిపించేస్తారేమో - మళ్ళీ నన్ను నేనే సమాధాన పరచుకున్నాను. ఆ టేప్ చెరిపేసి వుంటార్లే - అని.

***

ఒకసారి బాపుగారు, రమణగార్లతో కలిసి కారులో ఏదో ఊరు వెళ్తున్నాం. దారిలో చిన్న ఊరు. బాపు గారు బంక్ దగ్గర కారు ఆపి, పెట్రోలు పోయిస్తున్నట్టున్నారు. ఆ పక్కనే టెంట్ సినిమా హాలుంది. అందులో తెలుగు డబ్బింగ్ సినిమా ఆడుతోంది - పోస్టరు చూశాను.

బాపు గారు ఏదో అడిగారు. నేను మాట్లాడలేదు. మళ్ళీ అడిగారు - "మిమ్మల్నేనండీ మాట్లాడరేమిటీ?" అన్నారు. నేను నోరు తెరవలేదు. ఏదో సైగ చేశాను. రమణగారు కూడా ఏమైందన్నట్టు చూశారు. "ఈ డబ్బింగ్ సినిమాలో నేను ఒక కారెక్టర్‌కి డబ్బింగ్ చెప్పాను. నేను మాట్లాడాననుకోండి. ఆ సినిమా ప్రేక్షకులందరూ నా గొంతు గుర్తు పట్టేసి, నా చుట్టూ మూగేసి కారు చుట్టూ నిలబడి, ఆటోగ్రాఫ్‌లు అవీ అడిగేస్తారు. అందుకని నోర్మూసుకున్నాను" అన్నాను. ఇద్దరూ నవ్వారు." అయితే నా వేళ్ళు కూడా చూపించకూడదు. నేను బాపునని



గుర్తుపట్టేస్తారు" అన్నట్టుగా అన్నారు బాపు.

***

'సంపూర్ణ రామాయణం' షూటింగు జరుగుతోంది. నేను మామూలుగా వెళ్ళి బాపుగారిని పలకరించి షూటింగ్ చూస్తున్నాను. షాట్ అయిపోయిన తర్వాత, ఫస్ట్ ఫ్లోర్‌లో ఇంకో సెట్టు వేస్తున్నారని చూడ్డానికి వెళ్ళారు బాపుగారు. నేనూ వెళ్ళాను. ఒక గోడకి కొంత వరకూ పెయింట్ వేసి ఆపేశారు.

"ఈ గోడ ఇంకా కంప్లీట్ చేసినట్టులేదే" అన్నాన్నేను ఏదో ఒకటి అనాలిగదా అని.

"బడ్జెట్ అయిపోయింది" అన్నారు బాపు - అందర్నీ నవ్విస్తూ.

# హాస్యవల్లరి సంగీతలహరి
# కిశోర్ జీవనఝరి

- ఎమ్మెస్ స్వాతి



**అక్టోబరు13, 1987.**

అనూప్ కుమర్ వచ్చిన కాస్సేపటికే అశోక్‌కుమార్ వచ్చాడు. ఆవేళ సాయంత్రం 5.30కు అశోక్‌కుమార్ ఇంటికి కిశోర్‌కుమార్, హృషీకేశ్ ముఖర్జీ వెళ్లవలసివుంది. పుట్టినరోజు పూట కూడా షూటింగ్ ఉండడంతో అశోక్‌కుమార్ స్టూడియోకి వెళ్లాడు. సరిగ్గా 5.30కు ఫోన్ వచ్చిందని చెప్పాడు అసిస్టెంటు డైరక్టరు. వాళ్లిద్దరూ తన ఇంటికి వచ్చి వెయిట్ చేస్తున్నామని ఫోన్ చేశారేమోననుకుంటూ ఫోన్ తీసుకున్నాడు అశోక్. కానీ ఆ ఫోన్ చిన్నారి తమ్ముడు ఇక లేడన్న శోకవార్త తెలిపింది.

## బాల్యం

కిశోర్‌కు ఏడు సంవత్సరాల వయసు వచ్చేనాటికే అశోక్‌కుమార్ సినిమాలు రిలీజయిపోయి, పెద్ద హీరో అయిపోయాడు. అతను ఖాండ్వాలో తమ ఇంటికి వెళ్లినప్పుడు రాచమర్యాదలు జరిగేవి. చిన్నారి కిశోర్‌కు ఇదంతా అర్థమయ్యేది కాదు. "ఎవరితను? మనింటికి ఇంత తరచుగా వస్తాడెందుకు? మీరంతా అతనంటే పడిచస్తారెందుకు?" అని ఏడ్చాడొకసారి. అప్పుడు తల్లిదండ్రులు అతనికి విశదీకరించి చెప్పారు. అన్నయ్య సినిమా హీరో అని తెలిసిన తరువాత అతనిపై గౌరవం పెరిగింది. అప్పట్లో కిశోర్ ఫేవరేట్ హీరో శంకర్ వజ్రే అనే పహిల్వాన్. స్టంట్ సినిమాల్లో పదేసిమందిని చిటికినవేలుతో కొట్టిపడేసేవాడు వజ్రే. అన్నయ్య కూడా అలాటి హీరోనే అనుకుని తన ఫ్రెండ్స్‌ని వెంటపెట్టుకుని "అఛూత్ కన్యా" సినిమాకు వెళ్లాడు. "మా అన్నయ్య బొంబాయిలో పెద్దహీరో తెలుసా?" అని గొప్పలు చెప్పుకున్నాడు.

సినిమాకెళ్లి చూస్తే ఒక్క ఫైటూ లేదు. క్లైమాక్స్‌లో అశోక్‌కుమార్ విలన్‌తో కాసింత ఫైట్ చేసాడంతే! ఫ్రెండ్స్ అంతా నవ్వేయడంతో కిశోర్‌కు తలకొట్టేసినట్టయింది. "ఇదే శంకర్ వజ్రే అయితేనా?" అన్నారు ఫ్రెండ్స్. వాళ్లని తప్పించుకుని తిరిగాడు కొంతకాలం. ఒకసారి అన్నయ్య బొంబాయి నుండి వచ్చినప్పుడు అడిగిచూసాడు కూడా. -"నీకు వజ్రేలా ఫైట్ చేయడం రాదా?" అని. అన్నగారు స్క్రిప్టు, గిప్టు అంటూ ఏదో చెప్పాడు కానీ కిశోర్‌కి నమ్మబుద్ధి కాలేదు. అన్నగారు పెద్ద హీరో కాదన్న ఫీలింగు కలిగిందతనకి.

పెద్దవుతున్న కొద్దీ, సెలవుల్లో కిశోర్ బొంబాయిలో అన్నగారి వద్దకు వెళ్లి వస్తూండేవాడు. అప్పుడు అశోక్ మలాడ్‌లో బాంబేటాకీసు స్టుడియోకి దగ్గర్లో వుండేవాడు. చుట్టూ అందరూ సినిమావాళ్లే. అందర్నీ పోగేసి అశోక్ ఇంట్లో కిశోర్ ప్రోగ్రాంలు ఇచ్చేవాడు. పాడడం, డాన్సు చేయడం, మిమిక్రి చేయడం, సినిమాల్లో సీన్స్ ఇమిటేట్ చేసి చూపడం - ఒకటేమిటి, రకరకాలుగా ఎంటర్‌టెయిన్ చేసేవాడు. అవన్నీ చూసినవాళ్లు ఈ కుర్రాడిలో మంచి స్పార్క్ ఉంది అనుకునేవారు.

## సినిమాలో ప్రవేశం

ఇంటర్‌తో చదువు కట్టిబెట్టి 1946లో బొంబాయి చేరిన తర్వాత కిశోర్ గాయకుడు అవుదామనుకున్నాడు. ఆ విషయమే అన్నగారికి చెప్పాడు. కాస్సేపు ఆలోచించాక, అశోక్ చెప్పాడు, "నువ్వు సైగల్‌ను అనుకరించి పాడుతూ, గొప్ప పాటగాడిని అనుకుంటున్నావు. మైకు ముందు పాడడం అంటే మాటలు కాదు. నీకంటూ ఓ స్టయిల్ ఏర్పడాలి. దానికి చాలా టైము పడుతుంది. ఈ లోపున నువ్వు చిన్న చిన్నవేషాలు వేస్తూ ఉండు. క్రమంగా నీకూ పాటలు పాడే అవకాశం వస్తుంది. నీకు వేషాలిప్పించే సంగతి నేను చూసుకుంటాను."

ఇంటికి పెద్దకొడుకుగా అశోక్‌కుమార్ తన బాధ్యతలను అతి సీరియస్‌గా తీసుకునేవాడు. తమ్ముళ్లను ఒక దారిలో పెట్టాలని తహతహలాడేవాడు. అప్పటికే కంగన్, బంధన్, ఝూలా, నయాసంసార్, కిస్మత్ వంటి చిత్రాల ద్వారా అశోక్ ఎంతో ఖ్యాతిని, ఆస్తిని ఆర్జించివున్నాడు. గాయకులకు కంటే నటులకే ఎక్కువ పారితోషికం వస్తున్నప్పుడు కిశోర్ యాక్టర్ అవడమే మంచిదని అతని అభిప్రాయం.

కానీ కిశోర్ అభిప్రాయం వేరు. అనాటి రొమాంటిక్ హీరోల ఇమేజి తనకెప్పటికీ రాదని, దానికి బదులు తనకు ఇష్టమైన సింగింగ్ కెరియర్‌ను నమ్ముకుంటేనే మంచిదని అతని ఉద్దేశ్యం. కానీ అన్నతో గట్టిగా వాదించడానికి భయం. అందువల్ల అన్నకు చెప్పకుండా అనేక స్టూడియోల చుట్టూరా తిరిగాడు. కానీ కిశోర్ ఆ పాత్ర సరిగ్గా వేయలేదు. అసలు అతనికి నటన



**పాత్రధారి సూత్రధారి అయినవేళ -జీవితమంతా తనను డైరక్ట్ చేసిన అన్నగారిని తెరపై డైరక్టు చేస్తూ కిశోర్ - 'దూర్ కా రాహీ' చిత్రం వర్కింగ్ స్టిల్.**

అంటేనే ఇష్టంలేదు. అన్నగారి మాట కొట్టేయలేక వేషం వేశాడు కానీ కావాలని పాడుచేసేవాడు.

అయినా అశోక్ వదలిపెట్టలేదు. కిశోర్ తన కాళ్లమీద తాను నిలదొక్కుకోవాలంటే నటన ఒక్కటే మార్గం అని గట్టిగా నమ్మాడు. "ఫరేబ్" వంటి చిత్రాలలో కిశోర్ నటించడానికి కారణం - అతను అన్నగారికి ఎదురుచెప్పలేకపోవడం. హాలీవుడ్ గాయకనటుడు డేనీ కేయే సినిమాలు చూసి కిశోర్ ఇన్‌స్పైరై 'ముకద్దర్' (1950)లో ఆ తరహా వేషం వేసేవరకు అతను నటనను ప్రేమించలేదనే చెప్పాలి.

### సింగరా? యాక్టరా?

"జిద్దీ" తయారవుతూండగానే కిశోర్ ఆ సినిమాకు సంగీతదర్శకుడయిన ఖేమ్‌చంద్ ప్రకాష్‌కు తన పాట వినిపించాడు. అతను ఇంప్రెంస్ అయి అశోక్‌కుమార్‌తో "మీ వాడికి సింగర్‌గా మంచి భవిష్యత్తు ఉంది." అన్నాడు. అశోక్‌కు ఆశ్చర్యం వేసింది కానీ ఏమీ అనలేదు. ఖేమ్‌చంద్ ప్రకాష్ పట్టుదల కొద్దీ కిశోర్ చేత "మర్నే కి దువాయే క్యోం మాంగూఁ" అనే పాట పాడించాడు.


చిన్నారి సుమిత్‌ను పలకరిస్తున్న పెదతండ్రి

ఈ పాటల్లో కిశోర్ సైగల్‌ను అనుకరించేడన్నది స్పష్టంగా కనబడే విషయం. ఆ నాటి గాయకులందరూ సైగల్ ప్రభావానికి లోనయినవారే! (ముకేష్ తొలిగీతం - 'దిల్ జల్తా హై జల్‌నే దో' వినండి) కిశోర్ అయితే మరీను.

## డిసెంబర్ 10 అశోక్‌కుమార్ ప్రథమ వర్ధంతి

### అశోక్ అడుగుజాడల్లో కిశోర్


అశోక్, కిశోర్ తెరమీద కూడా సోదరులుగా నటించిన సీరియస్ చిత్రం ఎ.వి.యం. వారి "భాయ్, భాయ్"లో ఒక దృశ్యం.

కిశోర్ చిన్నప్పుడే సంపాదన మొదలు పెట్టాడు. అదీ అన్నగారి పాటల ద్వారా. వాళ్ల తల్లిదండ్రులకు అశోక్‌కుమారంటే మహా ముచ్చటగా ఉండేది. "అఛూత్‌కన్యా" లో అశోక్‌కుమార్, దేవికారాణి యుగళగీతం "మైఁబన్ కీ చిడియా" అంటే వాళ్ల నాన్నకి మహా ఇష్టం. ఇంటికి ఎవరైనా వస్తే "ఒరే కిశోర్, ఆపాట పాడరా" అని పురమాయించేవారు. కిశోర్ పాటపాడేవాడు కానీ పాడాక అర్ధరూపాయి చార్జి డిమాండు చేసేవాడు. "పావలా చాల్లేరా" అంటే "లేదు, లేదు నేను అన్నదీ, దేవికారాణిదీ ఇద్దరి గొంతులతోనూ పాడాలి కదా అందుకే డబల్ చార్జ్" అనేవాడు.

తన తమ్ముడిని యాక్టర్‌గా పరిచయం చేయడానికి అశోక్‌కుమార్ "అఛూత్‌కన్యా' 'ను పునర్నిర్మిద్దామనుకున్నాడు. తనూ, దేవికారాణి వేసిన హీరో హీరోయిన్ పాత్రలను కిశోర్, నళినీజయవంత్‌ల చేత వేయిద్దామనుకున్నాడు కానీ కాపీరైట్ ఎవరివద్ద ఉందో తెలియకపోవడం వల్ల అతని ప్రయత్నాలు ఫలించలేదు.

1961లో కిశోర్‌కుమార్ శంకర్ ముఖర్జీ దర్శకత్వంలో "ఝుమ్రూ" సినిమా తీసాడు. దానికి సంగీత దర్శకత్వం అతనే వహించాడు. ఒక చక్కని విషాదగీతం పెట్టవలసిన సన్నివేశంలో అతనికి అశోక్‌కుమార్ చిత్రం "ఝూలా (1941)"లోని పాటట్యూన్ గుర్తుకువచ్చింది. అన్నగారిని అడిగాడు. ఆ ట్యూన్ అయితే ఎలా వుంటుందని. "అది చాలా కష్టమైన ట్యూన్. ఝింఝోటీ రాగం మీ ఆధారపడిందది." అని చెప్పాడు అశోక్. కిశోర్ నవ్వి 'ఆ రాగాల గొడవ నాకు తెలియదు కానీ నా స్టయిల్లో నేను పాడతాను చూడు.' అని ఆ పాటకు బాణీ కట్టాడు, పాడాడు. ఆపాట "కోయీ హమ్‌దమ్ న రహా" సూపర్‌హిట్ అయింది. ఇవన్నీ చూసి కిశోర్ ఎప్పుడూ అశోక్‌కుమార్ అడుగుజాడల్లోనే నడిచాడని అనుకోవద్దు. ఎ.వి.ఎమ్. వారి 'భాయ్, భాయ్' సినిమాలో ఇద్దరూ నటించేటప్పుడు డైరక్టరు ఎం.వి.రామన్ వచ్చి అశోక్‌కు ఫిర్యాదు చేశాడు, "చూడు మీ తమ్ముడు, చిన్నసీను వేయాల్సివుంది. ఏదో గొణుక్కుంటూ అటూ, ఇటూ నాలుగు అడుగులు వేస్తే చాలు, అది కూడా చేయనంటున్నాడు. ఇలా అయితే ఎలా?" అని.

"ఏరా? నిజమేనా?" అని తమ్ముణ్ని అడిగితే 'అవునన్నయ్యా, వాళ్లు అయిదువేలివ్వాలి. సీనుకి ముందే ఇస్తానన్నారు. ఇవ్వలేదు." అన్నాడు కిశోర్. రామన్‌ను అడిగితే 'డబ్బు వస్తోంది, దార్లో ఉంది. ఈలోగా సీను వేసేయమనండి' అన్నాడు. 'వీళ్ల మాట నమ్మకన్నయ్యా, అంతా అబద్ధం' అన్నాడు కిశోర్. 'నేను చెబుతున్నాను, చెయ్' అని పట్టుబట్టాడు అన్నగారు.

'సరే, అలాగే కానీ' అంటూ కిశోర్ సెట్లోకి వచ్చాడు. కెమెరా రీలు తిరగడం మొదలుపెట్టగానే 'పాంచ్ హజార్', 'పాంచ్ హజార్' అని గొణుగుతూ నాలుగు అడుగులు వేయడం, ఓ మొగ్గ వేయడం, మళ్లీ అలాగే గొణుగుతూ ఇంకో నాలుగు అడుగులు వేయడం. చూసేవాళ్లందరికీ మతిపోయింది. ఇంతలో కిశోర్ ఫ్లోర్ చివరకు వచ్చాడు. అక్కడున్న బండిచక్రాన్ని ఓ తాపు తన్ని ఒక్క గంతులో స్టూడియో బయట పడ్డాడు. బయట డ్రైవర్ కార్లో రెడీగా ఉన్నాడు. 'పోనీ' అన్నాడు కిశోర్.

అశోక్ కుమార్ దిగ్భ్రాంతుడయి చూస్తూండగా రామన్ వచ్చి చెప్పాడు - 'నిజానికి డబ్బు ఏర్పాటు కాలేదు. ఉత్తినే అబద్ధం చెప్పాను. ఈ సారికి మాత్రం మీ వాడు చేసింది కరక్టే ' అని!

సైగల్ అంటే అతనికి మహా ప్రేమ. బొంబాయి వచ్చి సైగల్‌ను దర్శనం చేసుకోవాలని తహతహలాడేడు. కానీ అదృష్టం బాగాలేక, కిశోర్ బొంబాయి వచ్చిన కొన్ని నెలలకే సైగల్ అమరుడయ్యాడు. 1947లో సైగల్ మరణానంతరం అతని తరహా పాటలు వెనుకబడి, కొత్త గొంతుకలకోసం అన్వేషణ ప్రారంభమయింది. రఫీ, తలత్, ముకేష్ అందరూ సినీరంగానికి వచ్చారు కానీ ఇంకా సెటిల్ కాలేదు. పాటలలో కవిత్వమైతేనేం, పాడే ధోరణి అయితేనేం, చాలా మార్పులకు లోనవుతోంది. అందుచేత కిశోర్ గాయకుడిగా రావాలనుకోవడంలో సబబు ఉంది. కానీ అశోక్‌కుమార్‌కు కిశోర్ వాయిస్ పై నమ్మకం లేదు. పైగా అ వృత్తిలో డబ్బులు ఎక్కువ రావు.

1946లో 'జిద్దీ'లో పాట పాడినా కిశోర్ గాయకుడిగా పేరు తెచ్చుకోవడానికి తొమ్మిది సంవత్సరాలు పట్టింది. అప్పటికైనా అతను ఆ స్థాయికి వచ్చాడంటే దానికి కారణం - ఎస్.డి.బర్మన్. అతను కిశోర్ వాయిస్ వినడం యాదృచ్ఛికంగా జరిగింది. అప్పట్లో బర్మన్ అశోక్‌కుమార్ తీస్తున్న 'మషాల్' సినిమాకు సంగీతాన్నిస్తున్నాడు. అంతకు ముందు బొంబాయి అనుభవాలతో విసిగిపోయిన బర్మన్ కలకత్తాకు తిరుగు ప్రయాణం కడితే అశోక్ అతన్ని బతిమాలి 'మషాల్' సినిమా మ్యూజిక్ డైరక్షన్ అప్పగించాడు.

అందువల్ల బర్మన్ తరచుగా వోర్లిలో ఉన్న అశోక్ ఇంటికి తరచుగా వస్తూ వెళుతూండేవాడు. ఓ రోజు అలా వాళ్లింట్లో కూచుని ఉండగా ఇంట్లోంచి ఎవరో పాడుతూండడం వినబడింది. అది సైగల్ పాట. అచ్చు అలాగే పాడుతున్నారెవరో. 'ఎవరది?' అని అడిగాడు బర్మన్.

'మా తమ్ముడు కిశోర్. బాత్‌రూమ్ సింగర్. సాంగ్ లేందే బాత్‌యే లేదు వాడికి.' అన్నాడు అశోక్ నవ్వుతూ.

కిశోర్ గానం, స్నానం ముగించుకుని హాల్లోకి వచ్చేదాకా ఆగి బర్మన్ అతన్ని అభినందించాడు - 'నువ్వు గొప్పగాయకుడివి అవుతావు.' అన్నాడు. కిశోర్ మొహం విశాలమయిపోయింది.

'..కానీ నువ్వేం చేయాలంటే నీ స్టయిల్ నువ్వు డెవలప్ చేసుకోవాలి. సైగల్ గొప్ప గాయకుడే. కానీ అతన్ని అనుకరించినవాళ్లు గొప్ప గాయకులు కాలేరు.'' అని చేర్చాడు బర్మన్. ఆ పాటి ప్రశంస కూడా అప్పటిదాకా లభించని కిశోర్ ముగ్ధుడయిపోయి, బర్మన్‌కు దాసుడయిపోయేడు. ఇద్దరిమధ్యా వయసులో ఎంతో తేడా ఉన్నా, జీవితకాలం నిలిచే స్నేహం ఏర్పడింది.

కిశోర్ బర్మన్ వెంట తిరిగేవాడు.



**వయసులో తేడా వారి అనుబంధానికి అడ్డు రాలేదు. కిశోర్‌ను మంచి గాయకుడు చేసిన బర్మన్**

స్టుడియోలకు వెళ్లినప్పుడు కూడా, కూడా వెళ్లేవాడు. తాను విన్న పాటలు, ట్యూన్‌లు చెప్పేవాడు. ఈ అనుబంధం వల్ల బర్మన్ బెంగాలీ సంగీతసంపద గురించి కిశోర్‌కు తెలిసింది, కిశోర్ తన వాయిస్‌ను ఎంత బాగా మోల్డ్ చేసుకోగలడో బర్మన్‌కు తెలిసింది. స్వయంగా గాయకుడయిన బర్మన్ పాటలు ఎలా పాడాలో కిశోర్‌కు ఎన్నో మెలకువలు నేర్పాడు. దీనివల్ల కిశోర్‌కు ఆత్మవిశ్వాసం పెరిగింది. తన విలువ తను తెలుసుకోగలిగాడు.

ఖాండ్వాలో హిందీ సినిమాలు మాత్రమే చూసే కిశోర్ బొంబాయి వచ్చాక హాలీవుడ్ సినిమాలు కూడా చూడసాగేడు. డేనీ కేయే 'నాక్ ఆన్ ది వుడ్' చూడగానే అతను అదిరిపోయాడు. తను వేయవలసినది అటువంటి టోటల్ ఎంటర్‌టైనర్ పాత్రలని అతనికి తెలిసివచ్చింది. అతన్ని ఇమిటేట్ చేస్తూ అతని తరహా బ్రాడ్వే స్టయిల్ టాప్ హేట్, స్టిక్ పట్టుకుని 'ముకద్దర్' (1950) సినిమాలో ప్రత్యక్షమయ్యాడు. నాలుగైదు సార్లు కనబడినా పాటలు పాడుతూ, డాన్సు ఆడుతూ కనబడతాడు. అతను పాడిన 'ఆతీ హై యాద్ హమ్‌కో జనవరీ ఫిబ్రవరీ, పెహలీ పెహలీ ములాకాత్ హుయీ మేరీ తుమ్హారీ' పాట లిరిక్ చూస్తేనే తెలిసిపోతుంది, ఆ టైపు హిందీ సినిమాలకు కొత్త అని.

దేవ్ ఆనంద్‌తో పరిచయం కారణంగా, బర్మన్ ఆదరణ కారణంగా, కిశోర్‌కు మునీంజీ, పేయింగ్ గెస్ట్, ఫంటూష్, నౌ దో గ్యారహ్ వంటి సినిమాలలో పాటలు పాడే అవకాశం రావడంతో కిశోర్ గాయకుడిగా పేరు తెచ్చుకున్నాడు.

కానీ ఎంతయినా కిశోర్‌కి శాస్త్రీయ సంగీతం రాదనీ, ఖవ్వాలీలు అవీ పాడలేడనీ అతన్ని ప్లేబ్యాక్‌కు పెద్దగా పిలిచేవారు కారు. సరదాపాటలకు కిశోర్ పెట్టింది పేరయినా, అప్పట్లో మెయిన్ స్ట్రీమ్ సంగీతానికి రఫీ నప్పినట్లుగా కిశోర్ నప్పడన్నది నిర్వివాదాంశం. అందువల్ల కిశోర్ గాయకుడిగా పైకి రాలేకపోయాడు. ఈ విషయం అశోక్ ముందే గ్రహించినట్లున్నాడు. అందుకనే నటన నుండి దృష్టి మరల్చవద్దని పట్టుబట్టేవాడు. అన్నగారి మాట విని ఒకవక్క వేషాలు వేస్తూండగానే 'బాప్ రే బాప్' వంటి హిట్ చిత్రం వచ్చి అతన్ని స్టార్‌ను చేసింది.

తమ్ముడు నటుడు కావాలని వాంఛించిన అన్నగారే అతనే సింగర్‌గా మారాలని సలహా ఇచ్చిన సందర్భం ఇన్‌కమ్‌టాక్స్ రెయిడ్ వల్ల జరిగింది. ప్రాక్టికల్‌జోక్స్ వేసే కిశోర్ యాక్టర్ అవుతే మారుతాడని ఆశించిన అన్నగారికి ఆశాభంగం అయింది. ''హాఫ్ టిక్కెట్'' షూటింగులో తమ్ముడు చేసిన తిక్కపని అతనికి ఎంతముప్పు తెచ్చిపెట్టిందో చూశాక అతడు యాక్టర్‌గా కొనసాగాలని అన్నగారు పట్టుబట్టలేదు. సినిమా నిర్మాణం చాలా క్లిష్టమైనది. కిశోర్ వంటి మూడీ ఫెలోను హీరోగా పెట్టుకోవడానికి ఏ నిర్మాతా ముందుకు రాడని అశోక్ వేసిన అంచనా సరయినదే. క్రమంగా కిశోర్ సినిమాలు తగ్గిపోయాయి. అన్నగారు ఇచ్చిన స్టేజిషోల ఐడియా మనసులో మెదులుతోంది కానీ కిశోర్‌కు స్టేజి ఫియర్. అతను నాటకాలు వేసినవాడు కాడు. స్టూడియో నాలుగుగోడల మధ్యనే మసలినవాడు. పబ్లిక్‌లో పెర్‌ఫామ్ చేయడం వేరే కళ. తనకా విద్య రాదని కిశోర్‌కు గట్టి నమ్మకం.

స్టేజిషో అంటే భయం. 1968లో అతని మిత్రుడు బరీన్ ధర్ కలకత్తాలో కిశోర్ నైట్ ఏర్పాటు చేద్దామనుకున్నాడు. వచ్చి అడిగాడు. ఐదేళ్ల క్రితం అన్నగారిచ్చిన సలహా గుర్తుకు తెచ్చుకుని, బరీన్ లౌక్యానికి లొంగి సరేననేశాడు కానీ ఆ తరువాత నుండి కిశోర్‌కు భయం వేసింది. రాననేశాడు. ఇది ముందే ఊహించినట్టున్నాడు, బరీన్ బొంబాయికి స్వయంగా వచ్చి కిశోర్‌ను విమానంలో కలకత్తా లాక్కొచ్చాడు. గ్రాండ్ హోటల్‌లో కుదేశాడు.

ప్రోగ్రాం రవీందర్ సరోవర్ పక్కన హాల్లో ఏర్పాటు చేశారు. ప్రోగ్రాంరోజున ఆ చెరువు దాకా వచ్చేసరికి కిశోర్‌కు ముచ్చెమటలు పోసాయి. కారు ఆపమన్నాడు. చెరువు గట్టున దిగాడు. నేను రాను, వెనక్కి వెళ్లిపోతానన్నాడు. బరీన్‌కు ఇంకా చెమటలు పట్టాయి. కలకత్తాజనాల సంగతి తెలిసిన ఎవరికైనా అంతే మరి! అతనూ, తక్కిన ఫ్రెండ్స్ బతిమాలుతూండగా ఆ చెరువు గట్టున నిలబడి ఆలోచనల్లో మునిగిపోయాడు.

కాస్సేపటికి ధైర్యం వచ్చింది సరే పదండి...



దేనీ కేయే అభినయం చూసాకనే
కిశోర్‌కు తననెలా
మలచుకోవాలో తెలిసింది

అన్నాడు.

అక్కడ ఆడిటోరియంలో అప్పటికే జనాలు గోల మొదలుపెట్టారు. కిశోర్ స్టేజి మీదకు వస్తూనే చెరువుగట్టున నిలబడి తాను అప్పటికప్పుడు కట్టుకున్న పాట అందుకున్నాడు. - అదీ బెంగాలీలో! కలకత్తా వాసులను పొగుడుతూ! అతని గొంతులో మాధుర్యం, పైగా బెంగాలీ గీతం,ఇక చెప్పాలా, ప్రజలు వెర్రెక్కిపోయారు. అతనికి నీరాజనాలు పలికారు.

ఈ విజయం తర్వాత కూడా కిశోర్‌కు ఆత్మస్థయిర్యం పెరగలేదు. స్టేజిషోల జోలికి ఇక పోకూడదన్నాడు. కానీ 'పడోసన్' సినిమా ద్వారా ఫ్రెండయిన సునీల్‌దత్ అతన్ని మళ్లీ స్టేజిమీదకు లాక్కొచ్చాడు. లడాఖ్‌లో జవాన్లకోసం ప్రదర్శనలివ్వడానికి తన అజంతా టీముతో వెళుతూ సునీల్ దత్ తోడు రమ్మని కిశోర్‌ను కోరాడు. కుదరదంటూనే కిశోర్ అతని మొహమాటానికి లొంగాడు. తిరిగి వచ్చాక సునీల్ అనేక ప్రోగ్రాంలలో స్టేజి మీదకు బలవంతాన నెట్టుకొచ్చి కిశోర్ స్టేజిఫియర్ పోగొట్టాడు. అన్నగారు అశోక్ కూడా బాగా ప్రోత్సహించాడు.

మొదట్లో కళ్యాణ్‌జీ, ఆనంద్‌జీలు అతనికి కార్యక్రమాలకు ఆర్కెస్ట్రా సమకూర్చి ఎంకరేజ్ చేసేవారు. క్రమంగా అతనికి ధైర్యం పెరిగింది. షణ్ముఖానంద హాల్‌లో ఎన్నో ప్రోగ్రాంలు ఇచ్చి కిశోర్ ఎంతో ఖ్యాతిని, డబ్బును సంపాదించుకున్నాడు. స్టేజిషోలలో అతనంత సంపాదించిన వారెవరూ లేరంటే అతిశయోక్తి కాదు. స్టేజి ఎక్కితే చాలు కిశోర్‌ను ఏదో శక్తి ఆవహించేది. వయసు కూడా మర్చిపోయి ఎగిరేవాడు, గంతులేసే వాడు. ఒకసారి ప్రోగ్రాం చూసినవారెవరూ మర్చిపోలేనంత లైవ్లీగా ఉండేవి అతని పాటా, ఆటా.

కిశోర్‌కుమార్ తొలివివాహాన్ని అశోక్ ఆమోదించలేదు. అది భగ్నమయింది. లీనాను రిజిష్టరు మేరేజి చేసుకున్న రోజున కొత్తభార్యను వెంటబెట్టుకుని కిశోర్ అన్నగారింటికి వెళ్లాడు. పెళ్లి అయిపోయిందని చెప్పకుండా 'ఈమెను నేను పెళ్లాడదామని అనుకుంటున్నా' అని చెప్పాడు. ఈ పెళ్లి పట్ల అశోక్ సుముఖత చూపాడు కానీ కిశోర్ జాతకంలో కుజ ప్రభావం ఉంది కాబట్టి మంచి రోజు చూసి పెళ్లి చేసుకోమని సలహా ఇచ్చాడు. అప్పటికే పెళ్లి చేసేసుకొన్నామని చెప్పడానికి కిశోర్‌కు ధైర్యం చాలలేదు. తర్వాత కొన్నాళ్లకు చెప్పాడు. అశోక్‌కుమార్ అర్థం చేసుకున్నాడు. 'సర్లే అయినా కానీ మన ఆచారాల ప్రకారం మళ్లీ పెళ్లి చేసుకో" అన్నాడు. అన్నగారి మాట శిరసావహించి కిశోర్ మళ్లీ సాంప్రదాయ పద్ధతిలో లీనాను పెళ్లి చేసుకున్నాడు. కానీ వారి వైవాహిక జీవితం ఎక్కువ కాలం సాగలేదు. అశోక్ భయపడినంతా జరిగింది..........

అలా జీవితాంతం కిశోర్‌కు దిశానిర్దేశం చేస్తూ వచ్చిన అశోక్ ఆ రోజు మాత్రం నిశ్చేష్టుడయిపోయాడు. తనకు చెప్పకుండా తనకంటె 18 ఏళ్ల చిన్నవాడైన కిశోర్ తనకంటె ముందు వెళ్లిపోవడం జీర్ణించుకోలేకపోయాడు. వెక్కి వెక్కి ఏడ్చాడు.

**(ఇంకా వుంది)**

---




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్దంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. ఖేదం (మాయాబజారు-భళిభళి)
   ఎ) కైవారం బి) బాధ
   సి) సంతానము డి) సంపద
2. కైవారం (మాయాబజారు-దయ చేయండీ)
   ఎ) చేతి దండ బి) పొగడ్త
   సి) పరిజనం డి) పన్నీరు
3. నయగారము (మాయాబజారు- దయ చేయండి)
   ఎ) నృత్యం బి)ప్రియవాక్యము
   సి) అవిచ్ఛిన్నము డి) అదుపులేని
4. నిరతము (మాయాబజారు-నీకోసమే)
   ఎ) రతికి సంబంధించిన
   బి) తెలియనిది
   సి) అవిచ్ఛిన్నము డి) అదుపులేని
5. ధరణి (మాయాబజారు-అహనా పెళ్లంట)
   ఎ) గొప్ప బి) అంతులేని
   సి) పర్వతము డి) భూమి
6. అరమరలు (మాయాబజారు-సుందరి)
   ఎ) దాపరికము బి) అడ్డు
   సి) అలుక డి) వాయిదా
7. ఇంపు (అమాయకుడు-పట్నంలో శాలిబండ)
   ఎ) అందం బి) జోడీ
   సి) టక్కరి డి) ఈలు
8. మాపటేల (దేవుడు చేసిన మనుషులు... మసక మసక)
   ఎ) మర్నాడు బి) ఊరవతల
   సి) రాత్రివేళ డి)తెల్లవారు ఝామున
9. లగ్గము (అమ్మ మాట - మాయదారి సిన్నోడు)
   ఎ) శుభకార్యం బి) కాపురము
   సి) సుముహూర్తము డి) యజ్ఞము
10. చోద్యం (దేవుడు చేసిన మనుషులు- మసక మసక చీకటిలో)
   ఎ) నడవదగినది బి) ఆశ్చర్యకరమైనది
   సి) వ్యవసాయం డి) చోరవిద్య

### జవాబులు

1) b) 2) b 3) b
4) c 5) d 6) a
7) a 8) c 9) c
10) b

# న్యూస్ ఫ్లాష్





ఉత్తరాది గాయని అనూరాధ పోడ్వాల్, మన గాయని గాయకులు ఎస్.పి. బాల సుబ్రహ్మణ్యం, ఎస్. జానకి, మంగళంపల్లి బాల మురళీకృష్ణలను శ్రీశైలం దేవస్థానం ఆస్థాన గాయనీ గాయకులుగా నియమించింది. శ్రీమతి అనూరాధ పోడ్వాల్ గతనెలలోనే ప్రమాణ స్వీకారం చేసారు. ఈ సంచిక మీరు చూసే సమయానికి ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్. జానకి ప్రమాణస్వీకారం కూడా అయిపోతుంది. ఇక బాలమురళీకృష్ణగారి ప్రమాణస్వీకారం అతి త్వరలోనే జరుగుతుందని తెలిసింది.



## ఆకాశవాణి సంగీత సమ్మేళనం - 2002

1954వ సంవత్సరం నుండి ఆకాశవాణి ఏటేటా వినిపించే సంగీత సమ్మేళనం నవంబర్ 16 నుండి ప్రారంభం అయింది. దేశంలోని వివిధ నగరాలలో నిర్వహించిన కచ్చేరీలు 5 వారాలపాటు ప్రతీరోజూ రాత్రి 10 గం॥ల నుండి 11 గం॥ల వరకు ఆకాశవాణి ముఖ్యకేంద్రాల ద్వారా వినవచ్చు. శ్రోతల సౌకర్యార్థం ఈ పక్షంలో వినవచ్చే కార్యక్రమాల వివరాలు అందిస్తున్నాం.

డిసెంబర్

| | | | | |
|---|---|---|---|---|
| 1 ఆదివారం | - | సి.సరోజ, సి.లలిత | - | గాత్రం |
| 2 సోమవారం | - | పండిట్ దాల్‌చంద్ శర్మ, | - | పఖావాజ్ |
| | | పండిట్ కిషన్‌మహరాజ్ | - | తబల |
| 4 బుధవారం | - | ఉల్హాస్ బాపట్ | - | సంతూర్ |
| 5 గురువారం | - | ఎ.దుర్గాప్రసాద్, | - | గోటువాద్యం, |
| | | బి.వి.బాలసాయి | - | ఫ్లూటూ |
| 6 శుక్రవారం | - | గజేంద్ర బక్షి | - | గాత్రం |
| 7 శనివారం | - | ఓ.యస్.త్యాగరాజన్ | - | గాత్రం |
| 8 ఆదివారం | - | ఉస్తాద్ అసద్ అలీఖాన్ | | రుద్రవీణ |
| 9 సోమవారం | - | అనయంపాతి కె.గణేశన్ | - | జలతరంగం |
| | | వెల్లూర్ రామభద్రన్, ఇతరులు | | తాళవాద్య కచ్చేరి |
| 10 మంగళవారం | - | విదుషి అఫ్రోజ్ బానో | - | లలిత సంగీతం |
| 11 బుధవారం | - | సంగీతా శంకర్ | - | వయొలిన్ |
| 12 గురువారం | - | మందా సుధారాణి | - | గాత్రం |
| 13 శుక్రవారం | - | రిత్విక్ సన్యాల్ | - | ధ్రుపద్ ధమార్ |
| 14 శనివారం | - | కె.ఎస్.గోపాలకృష్ణన్ | - | ఫ్లూటు |
| 15. ఆదివారం | - | పండిట్ దెబ్రత చౌధురి | - | సితార |

## మా టీవీ సమర్పించు



జడ్జి: ఈమని సత్యనారాయణమూర్తి

MAA TV

### పాడాలనివుంది



సూత్రధారి : యస్పీ బాలసుబ్రహ్మణ్యం



జడ్జి: సురేష్ బలరాం

### కార్యక్రమాల వివరాలు

**ప్రిలిమినరీ రౌండ్స్ : 7-12-02**



1. యం.వెంకటేష్
   - బంటురీతి కొలువు (సీతారాముల కళ్యాణం చూతము రారండి)
   - చూపుల్తో గుచ్చిగుచ్చి (ఇడియట్)
   - జాబిలి కోసం (మంచి మనసులు)



2. వి.రేవతి
   - మనసే అందాల బృందావనం (మంచి కుటుంబం)
   - ఆడదాని ఓరచూపులో (ఆరాధన)
   - వేణువైవచ్చాను (మాతృదేవోభవ)



3. వి.రాజీవ్
   - చైత్రముకి సుమాంజలి (ఆనందభైరవి)
   - ఆకతాయి పిల్లమూక (తెనాలి రామకృష్ణ)
   - ఓహో మేఘమాల (భలేరాముడు)



4. టి.అమల
   - ఏదో ఒక రాగం (రాజా)
   - కాస్తనువ్వు (స్టూడెంట్ నెం.1)
   - మనసున ఉన్నది (ప్రియమైన నీకు)

**ప్రిలిమినరీ రౌండ్స్ : 14-12-02**



1. పూర్ణిమా గాయత్రి
   - పూజలు సేయపూలు (పూజ)
   - ఛాంగురే బంగారు రాజ (శ్రీకృష్ణ పాండవీయం)
   - మాటేమంత్రము (సీతాకోకచిలుక)



2. గణేష్
   - అందెల రవమిది (స్వర్ణకమలం)
   - కదవెత్తుకొచ్చింది (దసరా బుల్లోడు)
   - మామా చందమామ (సంబరాల రాంబాబు)



3. పూజిత
   - నీవు లేక వీణ (డాక్టర్ చక్రవర్తి)
   - నే తొలిసారిగా (సంతోషం)
   - ఆకాశం తన రెక్కలు (కలుసుకోవాలని)



4. విజయాదిత్య
   - ఆకాశం దిగివచ్చి (నువ్వునాకు నచ్చావ్)
   - ఇందువదన (ఛాలెంజ్)
   - తకట తధిమి (సాగర సంగమం)

# రాజా ఆడియో రివ్యూ




**విడుదల : ఆదిత్య**
**వెల : రూ 32/-**

హాస్య చిత్రాల దర్శకుడు ఇ.వి.వి. సత్యనారాయణ తన స్వంత బ్యానర్ 'ఇవివి సినిమా'పై అల్లరి నరేష్, ప్రభుదేవా, సునీల్, గజాలా, అనిత కాంబినేషన్‌లో నిర్మించిన 'తొట్టిగ్యాంగ్' సినిమా ఆడియో విడుదలయింది. దేవిశ్రీ ప్రసాద్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సురేంద్రకృష్ణ రాయగా చరణ్, సుమంగళి పాడిన 'నువ్వేకావాలి నీ నవ్వేకావాలి' పాటకి చక్కటి మెలోడీ జత పడింది. భీంప్లాస్, ఉదయ రవిచంద్రిక రాగాల మిశ్రమం పాట ట్యూన్‌లో కనబడుతుంది. పాటను నాలుగైదు సార్లు వింటే-ప్రేమకువేళాయెరా-సినిమాలోని 'కన్ను కన్ను కలుపుకొని' అనే పాట కొద్దిగా గుర్తొచ్చే అవకాశం ఉంది. ఇదిలా ఉండగా పాటలో గల రెండు చరణాలకు ముందు సమకూర్చిన ఇంటర్లూడ్‌లు పాటకు మరింత శోభనిచ్చాయి. కీరవాణి సంగీతం ఇచ్చే పాటల్లో వయొలిన్ బిట్స్ హృదయంలో ఎంత గాఢంగా నాటుకుపోతాయో అంతటి ప్రాతినిధ్యం మొదటి చరణానికి ముందు వచ్చే వయొలిన్ బిట్‌లో మనం గమనించవచ్చు. కావాలంటే ఈ పాటలోని వయొలిన్ బిట్స్‌ని, 'అల్లరి ప్రియుడు'లో 'చెప్పకనే చెబుతున్నది ఇదే ఇదే ప్రేమని' పాటలోని వయొలిన్ బిట్స్‌ని పక్కపక్కన పెట్టుకుని వినండి తెలుస్తుంది. ఇక రెండో చరణం ముందువచ్చే సితార్ బిట్ కూడా అదే స్థాయి అనుభూతిని అందించింది.

సురేంద్రకృష్ణ రాయగా రంజిత్ పాడిన 'ఓ సోదరా' పాటని కేవలం ఓ హుషారు గీతంగా మాత్రమే తీసుకోవాలి. కొన్ని కొన్ని పాటలు-దర్శకుడు సన్నివేశం ద్వారా పండించాలనుకున్న కామెడీకి తోడ్పడతాయి. అటువంటి పాటల కోవలోకే ఈ పాటని చేర్చుకోవాలి.

సురేంద్రకృష్ణ రాసిన మరోపాట 'వెచ్చని వెచ్చని దేహం'ని రాజేష్, చిత్ర పాడారు. శుభపంతువరాళి రాగం ఆధారంగా స్వరపరచబడిన ఈ పాటకు పదాలు సమతూకంలో పడ్డాయి, పండాయి.

వరిగొప్పుల యాదగిరి రాయగా సందీప్, కల్పన పాడిన 'ఓరినాయనో ఎంత అల్లరో పెళ్ళిమూర్తమెట్టగానే ఏఁవిటైనదో' పాట సిట్యుయేషన్‌తో చూస్తే మరింత బావుంటుందేమో!

పోతుల రవికిరణ్ రాయగా దేవిశ్రీ ప్రసాద్, ఫెబి పాడిన "గుండెల్లో నువ్వే ఊహల్లో నువ్వే' పాటని హిట్‌సాంగ్ ఆఫ్ ది క్యాసెట్‌గా పేర్కొనాలి. ట్యూన్, టోన్ ఆర్కెస్ట్రయిజేషన్ అంతా కుర్రకారుని ఊపే లెవెల్లో జతపడ్డాయి. ఇంటర్‌లూడ్స్ విషయానికొస్తే మొదటి చరణానికి ముందు బీట్‌తో వయోలిన్ కాంబినేషన్, రెండో చరణానికి ముందు బీట్‌తో శాక్స్ కాంబినేషన్ దేవిశ్రీప్రసాద్ పనితనాన్ని చాటిచెప్తాయి. టోటల్‌గా రెహమాన్ అందించే స్థాయిలో ఉందీపాట.

ఈ ఆడియోలో సురేంద్రకృష్ణ రాసిన నాల్గవ పాట 'కన్నెపిల్లా అరెకన్నెపిల్లా నీ నడకను చూస్తేనే తిల్లానా'ను కార్తిక్, మాతంగి పాడారు. గతంలో 'సొంతం' సినిమా దేవిశ్రీప్రసాద్ అందించిన 'నాయుడో నాయుడో' పాట ట్యూన్ మీద డెవలప్ చేసిన పాట యిది. అందుకే ఆ పాట ఈ పాటలో ఇంటర్లూడ్‌గా వినిపించటం జరిగింది. ఇది కూడా కుర్రకారుని ఆకట్టుకునే పాటే!

మరొక రివ్యూ 36వ పేజీలో...



వెల : రూ 40/-



వెల : రూ 40/-



వెల : రూ 40/-




"ఏమ్మా ... నువ్వు జస్టిస్ చౌదరిగారి అమ్మాయివి కదూ!?
"కాదండీ ... జస్టిస్ చక్రవర్తి గారి అమ్మాయిని."
"మరేం ఫర్వాలేదమ్మా ... రామారావైతే నేంటి నాగేశ్వరరావు అయితేనేంటి, ఇద్దరు చేసిందీ జస్టిసే కదా!?"



"ఏం చదువుతున్నావు బాబూ..."
"ఎమ్.బి.బి.యస్ అయిదో యేడు..."
"ఈ ఏడైనా కాస్త జాగర్తగా చదివి పాసవు నాయనా..."





ఇద్దరు మిత్రులు మాట్లాడుకుంటున్నారు.
"ఎవరయినా నీకు తెలియని ఓ విషయం చెపితే నీకు బాధ కలిగిందనుకో ఆ విషయం నీకు ఇంతకుముందే తెలుసనుకుంటే సరిపోతుంది ఏమంటావ్?" అన్నాడు కౌన్సిలింగ్ చేసే మొదటి మిత్రుడు.
"ఈ విషయం నాకు ఇంతకుముందే తెలుసు..." చెప్పాడు రెండవ మిత్రుడు.

ఓ పెళ్ళి పందిర్లో మగపెళ్ళి వారి భోజనాలు అవుతున్నాయి. ఆడపెళ్ళివారి తరవు బంధువులు వడ్డన చేస్తున్నారు.
"ఇదేంటండీ .. అరటిపండు తొక్క తియ్యకుండా మజ్జిగ అన్నంలో అలా వేశేశారు. ఆ మాత్రం మర్యాద తెలీదా? మేం మగపెళ్ళివారం కదా... మాకు ఇలాగేనా వేసేది?" అని కోపంగా అన్నాడు ఓ యువకుడు భోజనం చేస్తూ.
"ఈసారికి ఎలాగోలా సర్దుకోండి బాబూ... రాత్రి భోజనానికి కూర్చునప్పుడు ఒక్కొక్కళ్ళకి తోలు తీసేస్తాం లెండి .." అన్నాడు ఆడపెళ్ళివారి తరపు బంధువొకాయన.





"ఇంత పెద్ద వయస్సులో కూడ ఆఫీసు టైము దాటిపోయి గంటయినా ఎలా టైపు చేస్తున్నారో చూడు ...." అన్నాడు ఆఫీసర్, ఆనందరావుతో పరమేశాన్ని చూపిస్తూ...
"అయ్యా .... ఆయన టైపు చేస్తున్నవి వాళ్ళబ్బాయి మార్కుల సర్టిఫికెట్లండి ...." చెప్పాడు ఆనందరావు.

డ్యూటీలో జాయినయి సాయంత్రంలోగా మొత్తం పని పూర్తి చేసుకుని వెళుతూ,
"అయ్యా శలవు ఇప్పిస్తారా?" అన్నాడు ప్యూన్.
"ఇవ్వాళ డ్యూటీలో చేరావో లేదో అప్పడే శెలవా?" కసురుకున్నాడు మేనేజర్ క్రూరానందం.



"సర్వరూ... పులుసులో ఈగ పడిందయ్యా..." ఫిర్యాదు చేశాడు కస్టమర్.
"దాన్దేముంది సార్ .... కూరలో బఠాణీ ఒకటి తీసి పులుసులో పడేశారంటే దాని మానాన అది వాటర్ పోలో ఆడుకుంటుంది... మన జోలికి రాదు " అంటూ సలహా ఇచ్చాడు సర్వర్.








"ఖరీదైన క్యాలెండర్ దొంగతనం చేసిన అతగాడికి కోర్టు వారు ఏం శిక్ష విధించ వచ్చనుకుంటున్నావు?"
"పన్నెండు నెలలు.."



"మాంఛి మైసూరు బజ్జీలు తీసుకురావయ్యా.. తక్కువ వేడిగా ఉండకూడదు.. అలా అని మరీ చల్లగా వుండకూడదు. చిన్న చిన్నవిగా వుండకూడదు.. అలా చెప్పి మరీ బోండాల్లా వుండకూడదు.. తెల్సిందా? నే చెప్పినట్లే పట్రా.." ఆర్డరిచ్చాడు కస్టమర్.

"అలాగే సార్... ఇంతకూ లోపల మైసూరు వుండాలో, ఒద్దో చెప్పలేదు సార్.." అన్నాడు సర్వర్ వేళాకోళంగా.



"ఇవాళ చూడబోతే వాన కురిసేలా వుంది.." అంది ఆడ కంగారు మగ కంగారుతో.

"ఎందుకంత కంగారు" అడిగింది మగ కంగారు.

"పిల్లలు బయటకు వెళ్లడానికి వీలుండదు. ఎంత సేపూ లోపలే ఆడుకోవాలి.."అంది ఆడ కంగారు.



"మీ ఇంట్లోని టేపురికార్డర్ ఓ సారి ఇస్తారా... మా ఫామిలీ మెంబర్లతో సాయంత్రం సరదాగా పాటలు వినే ప్రోగ్రాం పెట్టుకుందాం అనుకుంటున్నాం".

"సేమ్ అదే ప్రోగ్రామ్ మా ఇంట్లో... అదీ..ఇవాళ సాయంత్రమే పెట్టుకున్నాం అంచేత సారీ...."

"ఏం ఫర్లేదు... మేం మా ప్రోగ్రామ్‌ని సినిమా చూసే ప్రోగ్రామ్‌గా మార్చుకోగలం.. మీ వీసిడి ప్లేయర్, కొన్ని వీడియోలు ఇవ్వండి"



"ఈ పుస్తకావిష్కరణ సభకు ఇంతమంది నా మీద అభిమానంతో రావడం చూస్తే నాకు చాలా ఆనందంగా వుంది. నిజంగా ఇవాళ రవీంద్రభారతి మీలాంటి సభికుల్తో కళకళలాడు పోతోంది." అన్నాడు ఓ రచయిత తన కావ్యావిష్కరణ సభలో.

"మీ మీద అభిమానమా.. పాడా? బయట జోరుమని వర్షం కురుస్తుంటే తలదాచుకుందామని వచ్చామంతే.." గట్టిగా అన్నారు కొంతమంది సభికులు.

"అంటే ప్రకృతి వైపరీత్యాలు తోడైతే కానీ నగరంలో సాహిత్య సాంస్కృతిక సభలు విజయవంతం కావన్నమాట..." అంటూ ఛలోక్తి విసిరేడు ఆ కావ్య రచయిత.



పెంపుడు జంతువులు అమ్మే ఓ దుకాణానికి వెళ్లి మూడువందల బొద్దింకలు, ఆరు ఎలుకలు, ఆరు ఎలుక పిల్లలు యిమ్మని అడిగేడు ఓ యువకుడు.

"మేము ఎలుక పిల్లల్నే యివ్వగలమండీ. మీరడిగిన మిగతావన్నీ మాదగ్గరలేవు... అయినా అవన్నీ మీరు ఏంచేసుకుంటారు?" ఎదురు ప్రశ్నించాడు దుకాణదారు.

"ఈ రోజు మా ఇంటి యజమాని నన్ను ఇల్లు ఖాళీ చెయ్యమని చెప్పాడు. నేను అద్దెకు దిగినపుడు ఆ యిల్లు ఎలా వుందో అలాగే అప్పజెప్పమని అన్నాడు అందుకనీ..." అన్నాడు ఆ యువకుడు.

స్పెయిన్‌లో జరిగిన ఎమ్.టీ.వి. యూరోప్ మ్యూజిక్ అవార్డు (2002) గెలుచుకున్నదెవరో తెలుసా? ఎన్‌రిక్ ఇగ్లేసియాస్ కాదు, అన స్టేషియా కాదు, షకీరా కూడా కాదు. ఆస్ట్రేలియన్ గాయని కైలీ మినోగ్‌కు ఆ గౌరవం లభించింది అంతేకాదు. బెస్ట్‌డ్యాన్స్ యాక్ట్ అవార్డ్ కూడా ఆమెకే దక్కింది.



# కైలీ మినోగ్

- కైలీ గాయని మాత్రమేకాదు, నటీమణి కూడా, అంతేకాదు, 'లైట్ ఇయర్' అనే తన ఆల్బమ్ (మూడుకోట్ల రికార్డులు అమ్ముడుపోయాయి)లోని పాటల రచనలో తోడ్పడింది. వీటికి తోడు డాన్స్ చేయడం ఎలాగూ ఉంది.
- తన దేశంలో జరిగిన 2000 సిడ్నీ ఒలింపిక్స్ ముగింపు వేడుకల్లో పాడే అవకాశం కైలీకే వచ్చింది. ఆమె 19వ యేట నుండి ఇంగ్లండులోనే ఉంటోందనుకోండి.
- మేడమ్ టుస్సాడ్ మ్యూజియంలో ప్రపంచ ప్రముఖుల మైనపు విగ్రహాలు ప్రదర్శిస్తారని తెలుసుగా. (ఈ మధ్యే అమితాబ్ బొమ్మ కూడా అక్కడ చేరింది.) కైలీ బొమ్మ కూడా ఆ మ్యూజియంలో పెడితే రెండుసార్లు ఆమె వీరాభిమానులు ఆ బొమ్మను విరక్కొట్టారు. మూడోసారి ఈ మధ్యే పెట్టారు.
- కైలీకి ఈ విజయం ఒక్కరోజులో లభించినది కాదు. పదేళ్ల వయసు నుండి బాలతారగా, టీవీ స్టార్‌గా శ్రమించిన తర్వాత ఈనాడు ఈ స్థానానికి చేరింది.

ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్‌లో 34 ఏళ్ల క్రితం జన్మించిన కైలీ (పూర్తిపేరు కైలీ యాన్ మినోగ్) మొదటి మూడు సింగిల్స్‌తోనే ఆస్ట్రేలియన్ పాప్ చార్ట్స్‌లో నంబర్‌వన్ స్థానాన్ని పొందింది. ఇంట్లో అందరికి కళలతో సంబంధం ఉంది. మనిషి పొట్టిగా ఉన్నా (ఎత్తు 5'1" మాత్రమే) అది సెక్సీ తారగా ఆమె ఎదుగుదలకు అడ్డురాలేదు.

- ఆస్ట్రేలియన్ టీవీలో బాలతారగా ప్రారంభించి, 4 సీరియల్స్‌లో వేసిన తర్వాత బహుళ ప్రజాదరణ పొందిన "నైబర్స్" అనే సీరియల్‌లో ఓ ముఖ్యపాత్ర వేసి ప్రేక్షకులకు చేరువయింది. అది 1986 ముచ్చట. మళ్లీ
- 1994లో వికార్ ఆఫ్ డిబ్లీ అనే సీరియల్‌లో కూడా వేసింది.
- ఆమె మొదటి సింగిల్ 'ద లోకో మోషన్' స్వదేశంలోనే కాక బ్రిటన్ సంగీత కారుల దృష్టిని కూడా ఆకర్షించింది.
- పాప్‌లో లభించిన ఆదరణ, ఆమెకు తెరపై తారగా ఎదగడానికి దోహదపడింది. 1991 నుండి సెక్సీస్టార్‌గా మారింది. INXS లీడ్ సింగర్ మైకేల్ హచెన్స్‌తో ప్రేమాయణం ఆ ఇమేజికి దోహదం చేసింది.
- ఈ క్రిన్‌మన్‌కి 'ములాన్ రూజ్' తార నికోల్ కిడ్‌మన్‌తో (ఆమెది కూడా ఆస్ట్రేలియానే) కలిసి ఒక పాట రిలీజ్ చేయడానికి సన్నాహాలు చేస్తోంది.



**కైలీ ఆల్బమ్**

కైలీ (1988)
ఎంజాయ్ యువర్‌సెల్ఫ్ (1989
రిథమ్ ఆఫ్ లవ్ (1990)
లెట్స్ గెట్ టు ఇట్ (1991)
గ్రేటెస్ట్ హిట్స్ (1992)
కైలీ మిలోగ్ (1994)
ఇంపాజిబుల్ ప్రిన్సెస్ (1997)
ఇంటిమేట్ అండ్ లివ్ (1999)
లైట్ ఇయర్స్ (2000)
ఫీవర్ (2001)

**సినీతారగా**

ది డెలిన్‌క్వెంట్స్ (1989)
స్ట్రీట్ ఫైటర్ (1994)
బయోడోమ్ (1995)
హై రైడ్ టు హెల్ (1995)
డయానా అండ్ మీ (1996)
శాంపుల్ పీపుల్ (1999)
కట్ (2000)
ములాస్ రూజ్ (2001)

కైలీకు పేరు ప్రఖ్యాతులు తెచ్చిన గీతాలు అనేకం-'ఐ షుడ్ బి సో లక్కీ', 'షుడ్ నాట్ ఛేంజ్ ఎ థింగ్', 'గాట్ టు బి సర్టన్', 'లవ్ ఎఫైర్ బర్నింగ్ అప్', 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' 'నెవర్ టూ లేట్' ఫీవర్ హ్యాండ్ ఆన్ యువర్ హార్ట్' 'ఎంజాయ్ యువర్‌సెల్ఫ్' 'ఇంపాజ్‌బుల్ ప్రిన్సెస్' 'డాన్సింగ్ క్వీన్' 'ఆన్ ఎ నైట్ లైక్ దిస్' 'కాంట్ యూ గెట్ అవుట్ ఆఫ్ మై హెడ్' .... వాటిల్లో I should Be So Lucky... పాట లిరిక్..

## I Should Be so Lucky

In my imagination
There is no complication
I dream about you all the time
In my mind a celebration
The sweetest of sensation
Thinking you could be mine
In my imagination
There is no hesitation
We walk together hand in hand

I'm dreaming that you're in love with me
Like I'm in love with you
But dreamings all I do
If only they'd come true

I should be so lucky lucky lucky lucky
I should be so lucky in love
Ishould be so lucky lucky lucky lucky
I should be so lucky in love

It's a crazy situation
You always keep me waiting
Because it's only make-believe
And I would come a-running
To give you all my loving
If one day you would notice me
My heart is close to breaking
And I can't go on faking
The fantasy that you'll be mine

I'm dreaming...
I should be...
In my imagination there is no hesita-
tion
We walk together hand in hand
I'm dreaming...
I should be...


చదువుల్రావు
సత్యమూర్తి BV
నేను విమలని చాలా గాఢంగా ప్రేమించాను. విమల లేనిదే నేను బతకలేను
మా పెద్దవాళ్ళతో చెప్పి ఒప్పించి, ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాను
విమల ఏమంటూంది?
'నేను ప్రేమించేను' అని అనగానే 'ఛీ' అంటూ నాకేసి కోపంగా చూసింది. ప్రేమ ముందు అలాగే ఉంటుంది. నువ్వు సినిమాల్లో చూడలేదా?
అయినా నీ వయస్సు 18 ఏళ్ళు. ఆ అమ్మాయి వయస్సు 22 ఏళ్ళు....
అయినా ఫరవాలేదులే... ఆ అమ్మాయిని చేసుకుంటే త్వరగా ముసలితనం వచ్చేస్తుంది కాబట్టి ఈడూ జోడూ కొన్నాళ్ళు పోయాక బాగుంటుందిలే

# రాజా ఆడియో రివ్యూ



విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 80/-

ప్రపంచ సినీ చరిత్రలో లాంగ్ స్టాండింగ్ హీరోగా పేర్కొనదగ్గ అక్కినేని పేరిట 'ఏ.యన్.ఆర్. సినీ షష్టిపూర్తి' అనే మకుటంపై ఆయన అభినయించిన ఓ ముప్పై పాటలను డబుల్ ప్యాక్‌గా హెచ్.ఎం.వి. వారు తీసుకువచ్చారు.

చెలియా కనరావా(బాలరాజు), పయనమయే ప్రియతమా (లైలా మజ్ను), చూడుమదే చెలియా (విప్రనారాయణ), ప్రళయ పయోధిజలే (భక్త జయదేవ), శ్యామలా దండకం (మహాకవి కాళిదాసు), కలిసె నెలరాజు (అనార్కలి), చూపులు కలసిన శుభవేళ (మాయాబజార్), ఉన్నావా అసలున్నావా (భక్త తుకారాం), రసికరాజ తగువారముకామా (జయభేరి), హాయిహాయిగా ఆమని సాగె (సువర్ణసుందరి), కుడిఎడమైతే (దేవదాసు), చిగురాకులలో చిలకమ్మ (దొంగరాముడు), చల్లగ రావేలా (భలేరాముడు) కారుతో షికారుకెళ్లే (తోడికోడళ్లు), వాడుక మరచెదవేల (పెళ్లికానుక), నా హృదయంలో నిదురించే చెలీ (ఆరాధన), నిలువవే వాలు కనుల దానా (ఇల్లరికం), చేసేది ఏమిటో చేసెయ్యి సూటిగా (తెనాలి రామకృష్ణ), నన్ను వదిలి నీవు పోలేవులే (మంచి మనసులు), ముద్దబంతి పూవులో (మూగ మనసులు), చిటపట చినుకులు పడుతూ వుంటే (ఆత్మబలం), నిలువుమా నిలువుమా నీలవేణి (అమరశిల్పి జక్కన), పచ్చగడ్డి కోసేటి పడుచుపిల్లా (దసరా బుల్లోడు), చెంగావి రంగు చీర కట్టుకున్న చిన్నది (బంగారు బాబు), నేను పుట్టాను (ప్రేమనగర్), జాబిల్లి చూసేను (మహాకవి క్షేత్రయ్య), వందనం అభివందనం (ప్రేమాభిషేకం), ఆకాశదేశాన (మేఘ సందేశం)-ఇవీ ఆ ముప్పై పాటలు.

అక్కినేని హిట్ సాంగ్స్ అంటూ క్యాసెట్లుగా తీసుకురావాలంటే '10 ప్యాక్' కూడా అసంపూర్ణంగానూ, అసంతృప్తితోనూ ఉంటుంది. అంచేత ఆ కోణంలో చూడడం వల్ల ప్రయోజనం లేదు. ఉన్నంతలో చూసుకుంటే పొందుపరిచిన 30 పాటలు ఎంత హిట్టో తెలుగు వారందరికీ తెలిసిన విషయమే! ప్యాకింగ్, క్వాలిటీ, కవర్‌పై అక్కినేని సంతకం, ఫొటోలు, ఇన్‌లే కవర్ లోపల కె.గౌరీశంకర్ (ఒంగోలు) అక్కినేని అభినయానికి పట్టిన అక్షర దర్పణం అన్నీ గౌరవప్రదంగాను హుందాగాను ఉన్నాయి. కేవలం ఒక్క అక్కినేని అభిమానులకు మాత్రమే ఇది కానుక కాదు. మంచి పాటలంటే ఇష్టపడే వారికి కానుకగా ఇవ్వదగ్గ లేదా కొనిదాచుకోదగ్గ డబుల్ ప్యాక్ ఇది.




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 55/-

అలనాటి అందాల తార అంజలీదేవి అభినయించిన 17 పాటలను ఓ ఆడియో క్యాసెట్‌గా 'గోల్డెన్ హవర్' విభాగం కింద 'ఫిల్మ్ హిట్స్ ఆఫ్ అంజలీ దేవి' మకుటంపై హెచ్.ఎం.వి. వారు తీసుకువచ్చారు.

రెగ్యులర్‌గా మనకు వినబడే-జీవితమే సఫలము, (అనార్కలీ), జయపాండురంగ ప్రభోవిఠలా (సతీ సక్కుబాయ్), ఓ నెల రాజా (భట్టి విక్రమార్క), పిలువకురా (సువర్ణ సుందరి, ప్రేయసీ మనోహరి (వారసత్వం) వంటి పాటలు, అప్పుడప్పుడు వినబడే-మహాదేవశంభో (భీష్మ), కానగరావా (చెంచులక్ష్మి), కరుణించవే తులసిమాతా (శ్రీకృష్ణ తులాభారం), విరిసింది వింత హాయి (బాలనాగమ్మ) వంటి పాటలు; అరుదుగా వినబడే-రావే రావే జాబిలి (శోభ), కొమ్మ మీద కోయిలుందిరా (రాజనందిని), చూచితీరవలదా (కీలుగుఱ్ఱం), ఓ పరదేశి (స్వప్నసుందరి), తీయని వెన్నెల రేయి (బాలరాజు), ఎక్కడ దాచావోయ్ సిపాయి (రాణీరత్నప్రభ) వంటి పాటలు; అసలు బైట దొరకటం కష్టం అనిపించే అందాలు చిందగాను ఆడుదాం (ఋణానుబంధం), దానం ధర్మమే వేదాల నీతి సారం (సతీ సుమతి) వంటి పాటలు ఉన్నాయి ఈ క్యాసెట్‌లో.

అలనాటి అనుభూతులను అపురూపంగా అందజేయగల ఈ క్యాసెట్‌ను ఆదరించడం వలన రెండు ప్రయోజనాలున్నాయి. మంచి ప్రయత్నానికి శ్రోతల సహాయ సహకారాలుంటాయన్న విషయం ఆర్థిక రూపేణా ఋజువైతే మరిన్ని మంచి క్యాసెట్లు వచ్చే అవకాశం ఉండటం మొదటిది. అంజలీదేవి హిట్‌సాంగ్స్ ఇంకా ఎన్నో ఉన్నాయి కనుక రెండో వాల్యూమ్‌గా కూడా వచ్చే అవకాశం రెండవది. ■

## మార్కెట్‌లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : ఆదిత్య
వెల : రూ. 28/-



వెల : రూ. 26/-




విడుదల : టిప్స్
వెల : రూ. 60/-

రచన: సురేంద్రకృష్ణ **1** గానం : చరణ్, సుమంగళి

అ: నువ్వే కావాలి నీ నవ్వేకావాలి
నువ్వేనేను నేనే నువ్వై ఉండాలి
ఆ: నువ్వేకావాలి.... నీ ప్రేమే కావాలి
తోడు నీడా అన్నీ నువ్వై ఉండాలి
అ: నీ కోసమే వెతికా .... నీ ఊహతో బ్రతికా నీరాక నిజమేనా....॥ నువ్వే ॥
అ: ఆశ నువ్వే నా శ్వాసా నువ్వే నా ఊహ నువ్వే
జీవం నువ్వే ప్రేమా నువ్వే
ఆ: ప్రాయం నువ్వే నా ప్రాణం నువ్వే నా గమ్యం నువ్వే
ధైర్యం నువ్వే అన్నీ నువ్వే
అ: అందమైన బంధమై అల్లుకుంటాలే
హత్తుకోవే ముద్దుగా ప్రేమవీణా
ఆ: తొలికాగిలే సాక్షిగా .... ॥ నువ్వే ॥
అ: ప్రేమే దైవం ప్రేమగా లోకం
ప్రేమెగా ప్రాణం ప్రేమే సర్వం ఏ నాటికీ
ఆ: నువ్వే దైవం నువ్వే నా లోకం
నువ్వే నా ప్రాణం నువ్వే సర్వం నా ప్రేమకీ
అ: గుండెల్లోనే నిన్ను నే దాచుకున్నానే
కంటిలోన పాపల్లే చూసుకోనా
ఆ: మన ఊపిరే ప్రేమగా

రచన: సురేంద్రకృష్ణ **2** గానం : రంజిత్

ప: ఓ ఓ సోదరా ఓఓఓఓ సుందరా
లైఫే లైఫ్‌రా నీ బెస్ట్ ఫ్రెండ్ కదరా
ఓ ఓ సోదరీ అరె ఓఓఓఓ సుందరీ
పాలూ నీళ్లలా ఉండాలి ఇకముందరా
రంగీలా రంగీలా కలకాలం కలిసుండేలా
అల్లరిగా అదిరేలా చెయ్యాలోయ్ పెళ్లిగోలా ॥ ఓఓ సోదరా ॥
చ: ఆడపడుచులు వారి భర్తలు పందిర్లో పెత్తనం చేస్తారు
పెళ్లికొడుకు తమ్ముడేమో చిన్నచిన్న లోటులన్ని పెద్దవాళ్లకే చేరుస్తాడు
విడిదింటిలో కన్యదాతతో అదిలేదు ఇదిలేదు అంటారు
పెళ్లికూతురన్నగారు శక్తి కొద్ది ముట్టజెప్పి ఆపై బతిమాలుతుంటాడు
వియ్యాలవారిని కాఫీ టిఫిన్‌లడుగుతూ తిరిగే పనివారితో సందడే
ప: వెల్‌కమ్ అంకులు మీరేగా పెళ్లికి పెద్దలు
ఇంతాలస్యమా చెప్పండి పెళ్లి పనులు
ఏయ్... ఏసెయ్ లెక్కలు

అ: నీ కోసమే నా దేహమూ నీ కోసమే నా ఈ ధ్యానమూ
అ: నీ నవ్వులే ఇలా రువ్వితే నేనంటే నీకెంతో ఇష్టం అనీ
ఆ: నీ చూపులే అలా గుచ్చితే నిలిచేందుకే నాకు కష్టం అనీ
అ: అటూ పాటూ నీతోనే మరీ రావే రావే కన్నే నారీ ॥ గుండెల్లో ॥
ఆ: నీ కోసమే నా సర్వమూ .... నీ కోసమే నాఈ స్వప్నమూ
అ: నీ కోసమే నా ఉదయమూ.... నీ కోసమే నాఈ హృదయమూ
ఆ: నీ అల్లరే శృతిమించితే నేనాగలేనింకా ఓ పోకిరీ
అ: నీ సోకులే నాకందితే నీ అందమే కందిపోదా మరీ
ఆ: పోటా పోటీ నీతోనే మరీ
రారా రారా నన్నే కోరీ .... ॥ గుండెల్లో ॥

రచన: సురేంద్రకృష్ణ **6** గానం : కార్తీక్, మాతంగి

అ: కన్నేపిల్లా అరె కన్నేపిల్లా నీ నడకను చూస్తేనే తిల్లానా ॥ 2 ॥
ఆ: కన్నేకొట్టి అరె చెయ్యేపట్టి నా సొగసును తాకొద్దు కుర్రాడా
అ: అదిరే అందాలతో ఊరించాక వద్దంటూ
హద్దులు పెట్టేయ్యకే .... హాయ్యో హాయ్యో .... ॥ కన్నెపిల్ల॥
అ: నీ సిగ్గుకి సలాం నీ బుగ్గకి సలాం
నను రమ్మనిలాగే నీ సొంపుకి సలాం
ఆ: నీ స్పీడుకి సలాం నీ వేడికి సలాం
నన్ను అల్లరిపెట్టే నీ ఈడుకి సలాం
అ: నువ్వే బంగారం నీ నవ్వే సింగారం
నీవల్ల నా రేయంతా జాగారం
ఆ: ముద్దే ఆహారం వడ్డిస్తా వయ్యారం
నా ఒళ్లోకొచ్చి తీరుస్తావా భారం
అ: వయసే వేడెక్కింది మనసే జోరెక్కింది
వలపే రమ్మంటుంది అడ్డేలేదని ॥ కన్నెపిల్ల॥
అ: నీ నల్లని జడే నన్ను చుట్టేసింది
నీ తెల్లని చీరే నను అల్లేసింది
ఆ: నీ సన్నని మీసం నన్ను గుచ్చేసింది
నీ అల్లరి నవ్వు తెగ నచ్చేసింది
అ: పిల్లా నీ అందం చూస్తేనే ఆనందం
నువ్వు వద్దంటున్నా చూపిస్తా నా వాటం
ఆ: నువ్వే నచ్చాక అరె నేనే మెచ్చాకా
నిన్ను వద్దని ఎట్టా అంటాలే విడ్డూరం
అ: కనుకే కన్యామణీ మెరిసే మందాకిని
జతగా అల్లుకుపోదాం మనకింకేం పని ॥ కన్నెపిల్ల॥



రచన: కులశేఖర్ **1** గానం: టిప్పు, శ్రేయ

ప: సరి సరి సరి సరి గడసరి సరాసరి (2)
తగిలించ కోయ్ పెదవి
మరి మరి మరి మరి
మగసిరి మజాలని
మురిపించకోయ్ మదిని
అందానికే నేను కొత్త చిరునామా (2)
సందేహమా నా పైన
చిలిపి దుడుకు తనమా ॥సరిసరి॥
చ: ఎన్నాళ్ళూ దాచావు ఇన్నేసి అందాలు నీలో మర్యాదా
ఓ కొంటె కోణంగి ఆరోజు ఈ మాట నాతో అనరాదా
ఆ: ఇన్నాళ్ళూ నీ కళ్ళు ఏవైపో చూస్తుంటే నాదే పొరపాటా
నీ గుండెలో చేరి ఆనాడే చెప్పాను కాదా వినలేదా
అ: ఆ... గుట్టుగా విప్పనా కోక ముడి కొత్తందాలు
ఆ: ఆ.. సిగ్గుగా వున్నదే చాలు సరసాలు
అ: ఆ...సిగ్గు ఎగ్గు ఇంక మనకొద్దు
హద్దు పొద్దు లేదు సరిహద్దు
వద్దు వద్దు మాటలిక వద్దు హోయి... ॥సరి సరి॥
చ: నీ చూపు ఈనాడు కవ్వింత రేపింది లేరా మగధీరా!
నాజూకు నా సోకు నీ కోసముంచాను రారా.. రణధీరా
అ: ఆ... నీ లేత అందాలు శృంగార గ్రంథాలు బాలా జవరాలా
నీ నవ్వు ముత్యాలు గమ్మత్తు మంత్రాలు జాణా కసికూనా
ఆ... బుద్ధిగా చేయవా రాతిరిక ఉద్యోగాలు
ఆ... దొత్తిగా పంచవా ముద్దు మురిపాలు
ఆ... ముద్దు ముద్దు పెట్టు అనవద్దు
కట్టు కట్టు చెయ్యి జతకట్టు
పట్టు పట్టు మంచిరస పట్టు ఊ.... ॥సరి సరి॥

రచన: కులశేఖర్ **2** గానం: ఇళయరాజా, సాధనాసర్గమ్

ప: కొమ్మల్లో కోయిలా కూసిందే తీయగా...
గుండెల్లో ఊయలా ఆగిందే హాయిగా...
ఆ మొదటి ప్రేమ మహిమా...
ఈ మనసునాప తరమా...
తీరని భారమా... ॥కొమ్మల్లో॥
అ: వలపువాన చినుకే నామది మీటెనా
మనసు వీణ పలికే ఆశల కీర్తనా...
ఆ: వరములేవో అడిగి నీజత చేరనా
మరుల గోల మదిరే తీరని యాతనా
అ: హే అరెర్రే ఆ: మనకసలు

ఏ నీలిమేఘానితో... రాయాలి నాప్రేమని
ఏ పూల రాగాలతో, పంపాలి ఆ లేఖని
మనసేమో, క్షణమైనా, ఒక చోట వుండదే ॥జాజిమల్లీ॥
చ: అమ్మబాబూ అన్నా నువ్వేదారి అన్నా
చిన్నమాట గొంతు దాటదే...
మాటె రాదంటున్నా దారే లేదంటున్నా
గుండె చాటు ప్రేమ ఆగదే...
ఆ... ఈ ఊహలుయ్యాలలో... నా ఆశ తీరేదెలా
ఈ గాలి కౌగిళ్లల్లో... నామాట చేరేదెలా
ఎవరైనా, తెలపాలి, మదిలోన బాధనీ ॥జాజిమల్లీ॥

రచన: కులశేఖర్ **6** గానం:కె.కె.,సాధనాసర్గమ్

కో: హా... హా... హా... హా... హా... హా...
ఆ: ఆ కొండపల్లి కో: ఆహాహో..
ఆ: ఆ బొండు మల్లి కో: ఆహాహో..
ఆ: పాలరాతి బొమ్మల్లే కో: బాగుందె...బాగుందె...
ఆ: ఆ వెన్నెలమ్మా కో: ఆహాహో..
ఆ: ముద్దుగుమ్మ కో: ఆహాహో..
ఆ: గోగుపూల రెక్కల్లే కో: బాగుందె..బాగుందె
అ: వరవీణా... మృదుపాణీ (2)
వాదనలా విరిబోణీ
నువు అవునన్నా కాదన్నా
అందంగానే వుందమ్మా ॥కొండపల్లి॥
అ: బుగ్గల్లో సిగ్గెంతో బాగుంది
ఆ: బాగుంది.. బాగుంది..బాగుంది
ఆ: కళ్లల్లో కవ్వింతె దాగుంది
అ: దాగుంది... దాగుంది... దాగుంది
లోకంలోని అందాలన్నీ నీలో చెరేను ఈ వేళ
ఆ: లేనిపోని వేళాకోళం
అపాలంటేను కోపాల
అ: అలివేణీ అలకేలా విధికైనా మతిపోదా
నువు అవునన్నా కాదన్నా
అందంగానే వుందమ్మా ॥కొండపల్లి॥
అ: ఒంపుల్లో వయ్యారం బాగుందీ
కో: బాగుంది.. బాగుంది.. బాగుంది
అ: సొంపుల్లో సింగారం బాగుందీ
కో: బాగుంది.. బాగుంది.. బాగుంది
అ: నిన్నే చేసి ఆశ్చర్యంతో డంగైపోయాడు ఆ బ్రహ్మ
నిన్నే చేరి సంతోషంతో పొంగిపోయింది ఈ జన్మ
ఆ: సరదాలా సరసాలా చాలునయ్యా జగడాలా
అ: నీవు అవునన్నా కాదన్నా అందంగానే వుందమ్మా ॥కొండపల్లి॥

ఆ: సరిహద్దులు తెలియని పద్ధతిలో
అ: మన తొలకరి వలపుల చెమటలలో
ఆ: తనువెల్ల ఇలా
అ: తడవాలి ఇలా
ఆ: మునగాలి ఇలా మన యవ్వన నదిలోనా ॥ వెచ్చని ॥

రచన: వరిగొప్పుల యాదగిరి | 4 | గానం: సందీప్, కల్పన

అ: ఓరినాయనో ఎంత అల్లరో
పెళ్ళి మూర్తమెట్టగానె ఏమిటైనదో
ఆ: ఓరి దేవుడో ఎంత తొందరో
కొత్తగుంది ఇంతకీ ఇదేమి అలజడో
అ: ఇంత కమ్మనీ హాయినెప్పుడూ పొందలేదురో నాయనో
ఆ: వింతవింతగా వాగుతున్నదీ మనసు ఎందుకో ఏంపనో... ॥ఓరి॥
అ: ఆగనంటున్నదీ నా ముద్దుల ఆకలి
ఆ: అడిగెయ్యమంటున్నదీ ఈ ఆత్రమే కౌగిలి
అ: నీ దూరమే నాకెందుకో ఇబ్బందిగా ఉన్నదీ ...
ఆ: ఈ భారమే మోసేందుకు
నావల్ల కాదన్నదీ నీకివ్వమంటున్నదీ.... ॥ఓరి॥
ఆ: తెగ ఉక్కపోస్తున్నదీ నీ చూపులో వేడికీ
అ: నిను హత్తుకోమన్నదీ నీ సోకులే గుండెకీ
ఆ: తెల్లారినా చల్లారదే తాపాల ఈ దీపమే:
అ: చన్నీళ్లలో మునకేసినా తగ్గే ఈవేసవే
తీరేన ఆ దాహమే ॥ఓరి॥

రచన: పోతుల రవికిరణ్ | 5 | గానం: దేవీశ్రీప్రసాద్, ఫెబి

అ: మౌనమే వేళలో మంచులా కరిగిందే
అందుకే వేళలో ప్రేమ తెలిసిందే .... హేయ్ ....
గుండెల్లో నువ్వే ఊహల్లో నువ్వే
కౌగిట్లోకి రావే ఓవయ్యారి
కన్నుల్లో నువ్వే మనసంతా నువ్వే
కవ్వించావు నువ్వే ఓం సింగారీ ॥ గుండెల్లో ॥
ప్రేమించే వయసొచ్చిందే ప్రేమే పుట్టేసిందె
ప్రేమంటే తెలిసొచ్చిందె ప్రేమయ్యిందె
అ: హాయ్‌రే హాయ్‌రే హాయ్‌రే హాయ్‌రే హాయ్
ఆ: హాయ్‌రే హాయ్‌రే హాయ్‌రే హోయ్ ... ॥ 2 ॥ ॥ గుండెల్లో ॥
అ: నీ కోసమే నా ప్రాణమూ నీ కోసమే నా ఈ ప్రాయమూ



అయ్యాయోయి వంటలు
తగ్గించండయ్యా ఖర్చులు
ఆపైన మీ చిందులు
చ: చిన్న పిల్లల ఆటపాటలు అమ్మలక్కలంతా మీటింగ్‌లు
పట్టుచీర గొప్పలన్నీ ఆపకుండ చెప్పకుంటూ పెళ్ళి సంగతే వదిలేస్తారు
అక్కడక్కాడా మందుబాబులు
విందెప్పడంటూ తిండి బాబులు
చంద్రబాబు ఫ్రెండు నాకు
వాజ్‌పేయి తెలుసునంటు బిల్డప్పలిచ్చే కోతబాబులు
అమ్మాయి ఫ్రెండ్స్‌ని అబ్బాయిగారి ఫ్రెండ్స్‌కి జతచేసే వేదికే పెళ్ళిరో ...

రచన: సురేంద్రకృష్ణ | 3 | గానం: రాజేష్, చిత్ర

అ: వెచ్చని వెచ్చని దేహం
రతిపతి మదనుడు వదిలిన బాణం
కదిలే ఒంపుల శిల్పం చెలి నీ రూపం
ఆ: తీయని తీయని తాపం
తనువున రేగిన ఆగని మోహం
ఎవ్వరు తాకని అందం ఇక నీ సొంతం
అ: నీ చిక్కని చక్కని చెక్కిలిపై నే
చెక్కిన రాతలు మెరిసెనుగా
ఆ: నువ్వు రమ్మను కమ్మని కౌగిలికై నా సిగ్గుకు రెక్కలు వచ్చెనుగా
అ: పదునెక్కిన వయసుకు
తరగని సొగసుకు మెరుగులు పెడదామా.... ॥ వెచ్చని ॥
అ: ప్రతిక్షణము పరవశమై పదమను ఈ పదనిసలు
ఆ: నరనరం సుఖమయమై త్వరపడిన కౌగిలిలో
అ: చెలి చూపులతో సెగరేపెనుగా నా గుండెదడే పెరిగింది కదా
ఆ: నీ ఊహలలో తనువూగెనుగా తడి పెదవి ఇలా ఒణికింది కదా
అ: కదిలొచ్చిన మేఘం నేనైతే
ఆ: పురివిప్పిన నెమలిని నేనౌతా
అ: వయసాకలిలో
ఆ: జతజావళిలో
అ: పులకింతల పండగ జంటగ చేద్దామా ॥ వెచ్చని ॥
ఆ: ఇక తగదూ మొమాటం ఆపకు నీ ఆరాటం
అ: నువు విననీ నా వాటం చూపిస్తా నా వేగం
ఆ: మనమిద్దరము బిగికౌగిలిలో ఇక ఒంటికి సిగ్గుని వదిలిద్దాం
అ: ఇక తొందరగా రసవిందులలో మన తిమ్మిరి తీర్చే పని పడదాం



రచన: కులశేఖర్ | 4 | గానం: ఆర్.పి.పట్నాయక్

ప: చమకు చమ చేప కనులదానా...
చలాకి చిలుకలూరి జాణా, జాణా, జాణా జెరజానా జాణా, జాణా... ॥చమకు॥
జమకు జమ జింక పిల్లదానా... జరా నే పలకరించి పోనా...
నీ సూపులో సురుకున్నదే... నీ సోకులో సరుకున్నదే
యమ యమ యమ...నీ జిలుగు వెలుగుల
సొగసుకు పోయెను మా మతులు మతులు
యమహో మీ కులుకులూ హోయ్... వగలాడి చిలకలూ... హోయ్...
నమహో మీ నడకలు కసిరేపే పడతులు ॥చమకు॥
చ: నడకలో నిండు గోదారి... కులుకులో కొంటె కావేరి
తరరరంతంత తరరరంతంత తరడిడ డిడ తరడిడ తరరరంపంప హా...
నడకలో తకిట జంజంజం, కులుకులో కులుకు గుంగుంగం...
నడకలో నిండు గోదారి, కులుకులో కొంటె కావేరి...
మనసు చేరేనో..... హోహో హోయ్
మనసు చేరేనో..... మరుల సెగరేపేనూ...
పదహారులోన వయసొగి పోయెను, ఆగిపోయెనూ...
మీ జిలుగుల వెలుగుల సొగసుకు పోయెను
మా మతులు మతులు...
యమహో మీ కులుకులు హో
వగలాడి చిలకలు... హో
నమహో మీ నడకలు, కసిరేపే పడతులు ॥చమకు॥
హోయ్.... పరువమే పంచుకోవాలి, బరువులే దించుకోవాలి
తరరరంతంత తరరరంతంత తరడిడ డిడ తరడిడ తరరరంపంప హా...
పరువమే జమకు జమ్‌జమ్‌జమ్ బరువులే చిమకు చిమ్ చిమ్ చిమ్
పరువమే పంచుకోవాలి, బరువులే దించుకోవాలి...
ఎదురు పడు ఈవేళా... ఎదురు పడు ఈవేళ... మధన కథ సాగాలా....
విరహాల లోన మనసూగిపోయెనూ ... వేగిపోయెనూ...
మీ జిలుగుల వెలుగుల సొగసుకు పోయెను మా మతులు మతులు
యమహో మీ కులుకులు, వగలాడి చిలుకలూ, హో...
నమహో మీ నడకలు, కసిరేపే పడతులు హో... ॥చమకు॥

రచన: కులశేఖర్ | 5 | గానం: సాధనాసర్గమ్

ప: జాజిమల్లీ తోటలోన ఊసులాడే గోరువంకా
జాజిమల్లీ తోటలోనా ఊసులాడే గోరువంకా
ఎవరని అడగకే ఉన్నమాట చెప్పలేనే ఈ లాహిరిలో... ॥జాజిమల్లీ॥
చ : ఓ... రోజా చూస్తూవున్నా స్నేహంగానే వున్నా
చెప్పలేనే ఎందుకోమరి...
నాలో తానే వున్నా అంతా చూస్తూ వున్నా
అందుకోడే ఇంత ప్రేమనీ



అ: మొదట ఆ: ఇదివరకు
అ: చిలిపి ఆ: కలవరము లేదుగా
ఆ: పడుచు అ: మనసులను
ఆ: సరస అ: సరిగమలు
ఆ: కలల అ: అలజడులు రేపెనా...
అ: నీతోనే చెప్పకోని నీతోనే పంచుకోని నాలోని ప్రేమనీ..... ॥కొమ్మల్లో॥
ఆ: దుడుకు ప్రాయమసలే ఆగదు మానవా...
చిలిపి సాయిమడిగే నీవిక మారవా...
అ: వలపు లేహో మెదిలె నామది చాటునా
తపన లేహో ఎగిసే ఊపిరి మాటునా
ఆ: చిగురు అ: పెదవులిక
ఆ: ఒణిగి అ: తడబడిన
ఆ: అసలు అ: కనికరము లేదుగా
అ: అలక ఆ: వలదు ఇక
అ: అధర ఆ: సుధతగిలి
అ: మధుర ఆ: పరవశములే కదా...
ఆ: మబ్బుల్లో తెలిపోనీ గుండెల్లో వాలిపోనీ... గువ్వంటి ఆశనీ... ॥కొమ్మల్లో ॥

రచన: కులశేఖర్ | 3 | గానం: కె.కె.

ఏదో మౌనరాగం...
ఏదో మౌనరాగం రేపిందీ విషాదం
నాలో ప్రాణదీపం విన్నావా విలాపం
మాటే రానిది మొహమాటంలేనిది
గుండెనే ముల్లులా తాకుతున్నదీ ॥ఏదో॥
కంటిపాప చిన్నదేనని చిన్నబోకు స్వప్నమా
గుండెలోన ఇంతచోటుని చూడనంటె న్యాయమా
గూడులేని పావురానికి దారిచూపు దైవమా
గోపురాన వాలరాదని ఇంతపెద్ద శాపమా
మదిలో సుడిలో ఎదురీత
కలలే కథలై ఎదకోత
కననీ విననీ విధిరాత
తుదిలేని ఈ కథ
అంకితం చేశాను నేస్తం నమ్మవా నమ్మవా ॥ఏదో॥
ఊరువాడ తోడురాదని బాధలేదు బంధమా
ఊపిరైన నీవులేనిదే నేను లేనే నేస్తమా
ఊహలోన తాకరాదని అంక్షలేల పాశమా
జ్ఞాపకాల పూలతోటలో ముళ్లు వేయబోకుమా
జననం మరణం సహజంట ప్రేమే వరమూ బలమంట
ఎదలో రగిలే చితిమంట కురిపించవా సుధా
నన్నిలాప్రేమించలేవా ప్రాణమా ప్రాణమా ॥ఏదో॥

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# తొట్టిగ్యాంగ్



ఇ.వి.వి.సత్యనారాయణ

## తారాగణం

నరేష్, ప్రభుదేవా, సునీల్, గజాల, అనిత, షకీలా, రజిత, జ్యోతి, బ్రహ్మానందం, చలపతిరావు, ఎం.ఎస్.నారాయణ, ఎ.వి.యస్, ఎల్.బి.శ్రీరామ్, జయప్రకాష్ రెడ్డి, ఆహుతి ప్రసాద్, బెనర్జి, లక్ష్మీపతి, గణేష్



దేవీశ్రీ ప్రసాద్



సురేంద్ర కృష్ణ



పోతుల రవికిరణ్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : సతీష్ |
| పాటలు | : సురేంద్ర కృష్ణ, పోతుల రవికిరణ్, వరికుప్పల యాదగిరి |
| కెమెరా | : లోక్‌నాథ్ |
| రచన సహకారం | : నాగరాజు, బలరాం, ఉండ్రమట్ల నాగరాజు |
| ఆర్ట్ | : శ్రీహరి |
| స్టిల్స్ | : శ్రీను |
| ఎడిటింగ్ | : మార్తాండ్, కె.వెంకటేష్ |
| మేకప్ | : నాని |
| కాస్ట్యూమ్స్ | : మనోజ్‌కుమార్ |
| ఫైట్స్ | : హార్స్‌మన్‌బాబు |
| డాన్స్ | : రాజు సుందరం, ప్రభుదేవా, దినేష్, శ్రీధర్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : యాడ్స్ మీడియా |
| ప్రొడక్షన్ డిజైనర్స్ | : అమ్మిరాజు, ఎ.యస్.రాముడు |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : గోపి |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : డి.మోహనరావు, కె.వెంకటేశ్వరరావు |
| నిర్వహణ | : ఈదర కృష్ణారావు |
| కో డైరెక్టర్ | : ఎక్కంటి సురేష్, ఈశ్వరరెడ్డి |
| అసోసియేట్స్ | : సూర్యం, బి.వి.వి.చౌదరి |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : బి.కిషోర్ |
| సంగీతం | : దేవీశ్రీ ప్రసాద్ |
| కథ, స్క్రీన్‌ప్లే | |
| దర్శకత్వం, నిర్మాత | : ఇ.వి.వి.సత్యనారాయణ |



## తారాగణం

సచిన్, భావన, చంద్రమోహన్, ఆలీ, ఎం.యస్.నారాయణ, ఆహుతి ప్రసాద్, వైజాగ్ ప్రసాద్, వేణుమాధవ్, నర్సింగ్ యాదవ్, ఎ.ఆర్.సి.బాబు, మల్లేష్ యాదవ్, చిత్రం బాషా, పి.డి.రాజు, రాంచంద్రరావు, మాస్టర్ ఆకర్ష్, మోహన్-మధు, రావు తీర్థ-శ్రీను

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

JM J.M. Entertainment

# నినుచూడక నేనుండలేను

*Love is Life*

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : పినపాక కృష్ణప్రసాద్, మోహన్ |
| పాటలు | : కులశేఖర్ |
| ప్లేబ్యాక్ | : ఇళయరాజా,ఆర్.పి.పట్నాయక్, కె.కె., టిప్పు, సాదనా సర్గమ్, శ్రేయ |
| ఎడిటింగ్ | : కె.వి.కృష్ణారెడ్డి |
| ఫోటోగ్రఫి | : అరుణ్‌కుమార్. ఎస్. |
| ఫైట్‌మాస్టర్ | : హార్స్‌మన్ బాబు |
| డాన్స్‌మాస్టర్స్ | : సుచిత్రచంద్రబోస్,హరి, బాబా యాదవ్ |
| ఆర్ట్ డైరెక్టర్ | : జేపి. |
| కాస్ట్యూమ్స్ | : జగదీష్ |
| స్టిల్స్ | : విజయ్‌కుమార్ |
| మేకప్ | : హరి |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : సి.ఆర్.శ్రీను, శ్యామ్‌గోకుల్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : రవిగోగు, వీరు |
| కో డైరెక్టర్ | : డి.శ్రీనివాస్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : తన్వీర్ |
| పబ్లిసిటీ | : ప్రకాష్ సాయికృపా పోస్టర్స్ |
| పి.ఆర్.ఒ. | : గోగినేని శ్రీనివాస్ |
| సంగీతం | : ఇళయరాజా |
| నిర్మాత | : జె.యం.జోషి |
| కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : ఆర్.శ్రీనివాస్ |



కులశేఖర్



ఇళయరాజా

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

# న తుమ్ జానో న హమ్...

| | | |
|---|---|---|
| చిత్రం | : | కహోనా ప్యార్ హై |
| రచన | : | ఇబ్రహీం అష్క |
| సంగీతం | : | రాజేష్ రోషన్ |
| గానం | : | లక్కీ అలీ, రమ్య |
| అభినయం | : | హృతిక్ రోషన్, అమీషా పటేల్ |




క్యూఁ చల్‌తీ హై పవన్
క్యూఁ ఝూమే హై గగన్
క్యూఁ మచల్ తా హై మన్
న తుమ్ జానో న హమ్ (2)
క్యూఁ ఆతీ హై బహార్
క్యూఁ లుట్‌తా హై కరార్
క్యూఁ హోతా హై ప్యార్
న తుమ్ జానో న హమ్ (2)

యే మద్‌హోషియాఁ, యే తన్హాయియాఁ
తసవ్వుర్ మేఁ హైఁ కిస్‌కీ పర్‌ఛాయియాఁ
యే భీగా సమా, ఉమంగే జవాఁ
ముఝే ఇష్క్ లే జారహా హై కహాఁ
క్యూఁ గుమ్ హై హర్ దిశా
క్యూఁ హోతా హై నషా
క్యూఁ ఆతా హై మజా
న తుమ్ జానో న హమ్ (2)

ధడక్‌తా భీ హై, తడప్‌తా భీ హై
యే దిల్ క్యూఁ అచానక్ బహక్‌తా భీ హై
మహక్‌తా భీ హై, చహక్‌తా భీ హై
యే దిల్ క్యా వఫా కో సమఝ్‌తా భీ హై
క్యూఁ మిల్‌తీ హై నజర్
క్యూఁ హోతా హై అసర్
క్యూఁ హోతీ హై సహర్
న తుమ్ జానో న హమ్ (2)

«క్యూఁ చల్‌తీ హై పవన్»



కొత్త నటీనటులు నటించిన చిత్రాలు విజయం సాధించటం హిందీ చిత్రాలలో తరచు జరుగుతూనే ఉంటుంది. 'బాబీ', 'లవ్‌స్టోరీ', 'బేతాబ్', రామ్ తేరీ గంగా మైలీ' 'కయామత్ సే కయామత్ తక్', 'మైనే ప్యార్‌కియా', 'ఫూల్ ఔర్ కాంటే' వంటి చిత్రాలు ఇందుకు ఉదాహరణలు. కానీ హృతిక్‌రోషన్, అమీషాపటేల్‌ల తొలిచిత్రం 'కహోనా ప్యార్ హై' సాధించిన విజయం నభూతో న భవిష్యతి అనిపిస్తుంది. రాకేష్ రోషన్ దర్శకత్వం, రాజేష్ రోషన్ సంగీతం, హృతిక్ రోషన్ నటన ఈ చిత్రానికి తిరుగులేని విజయం సాధించిపెట్టాయి. 'ఇండియా టుడే' పత్రిక ముఖ చిత్రంగా అతని ఫోటో వేశారంటే అతను సంపాదించిన క్రేజ్ ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు.

'ఖూన్ భరీ మాంగ్', 'కిషన్ కన్హయా', 'ఖేల్', 'కరణ్ అర్జున్', 'కోయ్‌లా' వంటి వైవిధ్యభరితమైన చిత్రాలు రూపొందించిన రాకేష్ రోషన్ తన తనయుడు హృతిక్ రోషన్ హీరోగా చిత్రం తీయాలనుకుంటున్నట్టు అతనికి చెప్పగానే అతడు పూర్తి దీక్షతో శిక్షణ పొందటం ప్రారంభించాడు. నటన, డాన్స్, ఫిట్‌నెస్‌లలో శిక్షణ పొంది హీరో అవటానికి సన్నద్ధుడయ్యాడు. అతని శ్రమ అద్భుతమైన ఫలితాల నిచ్చిందనడంలో సందేహం లేదు కదా!

రాజేష్ రోషన్ మూడు దశాబ్దాల నుంచి సంగీత దర్శకుడిగా ఉన్నా ఆయనకు తగిన గుర్తింపు రాలేదు. ఆయన సంగీతం అందించిన 'జూలీ' చిత్రంలోని 'దిల్ క్యా కరే' పాట ఇప్పటి తరాన్ని కూడా ఆకట్టుకుంటూనే ఉంది. తన సోదరుడు రాకేష్ రోషన్ చిత్రాలన్నిటికి

ఆయనే సంగీతం అందించారు. నేటి యువతరాన్ని కూడా ఆకట్టుకునే విధంగా 'పాపా కహతే హైఁ' చిత్రానికి సంగీతం అందించారు. 'కహోనా ప్యార్‌హై' చిత్రంతో ఆయనకు అవార్డులు, రివార్డులు దక్కాయి. ఈ చిత్రంలోని 'ఇక్ పల్ కా జీనా' పాట హృతిక్‌ను డాన్సింగ్ స్టార్‌గా నిలబెట్టింది.

ఇండీపాప్ సింగర్‌గా పేరు గడించిన లక్కీ అలీ నేపథ్య గాయకుడిగా పాడిన తొలి చిత్రమిదే. ఈ చిత్రానికి అతనితో పాటు రాజేష్ రోషన్, రాకేష్ రోషన్, హృతిక్ రోషన్‌లకు ఫిలింఫేర్ అవార్డులు లభించాయి.

'న తుమ్ జానో న హమ్' పాట తొలిసారిగా ప్రేమలో పడిన యువకుడు పాడే పాట. ప్రేమలో పడినపుడు అన్నీ కొత్తగా కనిపిస్తాయి. వీచే గాలి, పూచే పూలు, ఉదయాలు, సాయంత్రాలు, అన్నీ తన ప్రేమ కోసమే అన్నట్టు అనిపిస్తుందది. మరో పక్క ప్రేమంటే ఇదేనా అనే సందేహం కూడా ఉంటుంది. ఈ భావాలన్నీ కలిసిన రొమాంటిక్ గీతమిది. ఇంకో విశేషమేమిటంటే- సాధారణంగా పాత చిత్రాల పాటల పల్లవులను సినిమా పేర్లుగా పెడుతుంటారు. ఉదాహరణకి 'హమ్ హైఁ రాహీ ప్యార్ కే', 'దిల్‌వాలే దుల్హనియా లేజాయేంగే', 'బోల్ రాధా బోల్', 'ముఝే కుచ్ కహ్‌నాహై', 'ఆప్ ముఝే అచ్ఛే లగ్నే లగే'. కానీ 'కహోనా ప్యార్‌హై' చిత్రం విడుదలయిన కొన్ని రోజులకే 'న తుమ్‌జానో న హమ్' పేరుతో ఒక చిత్రం మొదలయింది. ఈ చిత్రంలో హృతిక్ రోషన్, సైఫ్ అలీ ఖాన్, ఈషా దేవల్ నటించారు.



'న తుమ్ జానో న హమ్' అంటే 'నీకూ తెలీదు నాకూ తెలీదు' అని 'ఝూమ్‌నా' అంటే నాట్యం చేయటం 'మచల్‌నా' అంటే ఉవ్విళ్ళూరటం. బహార్ అంటే వసంతం. 'కరార్' అంటే మనశ్శాంతి 'లుట్‌నా' అంటే కొల్లగొట్టబడటం.

'గాలెందుకు వీస్తుంది
ఆకాశమెందుకు ఆడుతుంది
మనసెందుకు ఉవ్విళ్ళూరు
తుంది
నీకూ తెలీదు నాకూ తెలీదు
వసంతమెందుకు వస్తుంది
కుదురెందుకు పోతుంది
ప్రేమెందుకు పుడుతుంది
నీకూ తెలీదు నాకూ తెలీదు'

గాలి వీస్తే ఆకాశం నాట్యం చేసినట్టు అనిపిస్తుంది. మనసులో ఏదో అలజడి రేగుతుంది. ప్రేమలో పడ్డప్పుడు మామూలు గాలి కూడా కొత్తగా తాకుతుంది. వసంతమొస్తే మనసుకు కుదురులేకుండా పోతుంది. ఇలా ఎందుకు జరుగుతుందో 'నీకూ తెలీదు నాకూ తెలీదు అంటున్నాడతను ప్రేయసిని ఊహించుకుంటూ.

'మద్‌హోషీ' అంటే తన్మయత్వం. 'తన్హాయీ' అంటే ఏకాంతం.



'తసవ్వుర్' అంటే తలపులు. 'పర్‌ఛాయీ' అంటే నీడ. 'సమాఁ' అంటే వాతావరణం. 'ఉమంగ్' అంటే ఆశ. 'ఇష్క్' అంటే ప్రేమ. 'మజా' అంటే ఆనందం.

'ఈ తన్మయత్వం, ఈ
ఏకాంతం
తలపుల్లో ఎవరి నీడలివి
ఈ తడి పొద్దులు, విరిసిన
ఆశలు
ఈ ప్రేమ ఎక్కడికి
దారి తీస్తుంది
దిక్కులు
కానరావేం
ఈ మత్తు ఎందుకో
ఈ ఆనందం ఏమిటో'

తలపుల్లో ఎవరో మెదులుతూ ఉంటే ఏకాంతంలో కూడా తన్మయత్వం కలుగుతుంది. ప్రేమ అతని ఆశలు పెంచి ఊహల్లో విహరింపజేస్తోంది. దిక్కులన్నీ మాయమయి ప్రేమే అంతటా నిండి ఉన్నట్టనిపించే మైకంలో ఉన్నాడతను.

'తడప్‌నా' అంటే ఆరాటపడటం. 'అచానక్' అంటే 'అకస్మాత్తుగా' అని. 'బహక్‌నా' అంటే కట్టు తప్పటం. 'మహక్‌నా' అంటే పరిమళించటం. 'చహక్' అనేది పక్షులు చేసే కిలకిల నాదం. 'వఫా' అంటే విశ్వాసం. 'నజర్' అంటే చూపు. 'అసర్' అంటే ప్రభావం. 'సహర్' అంటే ఉదయం.

'ఈ గుండె కొట్టుకుంటుంది, ఆరాట పడుతుంది
ఉండి ఉండి ఎందుకు ఎగసిపడుతుంది
పరిమళిస్తుంది, చిలిపిగా పలుకుతుంది.
కానీ ఈ మనసుకి కట్టుబడి ఉండటం తెలుసా
చూపులెందుకు కలుస్తాయి
ఏదో అవుతుందెందుకని
ఉదయమెందుకు వస్తుంది'

మనసు ఎంతో ఆరాటపడుతుంది, రకరకాల భావాలు ప్రదర్శిస్తుంది. కానీ ప్రేమంటే ఏమిటో ఈ మనసుకు తెలుసా? ప్రేమిస్తే కట్టుబడి ఉండాలని తెలుసా అని ప్రశ్నించుకుంటున్నాడు.

రాకేష్ రోషన్ దర్శకత్వం హృతిక్‌రోషన్ నటించే తదుపరి చిత్రం 'కోయీ మిల్ గయా' నిర్మాణంలో ఉంది. ఇందులో హీరోయిన్ ప్రీతిజింటా. ఈ చిత్రం పేరు 'కుఛ్ కుఛ్ హోతా హై'లోని ఓ పాట పల్లవి నుంచి తీసుకున్నదని వేరే చెప్పనక్కర్లేదు.

- పి.వి.సత్యనారాయణ రాజు

◆



# బాపు విశ్వరూపం

బాపు అంటే ఒక బాపు కాదు, బోల్డు బాపులు. (వివరాలకు రమణగారి వ్యాసం చూడవలెను). చిత్రకారుడిగా, కార్టూనిస్టుగా, పబ్లిసిస్టుగా కొన్ని బాపులనైనా చూపాలంటే ఎన్ని పేజీలూ చాలవు. ఈ డిసెంబరు 15 నుండి ప్రారంభమయ్యే బాపు సప్తతి వేడుక సందర్భంగా ఈ ఏడాదిలో వచ్చే 'హాసం' 24 సంచికలలోను ఒక్కో రూపం కొన్ని, కొన్ని చూపిద్దామని మా తాపత్రయం.

బాపు బొమ్మలు నిత్యనూతనంగా ఎందుకుంటాయి? రమణగారు చెప్పినట్టు ఫారిన్ వాడి థాట్‌ను ఇస్త్రీ చేసి అచ్చతెలుగైజ్ చేయగలరు. మళ్లీ సంప్రదాయానికి కట్టుబడుతూనే మోడ్రన్‌గా ఉండగలరు. రెండిటిలోను నిష్ణాతులాయన. పూర్తి సంప్రదాయబద్ధంగా తంజావూరు బొమ్మలు వేయగల బాపు సంప్రదాయం, ఆధునికత కలబోసి, ఫ్రెంచ్ వారు కూడా ఆదరించేలా, రామాయణాన్ని బొమ్మల్లో ఎలా అందించారో చూడండి. తన ఇష్టదైవం ఆంజనేయస్వామి లీలలు చిత్రీకరించిన రెండు బొమ్మలివిగో - ఉదాహారణకి మొదటిదాంట్లో సముద్రంలో అలలు, చేపల విలాసాలు, రెండో బొమ్మలో మంటల విన్యాసాలు-తోక ఒక బొమ్మకి బోర్డర్‌గా, మరో బొమ్మలో త్రిశూలంగా (ఆయన రుద్రాంశ సంభూతుడుగా!) రూపుదిద్దుకున్న వైనం చూడండి. మేం చెప్పినవే చూడాలని లేదు. మీకు ఇంకా సిమిట్రీ లాంటి బోల్డు అంశాలు నచ్చుతాయి, మాకు తెలుసు. అవీ చూడండి.





## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు

**వి. మంజురాణి - హైదరాబాద్**

❖ చూపుల్తోనే కాల్చేస్తే?

✦ టెలిఫోన్ డిపార్ట్‌మెంట్‌కి బోలెడంత నష్టం వస్తుంది.

❖ "కృష్ణం వందే జగద్గురుం" అంటే ఏమిటి?

✦ ఓ కృష్ణా .... ఈ జగత్తుకి గురువు లాంటి వాడివి కనుక 'అవసరమైనపుడు ఒక్కటిచ్చుకో (వన్ దే)' అని అర్థం.

**డి. రామమూర్తి - విజయవాడ.**

❖ "ప్రజాప్రతినిధి" అంటే ఎవరు?

✦ ప్రజల కోసం ఏర్పాటు చేసిన ప్రతి నిధినీ మనవి చేస్తూ తనవిగా చేసుకునేవాడు.



## డబుల్‌రోల్



ఆ 'కండక్టర్'కి కండకావరం కొంచెం ఎక్కువే!
ఈ 'బండిల్' ఆ 'బండి'లో వెయ్యండి.

- జె. శిరీష, రాజమండ్రి.

అసలు 'ఆదాయమే' లేకపోతే 'ఆదా'
ఏమి చెయ్యగలం?

-పూజారి సింహాచలం, పాడేరు.



## చిలిపి లిపి



మాంగో : మగవాడు వెళ్ళు (Man go)

జర్మని : ఏవైనా క్రిములా (Germ any)

వాషింగ్‌టన్ : వంద కేజీలు ఉతుకుట (Washing ton)

- చాడా వెంకట శాస్త్రి, నవరంగపూర్ (ఒరిస్సా).

## ఈ రూటే వేరు



ఓవర్‌యాక్షన్ : క్రికెట్‌లో ఓవర్‌లు వేసేటప్పుడు చేసే యాక్షన్

-డి. పద్మిని ప్రసాద్, విశాఖపట్టణం.

జై పూర్ : పేదవారికి జయమగుగాక

-హెప్సి అండ్ నిషి, కూకట్‌పల్లి.

డి ఫెన్సు : కంచె లేకపోవుట

- జె. శ్రీకాంత్, రాజమండ్రి.

## చిలిపి కవిత



కన్నందుకు కట్టాలి స్కూల్ ఫీజు
వీల్లేదని చేశామో రెఫ్యూజు
భార్యగారు పీకేస్తారు మన ఫ్యూజు
దెబ్బతో టోటల్ లైఫంతా కన్‌ఫ్యూజు

-బి.వి.రావు
రుద్రారం

## పేరు -రిపేరు



"పోలీస్ సిస్టర్స్ - ఖైదీ బ్రదర్స్ - ఒకే కుటుంబం"
" అమృత - నీ ప్రేమకై"
"తొట్టిగ్యాంగ్ - అల్లరి - ఎంతబావుందో"

-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ

## పేరడీ పేరేడ్



మంచ్నీళ్ళు ఎటూలేవు
మంధైనా పొయ్యి బ్రదర్
రాజధాని నగరంలో
వీధి వీధి ఇదే గోల బ్రదర్
ఈ పుణ్యదేశంలో పెళ్ళికూడా
చావులాంటిదే బ్రదర్
మనలెగ్గు ఐరన్ లెగ్గు
వేసెయ్యి మరో పెగ్గు
ఎలుగెత్తి ఏడ్వమాకురా
తమ్ముడూ... నీ గొంతె ఎండిపోవురా... ఓ హోయ్
సిక్‌లీవు పెట్టుకుని
బిందె చేత పట్టుకుని
బోరింగు కొట్టినాము
భోరు భోరు మంటున్నాము
మూసీలో మునకేసి కాషాయం కట్టెయ్ బ్రదర్ ॥ మంచ్నీళ్ళు ॥
ట్రాన్స్‌కో బాధితులం
నిత్యధర పీడితులం
దాహంపై టాక్సు వేయరా తమ్ముడూ
దారేది లేనె లేదురా ఓ... హోయ్...
ఈ హైద్రబాదులో ఉండటం మన తప్పా
ఆలోచనే లేని అధికారులదే తప్పా
దేవునిదె భారమని
ఎదురు చూడరా బ్రదర్ ॥ మంచ్నీళ్ళు ॥

('ఆకలిరాజ్యం'లో సాపాటు ఎటూ లేదు పాటైన పాడుబ్రదర్' పాటకు పేరడీగా)

- ఎమ్. శ్రేష్ఠ
హైదరాబాదు



# ఇంటి కథ

**-మల్లాది వెంకట కృష్ణమూర్తి**

సీరియల్ 21



## జరిగిన కథ

అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బుఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేనా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావుకి చెప్తాడు. బామ్మకు చావు 'ఎరేంజి' చేయడానికి హరకేశం అనే కిరాయి హంతకుడి సాయం తీసుకోమంటాడు సుబ్బారావు. ఎవరికీ అనుమానం రాకుండా పాముకాటుతో చంపుదామని హరకేశం ఒక పాముని కొని లింగమయ్యకు చెబుతాడు...



లింగమయ్యలో ఓ జబ్బుంది. అది మానసికమైనది. తనేదైనా చిన్న ఘనకార్యం చేస్తే దాన్ని పదింతలు చేసి ఇతరులకి చెప్పి వారి మెప్పు పొందాలన్న దుగ్ధే ఆ మానసిక జబ్బు.

తను పాతిన మిరప మొక్కకి మిరపకాయ కాస్తే ఆ సంగతి టాంటాం వేస్తాడు. తనకి జీతం పెరిగితే అది తన వాళ్ళందరిళ్ళకీ ఆటోరిక్షా వేసుకుని వెళ్ళి చెప్తే కాని మనసు శాంతించదు. ఓ దీపావళికి సుబ్బారావు అతనికో బంగారు వాచీ ఇస్తే ఆ సంగతి అయినవాళ్లకీ, కానివాళ్ళకి చెప్పి, దూరపు బంధువులకి ఉత్తరాల ద్వారా తెలియచేశాడు. సూపర్‌బజార్‌లో స్క్రాచ్ కార్డ్‌లో మిల్క్ బాయిలర్ వస్తే అదీ టాం టాం చేస్తాడు.

ఇంత చిన్న విషయాల్లోనే అతని మనస్తత్వం అలా పని చేస్తే, ఇక బామ్మ మరణించేలా తను ఏర్పాటు చేసిన సంగతి చెప్పకుండావుంటే, కడుపు ఉబ్బి తీరుతుంది కదా! అయితే అది అందరికీ చెప్పుకునే ఘనమైన విషయం కాదు కాబట్టి దానికి సంతోషించేవాళ్ళకి చెప్పుకోదలచుకున్నాడు.

ఆ సందర్భంగా రాత్రి లింగమయ్య తన తమ్ముడింటికి వెళ్ళాడు. వాళ్ళు టి.వి. కట్టేసి నిద్రకి ఉపక్రమించబోతున్నారు. లింగమయ్యని చూసి ఆహ్వానించాడు వెంకటరత్నం.

"రా అన్నయ్యా. ఏమిటి విశేషం ఈవేళప్పుడు వచ్చావు?"

"మీకో ముఖ్యమైన సంగతి చెప్పిపోదామని. నిరుపమ్‌ని కూడా పిలు. మీ ఆవిడని కూడా".

ఆంతా చుట్టూ చేరాక చెప్పాడు.

"మన తాతయ్య, బామ్మదగ్గర ఆవిడ ఇల్లు కొన్న తీరు అతి చచ్చు వ్యవహారం అని అనేకసార్లు తేల్చాం అవునా?"

"ఎందుకనుమానం?"

అవును. "నా అనుమానం ఆవిడ ఏనూట ఇరవైఏళ్ళో బ్రతికి గిన్నెస్‌బుక్‌లోకి ఎక్కుతుందని" చెప్పాడు వెంకటరత్నం తమ్ముడు నిరుపమ్.

"కదా? అప్పటిదాకా మనం ఆవిడ ఇంటిని స్వాధీనం చేసుకోలేం. అందుకని నేనో పని చేసాను." ముగ్గురి మొహాల్లోకి కొద్దిగా గర్వంగా చూస్తూ చెప్పాడు లింగమయ్య.

"ఏం పని చేసావు?" ప్రశ్నించాడు నిరుపమ్.

**వైజాగ్‌లోని ఓ బార్ లోంచి బయటకి తూలుకుంటూ రాగానే, తెల్లటి యూనిఫారంలో ఉన్న ఒకతను అతన్ని పట్టుకున్నాడు.**

**"నాకో ఆటోని పిలు వాచ్‌మెన్" చెప్పాడాతాగిన వ్యక్తి.**

**"నేను వాచ్‌మెన్‌ని కాను. నేవల్ ఆఫీసర్‌ని."**

**"అలాగా. అయితే ఓ బోట్‌ని పిలు."**

**తాగిన వాళ్ళ బుర్ర రీజనబుల్‌గా పనిచెయ్యదు. పాముని పొట్లకాయనుకుంటారు. అలాంటి సన్నివేశం ఈ సీరియల్‌లో ఉంది.**

"ఈ రాత్రికి ఆవిడ టపాకట్టే ఏర్పాటు"

ఆ ముగ్గురి మొహాల్లోకి అశ్చర్యాన్ని, గర్వంగా తిలకించి చెప్పాడు.

"అవును నిజంగా రేపే పాటికి ఆవిడ వుండదు."

"ఎలా?" ప్రశ్నించింది వెంకట రత్నం భార్య జయశ్రీ. "అందుకు మనిషి ని మాట్లాడాను."

"ఇంత అకస్మాత్తుగా ఎందుకంత తొందర పడ్డావు?" ప్రశ్నించాడు వెంకటరత్నం.

"లేకపోతే ఆవిడ ఛస్తే చావదు కాబట్టి"

"ఇది బయటపడితే నీకు చిక్కుకదా?"

"బయటికిరాదు. రేపేపాటికి ఆవిడ పాము కాటుకి మృతి చెందుతుంది. అలా చేసాను ఏర్పాటు" చిరునవ్వుతో చెప్పాడు.

"వాళ్ళింట్లో అప్పుడప్పుడూ పాము కనబడుతుంది అని మేం పుట్టలో పాలు




పోయడానికి వెళ్ళినప్పుడు చెప్పుంటారు. దాంతో నేనా?" ప్రశ్నించింది జయశ్రీ అసక్తితో.

"కాదు. ఇంకోటి. కాని అంతా అనుకునేది అ పుట్టలోని పాము పనే ఇదని"...

తన బాస్ సుబ్బారావు బామ్మ ఇల్లు కొనాలనుకోవడం, ఆవిడ అమ్మననడం, ఫలితంగా ఆయనకి తను బామ్మని లేపేయమని సలహా ఇవ్వడం, హరకేశంతో జరిగిన ఏర్పాటు గురించి గర్వంగా వివరించాడు లింగయ్య.

"ఈ రాత్రి బామ్మకి గడవదు. ఇక ఆ ఇల్లు మనం లీగల్‌గా వశం చేసుకోవచ్చు. దాంతో మనందరి ఆర్థిక చిక్కులు తీరతాయి".

అందరి మొహాల్లో ఆనందం కనిపించింది- దానితోపాటు 'అయ్యో! హత్యే' అన్న భావం కూడా.

అది గమనించి చెప్పాడు లింగమయ్య.

"ఆవిడ బ్రతికి ఎవర్ని ఉద్ధరించేదిలేదు. ఇండియన్ సెన్సస్ సగటు లెక్కల ప్రకారం ఎప్పుడో చచ్చి వుండాల్సింది. పై లోకంలో ఏదో లెక్కల గడబిడవల్ల స్లిప్పయిపోయి జీవిస్తోంది. దాంతో ఆ యముడే ఈ ఏర్పాటు మా సుబ్బారావు చేత చేయించాడని నా నమ్మకం."

లింగమయ్య వెళ్ళాక ఆ ముగ్గురిలో సంతోషం ద్విగుణీకృతం అయ్యింది. తమ వాటాగా ఎంత రావచ్చో లెక్కలు వేసుకున్నారు. భార్యాభర్తలు దాంతో ఏం చెయ్యాలో చర్చించుకున్నారు.

బ్రహ్మచారి కాబట్టి వంటరిగా పక్కమీదకి చేరిన నిరుపమ్ కూడా ఆ డబ్బు గురించి ఆలోచించాడు. ఆరోజే అనన్య బ్యాంకులో తన ఫ్రెండ్‌తో డబ్బున్నవాడిని పెళ్ళి చేసుకోవాలని మాట్లాడుకోవడం గుర్తొచ్చింది. అకస్మాత్తుగా తనకో పాతిక-ముప్పై లక్షలు సమకూడితే అప్పుడు అనన్య తనని చేసుకోవడానికి అంగీకరించవచ్చు.

ఆమె అంటే తనకెంతో ఇష్టం అన్న సంగతిని అనేక రకాలుగా ఇండైరెక్ట్‌గా సూచిస్తున్నా, ఆమెనించి అనుకూలమైన స్పందన రాకపోవడానికి కారణం తనకి ఆస్తి పాస్తులు లేవనేకావచ్చు. తన వాటాగా రెండు మూడు ఫ్లాట్‌లు సుబ్బారావు దగ్గర తీసుకుంటే నెలకో పది పదిహేనువేలు అద్దెగా ఆదాయం వస్తుంది. అప్పుడు ఏడాదికో లక్షన్నరదాకా, పదేళ్ళలో వడ్డీ కలిసి ఇరవై లక్షలదాకా, ఒకవేళ దాన్ని ఇంకాస్త తెలివిగా ఇన్వెస్ట్‌చేస్తే ఇంకా ఎన్నోరెట్లవచ్చు.... అందమైన ఊహలతో ఓ పట్టాన నిరుపమ్‌కి నిద్ర పట్టలేదా రాత్రి.

ఆ రాత్రి నిద్రపోని మరొకరు. హరకేశం. రాత్రి దీపాలు పెట్టగానే భోజనం చేసేసాడు. అప్పటికే

పాముకి గుడ్లు ఆహారంగా పెట్టాడు. తన మెడ పట్టుకోగానే అది తన స్వేచ్ఛకి భంగం వాటిల్లడంతో మంచి కసిమీద ఉందేమో, అతని చేతికి చుట్టుకుంది. దాని డిన్నర్ అయ్యాక తిరిగి ఆ సంచిలో ఉంచి, మూతి దగ్గర ముడేసాడు.

ఏడున్నరకి ఒకరు ఆ సందు చివర సైకిలాపి సంకేతంగా ఈలవేసారు. అది వినగానే హరికేశం అది తమ పేకాట మిత్రుల పిలుపుగా గ్రహించాడు. పూర్వం వాళ్ళ ఇంటికొచ్చే పిలుచుకు వెళ్ళేవారు. కాని ఒకటి రెండుసార్లు పట్టుదలతో వంటిమీది దుస్తులు కూడా పందెం కాసి ఓడిపోయి నగ్నంగా ఇంటికి రావడంతో, అతని భార్య వాళ్ళని గుమ్మంలోకి అడుగు పెట్టనివ్వడంలేదు.

'ఒక్క ఆట ఆడి వస్తే' అనిపించింది. కాని చెయ్యాల్సిన పని ముఖ్యమైంది కాబట్టి వద్దని మనసుకు సమాధానం చెప్పుకున్నాడు. మందు కొట్టేవాడికి అది నిత్యం తీసుకునే టైంకి మందు కోసం నరాలు ఎలాగొడవ చేస్తాయో, అలా ఆ విజల్ విన్నాక, తన మిత్రులంతా స్కూల్ వెనక చేతిలో పేకముక్కలతో ఎలా వినోదిస్తూంటారో ఊహించాక, హరికేశం మనసుకూడా 'ఒక్కాట' అంటూ గొడవ చేయసాగింది. కాని దాన్ని తన అధీనంలో వుంచుకున్నాడు. ఈ ఒక్క రోజు తన పని కానిస్తే, వచ్చిన డబ్బుతో రేపు రాత్రంతా ఆటలో కూర్చోవచ్చున్న ధీమా వల్ల అతని మనసు కూడా ఆట్టే మారాం చేయలేదు.

"పడుకుంటున్నాను. రాత్రి ఒంటి గంటకి నిద్రలేపు" భార్యతో చెప్పాడు.

"అలాగే"

హరికేశం పడుకున్న కొద్దిసేపటికి నిద్ర పట్టింది. పన్నెండున్నరకి టి.వి కట్టేసి భర్తని లేపిందావిడ. లేసి చన్నీళ్ళతో స్నానం చేసి, కొత్త పైజామా లాల్చీ తొడుక్కుని "కాస్తంత డబ్బు ఇవ్వు. జేబులో ఏం లేదు" భార్య నడిగాడు.

"ఊహు పైకం అందితే నీవు పేకాటకు వెళతావు ఈ రాత్రి ఏ షాపులుండవు" ఆవిడ నివారించింది.

వంటగదిలోని అటక మీంచి తాచుపామున్న గోనెసంచిని తీసి సైకిలీకి తగిలించుకుని దాన్ని నెమ్మదిగా తొక్కసాగాడు.

స్కూల్ దగ్గర కొద్దిసేపు సైకిలాపి తటపటాయిస్తుండిపోయాడు, ఒక్క ఆట ఆడివెళితే అన్న ఆలోచనతో. తను ఒక్క ఆటతో లేవలేడన్నది అతనికి స్వానుభవమే కాబట్టి చివరకి వివేకమే గెలిచింది. రాంనగర్ వైపు సైకిల్ని పోనించాడు.

రాంనగర్ లోని ఓ చీకటి సందులోంచి అతని సైకిల్ వెళ్తుండగా అకస్మాత్తుగా దృఢంగా వున్న ఇద్దరు అడ్డం వచ్చారు. ఒకడు హరికేశం సైకిల్ హేండిల్ బార్ని పట్టుకుని ఆపితే, ఇంకొకరు హరికేశం భుజం పట్టుకుని ఆపాడు. వాళ్ళిద్దరి నుంచి స్వల్పంగా విస్కీ వాసన రావడం గమనించాడు హరికేశం.

"ఎవరు మీరు? ఎందుకాపారు నన్ను?" ప్రశ్నించాడు హరికేశం.

"నిన్నుకాదుబే ఆపింది, నీ సైకిల్ని, జేబులో ఎంతుందో తియ్".

ఒకడి చేతిలోకి కత్తిరావడం గమనించాడు హరికేశం.

"నాదగ్గర డబ్బేం లేదు"

**ఎలిబీ అంటే?**

**ఒకే సమయంలో రెండు ప్రదేశాల్లో ఉండగలగడం. హరికేశం తను రోడ్డు మీద కాక, తన ఇంట్లో ఉండాలనుకున్న తమాషా సన్నివేశం కోసం ఈ సీరియల్ చదవండి.**

వాళ్ళు హరికేశం లాల్చీ పైజామాల జేబులు వెదికితే నిజంగా అతని జేబులు ఖాళీ. మెళ్ళో గొలుసుందేమోనని చూశారు. చేతికి వాచీతోసహా ఒంటి మీద ఏం లేదు.

"నువ్వేం మనిషివి బే. ఏదీ దగ్గరుంచుకోకుండా" రెండోవాడు హరికేశాన్ని కోపంగా ఓ పీకు పీకాడు.

వాళ్ళ దృష్టి సైకిల్ వెనకు ఉన్న గోతాం మీద పడింది.

"ఏముందందులో?"

"మీకు పనికివచ్చేదే లేదు. పొట్లకాయ"

"ఏడ్చావ్గాని నిజం చెప్పు"

"నిజమే చెప్పాను"

హరికేశాన్ని ఇంకో దెబ్బ వేసి ఒకదాన్ని చేత్తో తడిమి చెప్పాడు మిత్రుడితో.

"నిజమే. మెత్తగా పొట్లకాయ లాగానే ఉంది."

రెండోవాడు కూడా చేత్తో ఆ సంచిని టచ్ చేసి చెప్పాడు.

"పొట్లకాయే. సరే, ఆ సంచి తీసుకుని సైకిల్ దిగు" ఆజ్ఞాపించాడు ఆ ఇద్దరిలో తక్కువ తాగినవాడు.

"దేనికి?"

మళ్ళీ ఓ దెబ్బవేసి చెప్పాడు రెండోవాడు.

"ముందు దిగు"

హరికేశాన్ని సైకిల్ మీంచి దించాక ఒకడు అతని మెడ దగ్గర కత్తిని ఆనిస్తే ఇంకొకడు, హరికేశానికి ఏం జరుగుతోందో అర్థమై ప్రతిఘటించేలోపు, అతని వంటి మీది బట్టలు విప్పతీసుకున్నాడు.

"ఏయ్, ఏమిటిది?"

పకపక నవ్వారిద్దరూ.

"దీన్నే నిలువుదోపిడి అంటారు. వెళ్ళి నీ దిక్కున్నచోట చెప్పుకోపో. ఇదిగో నీ పొట్లకాయ నువ్వేతిను" సంచిని అతని చేతిలో ఉంచి చూస్తుండగానే వాళ్ళిద్దరు సైకిల్ ఎక్కి హరికేశం బట్టలతో ఉడాయించారు.

ఆ అనుకోని ఉపద్రవానికి దిశమొలతో రోడ్డు మీద నిలబడ్డ హరికేశానికి ఏం చెయ్యాలో తెలీలేదు.

అర్ధరాత్రి దాటినా ఒకటీ అరా స్కూటర్లు, కార్లు తిరిగే సమయం అది. అంచేత నక్కుతూ జాగ్రత్తగా చూసుకుంటూ హరికేశం అలాగే పదినిముషాల్లో బామ్మ ఇంటి కాంపౌండ్వాల్ దగ్గరకి చేరుకున్నాడు. అయితే స్టాండ్ వేసి సైకి



ఎక్కడానికి సైకిల్ లేదు. నున్నటి ఆ గోడ మీంచి పైకి ఎగబాకడానికి ప్రయత్నించి విఫలం అయ్యాడు. ఏం చెయ్యాలో తట్టక నిస్పృహగా దిశమొలతో నిలబడ్డ అతని పక్కనించి రెండు స్కూటర్లు వెళ్ళాయి. వాటిమీది వాళ్ళు అతన్ని తేరిపార చూసుకుంటూ వెళ్తూంటే సిగ్గుతో చితికిపోయాడు హరకేశం.

నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న తన ఇంటికి వెళ్ళడానికి అదృష్టవశాత్తు ఆటో దొరకవచ్చు. కానిపని పూర్తిచేసికాని కదల దలచుకోలేదు.

బామ్మ ఇంటి గేటు ఎక్కి లోపలికి గెంతచ్చు. కాని ఆ ఇంటి ముందున్న అరుగుల మీద అనేకమంది బిచ్చగాళ్ళు పడుకుని ఉన్నారు. అది క్రితం రోజే గమనించాడు. వాళ్ళలో ఎవరు మేలుకుని ఉండి తనని చూసినా ఇంత సంగతులు. అందుకే ఆ ధైర్యం చేయదలచుకోలేదు.

హరకేశం గోడ వెంటే వెళుతూ చూశాడు, ఎక్కడైనా పెచ్చులు ఊడి కాస్తంత కాలు పెట్టడానికి అవకాశం ఉంటుందేమోనని. అలా ఎక్కడానికి వీల్లేకుండా అన్ని చోట్లా సిమెంట్ నున్నగా ఉంది.

అది మెయిన్ రోడ్ కూడలి. లలితా నగర్ వాసుల కారొకటి అతని పక్కనించి వెళ్ళింది. ఇంకోసారి సిగ్గేసింది హరకేశానికి, కారు స్లో చేసి వాళ్ళు అతనిని చూస్తూ వెళ్ళడంతో నిలువుదోపిడి చేసిన ఆ దొంగల మీద కోపం వచ్చిందతనికి.

బామ్మ ఇంట్లోకి వెళ్లడం చేతకాక, పని కాకుండా వెనక్కి తిరగడం ఇష్టం లేక, దిక్కుతోచక అలా నిలబడిపోయిన హరకేశం పక్కనించి పిల్లాపాపలతో సెకండ్ షో నించి ఇంటికి వెళ్తున్న వారి ఆటో వెళ్ళింది. 'ఛీ ఛీ' తిట్టుకున్నాడు మనసులో.

అతని చెవుల్లో ఏదో శబ్దం పడడంతో చెవులు రిక్కించి విన్నాడు. దూరం నించి లీలగా వినపడడం మొదలైన ఆ శబ్దం క్రమేపీ దగ్గరవ సాగింది. అది పోలీస్ పెట్రోల్ జీప్ కుండే సైరన్‌గా అర్థం చేసుకోగానే హరకేశం ప్రైప్రాణాలు పైనే పోయాయి. అతని మెదడు చురుగ్గా పనిచేసింది. తన చేతిలోని మూటలో పాముందని వాళ్ళకి సోదాలో తెలిస్తే తన  పథకం మొత్తం చెప్పాల్సి ఉంటుందని చప్పున అబద్ధాలాడడం రాదు అతనికి.

దాన్నెక్కడ దాచాలా అని అటు ఇటు చూశాడు. ఎదురుగా సిమెంట్‌తో చేసిన గుండ్రటి చెత్తకుండీ కనిపించింది. ఆ గోనె పట్టా మూటని అందేలో పడేశాడు. తర్వాత రోడ్డు మీద ఎక్కడ దాక్కోవాలా అని చూస్తుండగా ఎక్కడా అతనికి మరుగన్నదే కనబడలేదు.

ఈలోగా పోలీస్ జీప్ చౌరస్తాలోంచి ఆ సందులోకి తిరిగింది. హెడ్‌లైట్ల కాంతి హరకేశం మీద పడగానే అతని ముందాగిందా జీప్. అందులోంచి పెట్రోలింగ్ చేస్తున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్ దిగాడు.

హరకేశాన్ని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాక చెప్పాడు.

**ఓ టైలర్ ఓ పోలీసాఫీసర్‌కి కుట్టితెచ్చిన దుస్తులకి జేబుల్లేవు. ఇదేంటని ఆ ఆఫీసర్ ప్రశ్నిస్తే,**

**"మీరు డబ్బుకోసం మీ జేబుల్లో చేతులు పెట్టాల్సిన అవసరం ఉండదు కదా" అని జవాబిచ్చాడు టైలర్.**

**అలాంటి ఇన్‌స్పెక్టర్ పాత్ర గల ఈ సీరియల్ మీకు ఆసక్తికరంగా ఉంటుంది.**

"నువ్వా... మళ్ళీ"

హరకేశం ఠక్కున చెప్పాడు.

"నేనే పోలీస్ స్టేషన్‌కి రావాలనుకుంటున్నాను. నా సైకిల్, నా వంటిమీది బట్టలు ఇద్దరు దొంగలు ఇప్పుడే దోచుకెళ్ళారు సార్. కత్తి చూపి బెదిరించారు."

తాము డ్యూటీలో ఉండగా, పెళ్ళాంతోసహా ఎవరేం చెప్పినా నమ్మకూడదన్నది పోలీసులకి శిక్షణలో భాగం కాబట్టి మామూలుగా వాళ్ళు ఏదీ నమ్మరు. ముఖ్యంగా అర్ధరాత్రి ఒంటిరిగా దిగంబరంగా ఉన్న వ్యక్తి చెప్పే విషయం అస్సలు నమ్మరు. ఒకవేళ నమ్మేమూడ్‌లో ఉన్నా ఆ ఇన్‌స్పెక్టర్ నమ్మకపోవడానికి ప్రధాన కారణం "నువ్వామళ్ళీ" అనడమే. ఆ మాటల్ని బట్టి హరకేశాన్ని 'నువ్వా' అంటూ గుర్తించాడని, 'మళ్ళీ' అనడం ద్వారా ఇదివరకోసారి ఇలాంటిది జరిగిందని అర్థమైపోతోంది.

"మూడు రోజుల క్రితం మనం పెట్రోలింగ్ ముగించుకుని స్టేషన్‌కి వెళ్తోంటే, ప్రభుత్వ ప్రైమరీ స్కూల్ బయట వీడు ఇలాగే దిగంబరంగా మనకి దర్శనం ఇస్తే పట్టుకెళ్ళాం సార్" హరకేశం పూర్వపరాలు ఓ కానిస్టేబుల్ ఇన్‌స్పెక్టర్‌కి తెలియచేశాడు.

"అవును, అయినా వీడు పేకాటలో ఓడి బట్టలు కూడా పోగొట్టుకుని రోడ్లో కనబడడం మానలేదు. చెప్పు ఎక్కడ పేకాడి వస్తున్నావు? మిగతా వాళ్ళేరి?" హరకేశాన్ని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"పేకాటా? అలాంటిదేం లేదు సార్. నే చెప్పింది నిజం. ఇద్దరు దొంగలు నా సైకిల్‌ని, ఒంటిమీది బట్టలని దోచుకెళ్ళారు.

"అది నన్ను నమ్మమంటావ్?"

"అమ్మతోడు సార్."

"వీడ్ని జీపెక్కించండి. ఈ పేకాట ముఠా సంగతి వీడి ద్వారా ఆరా తీద్దాం."

హరకేశం లబోదిబోమంటున్నా వదలకుండా అతన్ని జీప్‌లో స్టేషన్‌కి తీసుకెళ్ళారు. అలా మొండి మొలతోనే అతన్ని లాకప్‌లో ఉంచారు. ఇంటరాగేషన్‌కి రెండు లాఠీలతో ఇద్దరు కానిస్టేబుల్స్ అతని దగ్గరకెళ్ళారు.

అయితే హరకేశానికి చప్పున మెరుపులా ఓ ఆలోచన మెరిసింది. "ఆగండి, నే చెప్పిన నంబర్‌కి ఫోన్‌చేస్తే లింగమయ్య అనే అతను వచ్చి డబ్బిచ్చి నన్ను విడిపించుకు వెళ్తాడు. మూడు రోజుల క్రితం కూడా అదే జరిగింది."



'డబ్బిచ్చి అన్న పదం మంత్రంలా పనిచేసిందా కానిస్టేబుల్స్ మీద. "నంబరెంత?" అడిగాడు ఓ కానిస్టేబుల్ కొట్టడానికి ఎత్తిన చేతిలోని లాఠీని దించి.

ఆ నంబర్ చెప్పి, చెప్పాడు హరకేశం.

"నేను మాట్లాడితే కాని రాడు."

హరకేశం కంఠం వినగానే లింగమయ్య నిద్ర ఎగిరిపోయింది.

"ఏమిటి హరకేశం? అంతా సక్సెసా?"

"నేను పోలీస్‌స్టేషన్ నుంచి మాట్లాడుతున్నాను. చెప్పేది విను."

"ఎక్కడ నించి?" అదిరిపడ్డాడు.

"చెప్పేది విను. దారిలో దొంగలిద్దరు నా సైకిలు, ఒంటిమీది దుస్తులు తీసుకుని నిలువుదోపిడి చేశారు. దిగంబరంగా ఉన్న నన్ను పోలీసులు పట్టుకుని స్టేషన్‌కి తీసుకువచ్చారు. నువ్వు అర్జెంట్‌గా ఇక్కడికి వచ్చి నన్ను విడిపించాలి."

"రాస్కెల్, ఇడియట్. పని పెట్టుకుని పేకాటకి దిగావా?" అరిచాడు లింగమయ్య అవతలనించి.

"అలాంటిదేం లేదు. నే చెప్పింది నిజం. నువ్వు అర్జెంటుగా రా."

"నేను రాను. నాకిదే పనా? నీ పేకాట పిచ్చికి తగినశాస్తి జరిగింది."

"ఆగాగు. ఫోన్ పెట్టేయకు. మన పొట్లకాయ కోసమైనా నువ్వు అర్జెంటుగా రావాలి" అరిచాడు హరకేశం.

"పొట్లకాయా? మన పొట్లకాయా? నీకేమైనా పిచ్చా?"

"శ్రద్ధగా విను. జాగ్రత్తగా అర్థం చేసుకో. ఆ పొట్లకాయతోనేగా ఈ రాత్రి నేను పని చెయ్యాలనుకున్నది. నువ్వు రాకపోతే అది గోల్‌మాల్ అవుతుంది. నీకెందుకు, డబ్బుతో నువ్వు ముందిక్కడికి రా" గొంతు తగ్గించి చెప్పాడు.

"ఏ స్టేషన్‌లో ఉన్నావురా చింపాంజీ వెధవా?" రావడం ఇష్టం లేకపోయినా రాకతప్పదని తెలిశాక అడిగాడు లింగమయ్య కోపంగా.

"మొన్న నువ్వు నన్ను విడిపించిన స్టేషనే."

"రాస్కెల్, ఇడియట్. నీకు శుభ్రం కూడాను."

గంట తర్వాత లింగమయ్య తన స్కూటర్ మీద పోలీస్ స్టేషన్‌కి వచ్చాడు. ఇన్‌స్పెక్టర్‌తో బేరసారాలయి డబ్బు చేతులు మారాక లుంగీ, బనీన్లు వేసుకున్న హరకేశంతో బయటకి వచ్చాడు. స్కూటర్ మీద కొంత దూరం వెళ్ళాక దాన్నాపి ఇంజన్ ఆఫ్ చేసి ఉగ్రంగా అరిచాడు లింగమయ్య.

"ఈ రాత్రికే పేకాట ఆడాలా? ఆఁ? నీకు సిగ్గు, బుద్ధి, జ్ఞానం ఉండక్కర్లేదూ? రాస్కెలీడియట్."

"నీమీదొట్టు లింగమయ్యా. నేను పేకాట ఆడలేదు. నే చెప్పింది నిజమే. ఇద్దరు దొంగలు నన్ను నిలువు దోపిడి చేశారు."

"అది నన్ను నమ్మమంటావ్?"

"నువ్వూ ఆ పోలీస్ ఇన్‌స్పెక్టర్‌లా మాట్లాడితే ఇంక నేనేం చేయను?" కన్నీళ్ళు పెట్టుకున్నాడు హరకేశం.

అది చూసి తన కోపాన్ని తగ్గించుకున్నాడు లింగమయ్య. ఆ చీకటి సందులో జరిగింది వివరించాడు హరకేశం.

"అరెరె! రాస్కెలిడియట్స్ ఇద్దరూ అలా చేశారా?" నొచ్చుకున్నాడు లింగమయ్య నమ్మాక.

"మనం అర్జెంటుగా బామ్మ ఇంటి దగ్గర చెత్తకుండీ దగ్గరకి వెళ్ళాలి."

"ఏం?"

"పోలీసుల కంటపడకుండా ఆ తాచు పాము సంచిని అందులో దాచాను. దాన్ని తీసుకోవాలి. లేకపోతే మళ్ళీ అయిదు వందలు పెట్టి ఇంకొకటి మా పల్లెనుంచి కొనుక్కురావల్సి వుంటుంది."

"అది ముందే చెప్పచ్చుగా. చూడు తెల్లారింది. చెత్త డబ్బాల్లో కాగితాలేరుకునేవాళ్ళు తిరిగే టైం ఇది. ఆ సంచి అలాంటి వాళ్ళెవరికంట పడ్డా ప్రమాదమే. అది కాటేసినా వెయ్యకపోయినా, తప్పించుకున్నా, తప్పించుకోకపోయినా, ఎవరైనా దాన్ని చూస్తే, ఆ సంగతి టాంటాం అయి పోలీసులకి, పేపర్లవాళ్ళకి తెలిసిందా అంతా గోవింద. ఇక మన పథకం వెంటనే అమలు జరపలేం. బామ్మ పాము కాటేసి చచ్చిందంటే పోలీసులు అక్కడ తచ్చాడిన నిన్ను పట్టుకుంటారు" చెప్పాడు లింగమయ్య. ఇద్దరూ ఆదరాబాదరాగా ఆ చెత్తకుండీ దగ్గరకి చేరుకునేలోపే ఆ దారిలో, వీపున నల్లటి సంచిలతో, చెత్త కుండీలని వెదికే అనేక మంది చిత్తు కాగితాలవాళ్ళు కనబడుతూనే ఉన్నారు.

"అదిగో అక్కడే"

హరకేశం చూపించిన చెత్తకుండీ పక్కన స్కూటరాపాడు లింగమయ్య. హరకేశం స్కూటర్ దిగి దానివైపు నడిచాడు.

**(ఇంకావుంది)**



## సినీ 'హాసం'

**అ**ప్పుడు చెయ్యాల్సిన పని ఆర్నెల్లకి చేస్తాడని ఎప్పుడూ ప్రొడక్షన్ మేనేజరుని విసుక్కుంటూ ఉండేవాడు దర్శకుడు. అంచేత దర్శకుడు తన అసిస్టెంట్లతో చర్చించేదంతా తలుపు ఇవతలినుంచి విని, వారికి ఫలానది కావాలని నిశ్చయించుకున్నాడు - ప్రొడక్షన్ మేనేజరు.

ఒకనాడు దర్శకుడు వచ్చేసరికి, ఆయన టేబిల్ మీద (16 అవున్సుల) పెద్ద ఇంకు బాటిల్ ఉంది. బెల్ కొట్టి బోయ్‌ని పిల్చి "ఏమిటిది" అని అడిగాడు.

"నాకు తెలియదు సార్ - మేనేజరు పెట్టాడు" అని వెళ్ళిపోయాడు.

"సరే, మేనేజర్ని రమ్మను -" అన్నాడు.

మేనేజరు వచ్చాడు.

"ఏమిటయ్యా ఈ ఇంకు బాటిల్!"

"అదే సార్, నిన్న మీరూ కవిగారూ కల్సి మాట్లాడుకుంటూ ఇంకు బాటిల్ తెప్పించాలనుకున్నారు కదండి! మీరు నాకు చెప్పడం మర్చిపోయారు. అయినా నేను వెళ్ళి వెంటనే తెచ్చేశాను."

"ఇంకు బాటిలు కాదయ్యా - మహాశయా - ఎంకి పాటలు! అన్నాడు దర్శకుడు. దాని కోసం మేం విజయవాడ ఉత్తరం రాశాంలే."





# "స్వరంలో భాస్వరం దట్టించి నరాల్లో నాగస్వరాన్ని ఊదే గళం ఆమెది"



-భాస్కరభట్ల రవికుమార్

విశ్వామిత్రుడు కఠోర తపస్సు చేస్తున్నాడు! దేవేంద్రుడు ఆ తపస్సును భగ్నం చేయాలనుకున్నాడు - రంభని పంపించాడు -

విశ్వామిత్రుడి ముందు తన టాలెంటంతా ఒలకబోసిందామె! అయినా ఆ మహర్షి కన్నెత్తి చూస్తేనా?

'ఛత్' అనుకుని ఈసారి ఊర్వశిని పంపాడు ఇంద్రుడు.

రకరకాల విన్యాసాలు చేసిందామె. ఫలితం శూన్యం.

ఆఖరి అస్త్రంగా మేనకని పిలిచాడు. దేవకన్యల ఆటపాటలకి విశ్వామిత్రుడు అస్సలు టెంప్ట్ అవడం లేదు. కాబట్టి మరో రూట్‌లో ఎటెంప్ట్ చేద్దామనుకున్నాడు దేవేంద్రుడు.

'నువ్వు ఆట మాత్రమే ఆడు - పాట వేరే వారిచేత పాడిస్తాను' అన్నాడు. సరేనంది మేనక. ఆ తర్వాత మొదలయింది అసలైన వేడుక.

నేపథ్యంలో పాటవస్తుంటే - మేనక విశ్వామిత్రుడి ముందు ఆ పాటకి అనుగుణంగా నర్తించింది.

ఇంకేముంది .... ఠక్కున కళ్ళు తెరిచాడు ముని. రంభ, ఊర్వశి సాధించలేకపోయిన కార్యాన్ని మేనక ఎలా సాధించగలిగింది? అని ప్రశ్నిస్తే - "అది మేనక గొప్పదనం కూడా కాదు, వినిపించిన పాట గొప్పదనం. ఎలాంటి మగాణ్ణయినా - 'భలే భలే మొగాడివోయ్ బంగారు నా సామివోయ్' అని గిలిగింతలు పెట్టగలిగే శక్తి ఆ గళానికి ఉంది" అని సందేహనివృత్తి చేశాడు దేవేంద్రుడు.

"మరి ఆ గళం అదృశ్యంగానే ఉండిపోవాలా దానికో రూపం కల్పిస్తే అపురూపంగా చూసుకుంటాం కదా ...." అన్నారు దేవతలు.

"ఈ ఆలోచన కూడా బావుంది .... అయితే ఆ గళాన్ని సృష్టించి నా దగ్గరుంచిన ఆ బ్రహ్మదేవుణ్ణే అడుగుదాం" అన్నాడు దేవేంద్రుడు. దేవతల కోరిక విని నాలుగు ముఖాలతోనూ నవ్వాడు బ్రహ్మ.

"విశ్వామిత్రునికి తపోభంగం అవటంవల్ల మేనకకి శకుంతల జన్మిస్తుంది. ఆ శకుంతలకు దుష్యంతునివల్ల భరతుడు జన్మిస్తాడు. భూలోకంలో హిమాలయాల నుండి హిందూ మహాసముద్రం వరకు గల భూభాగంలో ఎందరెందరో మహానుభావులు, పురాణపురుషులు జన్మించవలసి ఉంది. ఆ భూభాగం ఈ భరతుని

**రామసక్కని బంగారుబొమ్మ రాసలీలకు వస్తావా(ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం), సీతాకోక చిలక సోయగాల మొలకా (ఔనువాళ్లిద్దరూ ఇష్టపడ్డారు) ఈ రెండు పాటలూ చాలు...భాస్కరభట్ల రవికుమార్ ఎవరో, ఏమిటో చెప్పడానికి.**

**సుమారు రెండేళ్లుగా 32 చిత్రాలలో 80కు పైగా పాటలు రాసిన భాస్కరభట్ల రవికుమార్ పాత్రికేయ వృత్తిని వదిలి సినీ గేయ రచయితగా స్థిరపడ్డాక రాసిన తొలివ్యాసమిది....**

పేరిట భారతదేశంగా పిలవబడుతుంది. వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకుని విశ్వామిత్రుని తపోభంగానికి కావలసిన కంఠాన్ని సృష్టించాను. ఆ కంఠానికి రూపాన్నివ్వాలన్న ఆలోచన మంచిదే! కానీ ఆ జీవి మీ వద్ద ఉండరాదు. ఎందుకంటే ఈమె స్వరం భాస్వరం దట్టించినట్టు ఉంటుంది. నరనరాల్లో నాగస్వరం ఊదినట్టు ఉంటుంది. భరతవర్షే భరతఖండే మేరో దక్షిణ దిగ్భాగే అన్నట్టు



భారతదేశంలోని దక్షిణ ప్రాంతం వారిని అలరించటానికి ఆ జీవికి అక్కడ జన్మను ప్రసాదిస్తున్నాను' అన్నాడాయన దృఢ నిశ్చయంతో.

'ఏం ఎందుకలా... వారికి మాత్రమే పరిమితం చేస్తున్నారు?" అడిగారు దేవతలు అక్కసును అణుచుకుంటూ. స్వరాలను వరాలుగా భావించి ఆరాధించే వారు అక్కడ ఎంతోమంది ఉన్నారు కాబట్టి" అని అన్నాడు బ్రహ్మ.

కట్ చేస్తే .... ఆ జీవికి....

ప్రాణం పోస్తే యల్.ఆర్. ఈశ్వరిగా ప్రాణం పోసుకుంది.

"సరసశృంగార సినీగీతాల్లో సరి
గమలే పలికించెలే యల్లారీశ్వరీ!"

రాజమండ్రిలో ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల్లో నేను సరదాగా యల్.ఆర్. ఈశ్వరి మీద లోకల్ మేగజైన్‌లలో రాసిన కొటేషన్ ఇది. అప్పటికి మా ఇంట్లో టేప్‌రికార్డర్ లేదు. కాబట్టి రేడియోలోనే పాటలు వినడం అలవాటు. అలా పాటలు వింటున్నప్పుడు ఎందుకో యల్.ఆర్. ఈశ్వరి వాయిస్ అంటే నాకు బాగా ఇష్టం ఏర్పడింది. ఆ మాటకొస్తే ఈవిడ పాటలంటే ఎవరు మాత్రం చెవికోసుకోరు చెప్పండి?

'లే లే లే నా రాజా
లేవనంటావా .... నిద్దుర లేవనంటావా....'

అనే పాట వినగానే మనసు రెక్కలు కట్టుకుని ఎక్కడెక్కడికో ఎగిరిపోదు! 'పెటపెటలాడే పచ్చి వయసూ పైపైకొచ్చింది' అని చరణం మొదలైతే ఎగిరిపోయిన మనసు ఇక తిరిగిరానని మొరాయించకపోదు.

కొంచెం గరం మసాలాని, కాసింత పంచదారనీ .... కాక్‌టెయిల్ చేసిన కంఠం ఆమెది.

ఎలాస్టిక్‌ని సాగదీసి ఒక్కసారి వదిలితే ఎలా చుర్రుమంటుందో యల్.ఆర్.ఈశ్వరి పాట వింటుంటే గుండెలలో చుర్రుమంటుంది. ఒక్క క్షణంలో ఒళ్ళంతా ఆ ఫీలింగ్ పాకిపోతుంది.

.... .... .... ....

ఏ ఔషధానికైనా ఎక్స్‌పైరీ డేటుంటుంది. ఒక్క ఆయుర్వేదానికి తప్ప. అలా ఎక్స్‌పైరీడేట్ లేని ఆయుర్వేద టానిక్ లాంటి గళం ఈమెది. కావాలంటే 1971లో ఆమె పాడిన 'లే లే లే నా రాజా' పాటని గానీ, 'మాయదారి సిన్నోడు' పాటనిగానీ 1977లోని 'భలే భలే మొగాడివోయ్' పాటని గానీ ఇప్పుడు వినండి ... ఎంత 'కిక్' ఉంటుందో!

నలుగురు ఫ్రెండ్స్ కూర్చుని సరదాగా ధ్రువ చైతన్యాన్ని పొందే దశలో ఈ పాటలు వింటే ఆ పార్టీ కొత్తదనాన్ని సంతరించుకోవడం ఖాయం.

మైక్‌టైసన్ లాంటి మహాయోధుణ్ణి కూడా



అరనిమిషంలో చిత్తు చేయడం ఆమె గొంతుకున్న అద్భుతమైన శక్తి అనడంలో సందేహం ఏముంటుంది?

గొంతులో జీర రాకుండా ఉండడానికి పాటలు పాడేముందు గాయకులు మిరియాలు వేసిన పాలు తాగుతుంటారు కదా! మరి ఈమె గంజాయి, బ్రౌన్‌షుగర్ లాంటివేవైనా తీసుకుంటుందా .... లేకపోతే ఆమె పాడిన పాటలు వింటుంటే మనల్ని ఎందుకు అంత మత్తు ఆవహిస్తుంటుంది? అనేది నాకిప్పటికీ ఓ చిలిపి సందేహమే.

నేను పాటల రచయితనయ్యాక నా ఒక్క పాటైనా యల్.ఆర్. ఈశ్వరి పాడితే భలే ఉంటుంది కదా అని అన్పిస్తూంటుంది. ఆ అవకాశం లభిస్తే, ఆవిడతో పాటు రికార్డింగ్ థియేటర్‌లో కూర్చుంటాను. అప్పుడు గమనిస్తాను - ఆవిడ మనల్ని మత్తులో పడేయడానికి ఎలాంటి కసరత్తు చేస్తుందనే అంశాన్ని.

"దేవుడు చేసిన మనుషులు" చిత్రంలో "మసక మసక చీకటిలో మల్లెతోట వెనకాల మాపటేల కలుసుకో" పాట వింటుంటే ఆవిడ మనకి గొప్ప రహస్యాన్ని చెవిలో చెబుతున్నట్టుగానే తోస్తుంది. అంత హస్కీగా ఉంటుంది పల్లవి. ఈ పల్లవి ఎత్తుగడ నాకెంత నచ్చిందంటే - కొన్నివేల సార్లు ఈ పల్లవినే రివైండ్ చేస్తూ విన్నాను.

బుగ్గన మాంచి జరదా కిళ్ళీని పెట్టుకొని అప్పుడు పుట్టిన ఆ 'లాలాజలం'ని నాలుక కిందనున్న నరం మీద నుండి పాస్ అయ్యేలా కొద్ది కొద్దిగా నములుతూంటే ఎలా జివ్వుమంటూ ఉంటుందో అలా ఉంటుంది ఆమె పాట!

సినిమాల్లో కామెడీని పేపర్‌మీద రాయడం ఈజీనే - దాన్ని సెట్లో ఆర్టిస్టుల నుండి రప్పించుకోవడం చాలా కష్టం. ఓ కామెడీ డైలాగ్‌ని ఎక్కడ విరిస్తే 'పంచ్' మిస్సవకుండా ఉంటుంది? అనేది ఆర్టిస్ట్ బాగా అబ్జర్వ్ చేయాల్సివుంటుంది. అలాగే శృంగార గీతాన్ని రాయడం కంటే, ఆ పాటలో రైటర్ ఎలాంటి ఎక్స్‌ప్రెషన్స్ రాశారు అనేది గమనించి పాడడం గాయకులకుండాల్సిన ప్రధాన లక్షణం. ఆ లక్షణం ఉన్న వాళ్ళే చరిత్రలో నిలబడిపోతారు. అలా చరిత్రలో నిలిచే గాయని యల్.ఆర్. ఈశ్వరి. ఆవిడ పాడిన ఏ పాటనైనా తీసుకోండి. రైటర్ రాసిన ఫీలింగ్‌ని ఎక్కడా తొక్కిపట్టినట్టు అనిపించదు. పాట రాసిన రైటర్ కూడా రికార్డయ్యాక తన పాటకి గాయకులు పరిమళాన్ని అద్దినట్టుగా ఫీలవ్వగలగాలి. ఆ లెఖ్ఖన చూస్తే ఈ విషయంలో యల్.ఆర్. ఈశ్వరికి నూటికి నూరు మార్కులూ పడితీరతాయి.

ఈమె గురించి నాకు ఎక్కువగా ఏమీ తెలీదు. ఎందుకంటే ఆమె పాటలు పాడడం మొదలు పెట్టినప్పటికి నేనింకా పుట్టనే లేదు. నాకు ఆమె



పాటలే గుర్తు.... ఆమె కంఠమే జ్ఞాపకం. 'మసక మసక చీకట్లో...' కూడా ఆమె పాటలు మన వెంట మిణుగురుల్లా ఫాలో అవుతుంటాయనేది మాత్రం వాస్తవం! ◆

---

## హాసం పాఠకులకు



16-30 నవంబరు 2002 సంచికలోని 'యువరత్న' సినిమా ఆడియో రివ్యూ చూశాను.

అందులో పేర్కొన్న కొన్ని సందేహాలకు వివరణ ఇవ్వవలసిన బాధ్యత నాకుంది. నిజం చెప్పాలంటే ఒక రకంగా ఆనందంగా ఉంది కూడా! ఎందుకంటే ఒక పదం గానీ, ఒక వాక్యం గానీ రాయడానికి ప్రతి రచయితకి చాలా కారణాలు ఉంటాయి. అవి పంచుకునే అవకాశం లభించటం కూడా బహుఅరుదుగా లభిస్తూ ఉంటుంది రచయితకి. ఈ రూపేణా పాఠకులకు నామనసులోని భావాలు చెప్పుకో గలగటం నా అదృష్టం... 'హాసం' ఎప్పుడూ ఇలాగే నన్ను ప్రేక్షక శ్రోతలకు మరింత దగ్గర చెయ్యాలని కోరుకుంటూ...

మీ
చంద్రబోస్

ఇక వివరణలోకి వెళితే...

**1. 'నీ మాటే.. లోలోతున తీయని యాతన పెంచే యుగళగీతం'**

అబ్బాయి మాట్లాడే మాట అమ్మాయికి యుగళగీతంలా వినబడటం వెనక ఆంతర్యం అర్ధనారీశ్వర తత్వాన్ని ప్రతిధ్వనింపజేయటమే.

**2. 'నీమాటే.. అది నాతిచరామి సంగీతం'**

నాతిచరామి అంటే పెళ్లినాటి ప్రమాణాలలో 'నిన్ను అతిక్రమించి నేను చరించను' అని పెళ్లికొడుకు పెళ్లికూతురికి చేసే వాగ్దానమే కదా. సంగీతం అంటే శృతి, లయ తోకూడుకున్నది. అమ్మాయికి అబ్బాయి చెప్పే 'నిన్ను అతిక్రమించి నేను చరించను'అనే ఆ మాట, శృతి పక్వంగా లయబద్ధంగా వినిపించడంలో తప్పులేదేమో.

**3. 'నీమాటే.. నా రాతను మార్చే చలిగీతం'**

గాతు మర్హంతు గేయం
పాడదగింది గేయం
పాడ బడింది గీతం
రెండూ కూడా రాయబడినవే.

అలా రాయబడిన గీతం నారాతను కూడా మార్చుతుంది అనడం కవి కల్పన మాత్రమే. యిక చలిగీతం అన్నది- తరువాత వచ్చే సంగీతానికి ప్రాస కోసం ప్రయోగించిందే.

# ఎల్.ఆర్.ఈశ్వరి సినీ గీతాలు

## చిత్రం: అమాయకుడు

నంగీతం: బి. శంకర్
రచన: వేణుగోపాల్

ప: పట్నంలో శాలిబండ పేరైనా గోలకొండ (2)
చూపించు చూపునిండా ఫిసల్ ఫిసల్ బండ ॥పట్నంలో॥
చ: వయసు పిల్ల వంటి సొంపు
అది వంగి ఉంటె భలే ఇంపు
హ హ హ అది వంగి ఉంటె భలే ఇంపు
అబ్బ అబ్బ అది ఒంగి ఉంటె భలే ఇంపు
ఓర చూపు వలవేసి
దోర వయసు దోచేసి (2)
గులక రాళ్ల నీటిలోన
సెలయేటి బాటలోన (2)
ఒక్కసారి చూడాలి
సంబరాల చాటుగుండ
ఫిసల్ ఫిసల్ బండ ॥పట్నంలో॥
చేప కనుల చిన్నదోయి
నీ చేతికెతె చిక్కదోయి (2)
అల్లి బిల్లి అయివుందా బల్ల పరుపు అల్ల బండా
అయ్యో అయ్యో అయ్యో బల్ల పరుపు అల్లబండా ఆ...ఆ..
బల్ల పరుపు అల్లబండా ॥పట్నంలో॥

## చిత్రం: దేవుడు చేసిన మనుషులు

నంగీతం: రమేష్ నాయుడు
రచన: ఆరుద్ర

ప: మసక మసక చీకటిలో మల్లెతోట వెనకాల ॥2॥
మాపటేల కలుసుకో.... నీ మనసైనది దొరుకుతుంది
మనసైనది దొరుకుతుంది దొరుకుతుంది
ఓకే, యా
యా యా, యయాయయాయా హో ॥2॥
చ: మా దేశం వచ్చిన వాడా మా బొమ్మలు మెచ్చిన వాడా ॥2॥
తరతరాల అందాల తరగని తొలి చందాల ॥2॥
ఈ భంగిమ నచ్చిందా ఆనందం ఇచ్చిందా అయితే....
॥మసక॥
చ: సోద్యాలు వెతికే వాడా సొగసు చూసి మురిసేవాడా॥2॥
అరచేతికి దొరకాలంటే నలుమూలలు తిరగాల॥2॥
నీ ముందుకు రావాలా నీ సొంతం కావాలా అయితే....
॥మసక॥

## చిత్రం: అమ్మమాట

నంగీతం: రమేష్ నాయుడు
రచన: సి. నారాయణరెడ్డి

ప: మాయదారి సిన్నోడు - మనసే లాగేసిండు -
నా మనసేలాగేసిండు లగ్గమెప్పడురా మాఁవా అంటె
మాగమాసం యెల్లేదాకా మంచిరోజు లేదన్నాడే
ఆగేదెట్టాగా? అందాకా ఏగేదెట్టాగా?
కాఁవమ్మ సెప్పవె! - రాఁవమ్మ సెప్పవే
రత్తమ్మ! సెప్పవే అత్తమ్మ సెప్పవే!
ఆగేదెట్టాగ - అందాకా ఏగేదెట్టాగా ॥మాయదారి॥
చ: సింతసెట్టెక్కి - సిగురులు కోస్తుంటే
సిట్టి సిట్టి గాజూలూ - తాలం యేస్తుంటే ॥2॥
సిగురుల్లో - సిగురుల్లో
సిగురుల్లో మాటేసి కన్నుగీటిండే
జివ్వున పానాలు తోడేసిండే
ఎప్పదురా మాఁవా అంటె
సంకురాతిరి పొయ్యేదాకా
మంచిగడియేలేదన్నాడే
ఆగేదెట్టాగా? అందాకా ఏగేదెట్టాగా?
యెల్లమ్మ సెప్పవే! - మల్లమ్మ సెప్పవే!
పుల్లమ్మ సెప్పవే! -బుల్లెమ్మ సెప్పవే! ॥ఆగే॥
చ: ఊరి సెరువులో - నేనీదులాడుతుంటే
నీటి నురగల్లో - తేలి తేలి పోతుంటే ॥2॥
బుడుంగున - బుడుంగున
బుడుంగున మీదకి తేలిండే - నా
తడికొంగు పట్టుకునిలాగిండే
ఎప్పడురా మాఁవా అంటె
శివరాతిరి యెల్లేదాకా సుబలగ్గం లేదన్నాడే
ఆగేదెట్టాగా? అందాకా ఏగేదెట్టాగా?
పున్నమ్మ సెప్పవే! గున్నమ్మ సెప్పవే!
కన్నమ్మ సెప్పవే! సిన్నమ్మ సెప్పవే! ॥ఆగే॥
చ: కందిసేలల్లో కావలి కాసేసి
సందెకాడ ఒంటరిగా - డొంకదారి నొస్తుంటే ॥2॥
గబుక్కున - గబుక్కున
గబుక్కున - కళ్లు రెండు మూసిండే
రివ్వున వాటేసి నవ్వేసిండే ఏందిరా మాఁవా అంటే
కోడికూసి కూయంగానే తాళికడతానన్నాడే
ఆగేదెట్టాగా యీరాతిరి యేగేదెట్టాగా?
అమ్మమ్మ సెప్పవే! అయ్యమ్మ సెప్పవే!
పెద్దమ్మ సెప్పవే! పిన్నమ్మ సెప్పవే! ॥ఆగే॥ ॥మాయ॥

## చిత్రం: కథానాయిక మొల్ల

నంగీతం: ఎస్.పి.కోదండపాణి

**కన్నడం :** రచన : విజయనరసింహం

నానే చెలువే కన్నడతి నాట్యగీత సంగాతి
చిన్నదనాడు గంధద బీడు ఎల్లిద భువియలి యిదకీడు
కావేరీ కువరి నుడికస్తూరి నాట్య మయూరి-కొండాడు

**మహారాష్ట్ర :** రచన : శ్రీనివాస్

నావ్ గావ్ కాయ్ మణతా అవో మీ మహారాష్ట్రాచి
డోంగర్ గడ్ గడ్ మణతో భూతళీ శౌర్యం వాదేశాచి
జీవన్ శ్రమణ్య నహి కైది కుణాచి
చింత అమా నహి ఏత్ కషాచీ
జీవనాథ్ స్వచ్ఛీ నద్యైవ ఆనందీ రహ్యాచి

**తమిళం :** రచన : అరుళ్ ప్రకాశ్

తమిళ్ తాయిన్ తలై మగళే-
ఇంద తరణి ఎల్లాం పొట్రుంకలై మగళే ॥ నాన్ ॥
అముద మళై పొళియుం యన్ కురళె
అభినయమె కాట్టుం యన్ విరళే
పణ్ణాడు పాడ పాడ వాయి మణక్కుం సెందమిళే ॥నాన్‌తమిళ్॥

**తెలుగు :** రచన : దాశరథి

పొగరుగల పిల్లా ఇది తెలుగు జాతి పిల్లా
లొంగేమాట కల్ల నీకు లొంగే మాట కల్ల
నన్ను ఓడించేవాడు మొనగాడూ
కనరాడూ యికలేడు ॥ పొగరు ॥
రాణీరుద్రమ్మా శౌర్యము నాలో పొంగేను తెలుసుకో
ఆ పలనాటి మాంచాల పౌరుషముంది
గడసరి తనమూ సొగసరి తనమూ
కలగలిపీ నాలోన కనిపించేను- ॥ పొగరు ॥

**ఉరుదు :** రచన : దాశరథి

ప: సాథీహూ తెరి సాథీహూ తేరి బాహోంమె రహ్తాహూ
తాజ తాజా షరాబ్‌హై పీలే మహెకె మహెకె గులాబ్ హై లేలే
సా: ఆజ్ దున్యాకో హమ్ భూలేంగే - అరెహా!
ఆజ్ జన్నత్‌కొహమ్ పాలేంగే-ఛల్ కే ప్యాలా చల్క్
చ: మేరి జుల్ఫోమె ఖోజావో సజనా!
మెరె సీనేమె రహ్ జావో సయ్యా!
ఆజ్ మౌసంహైకిత్నా సుహానా!
ఇష్క్‌మే మస్త్ హై ఆజ్ సారా జమానా!

సీరియల్

9

# (సి)నీతిచంద్రిక



రావి కొండలరావు

నెలరోజులు గడిచాయి. నాపరిస్థితి ఎట్లావుంది చెప్పలేను. నిర్మాతగారు మళ్ళీరాలేదు. రోజూ ఎదురుచూడటమే అవుతోంది. సలహాని అడిగితే 'నాకేం తెలీదు' అంటున్నాడు.ఉత్తరంలేదు, పత్తరంలేదు. ఫలానా రాసిన నాలుగుత్తరాలకీ జవాబులేదు.

"వాడు సినిమా తియ్యటం అంటే ఏమిటో అనుకున్నాడండీ, ఐదారువందల్లో ఐపోతుంది అనుకున్నాడేమో! తీరా చూసేసరికి గుండె గుభేలుమంది. ఆ మాట చెప్పడానికి సిగ్గుపడి, మళ్ళీ వస్తానని వెళ్ళిపోయాడు. గ్యారంటీ గురూ - ఆ గురుడు మరిరాడు! ఇదంతా నా దురదృష్టం!" అన్నాడు ఫలానా ఓ రోజున - గ్లిసరిన్ లేదని, కన్నీళ్ళు పెట్టుకోకుండా!

**జరిగిన కథ**

**ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్ళకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించాక ఊరెళ్లి డబ్బులు తెస్తానని చెప్పి నిర్మాత మాయ మయిపోయాడు...." (ఇక చదవండి)**

విన్నారా! ఆ తర్వాత నా పరిస్థితులు ఎట్లా పరిణమించాయో తర్వాత వివరిస్తాను. ఒక నిక్కచ్చిఐన చిత్రనిర్మాతకూ, తీస్తానని బెదిరించే నిర్మాతకూ గల చిత్రభేదం; కథకూ, చిత్రానికీగల చిత్రభేదం; బెంగాలీకథకూ,మన చిత్రానికీగల భేదం. ఒక చిత్రానికీ, మరో చిత్రానికీ గల భేదం; ఒకరికీ మరొకరికీగల భేదం. సలహాకూ ఫలానాకూ, కవికీ, నిర్మాతకూ; నాకూ, మరొకరికీ గల భేదం - ఇట్లా ఎన్నో భేదాలు ఉన్నాయి. ఈ భేదాల మొత్తమే 'చిత్రభేదము.'

(సి)నీతిచంద్రికలోని 'చిత్రభేదము' మీరు విన్నారు. తర్వాత భాగం రేపు వివరిస్తాను." అని ముగించి, సిగరెట్టు ముట్టించాడు మహాశయుడు.

"బాగా తెలుస్తోంది" అన్నాడు ధనవంత, నిట్టూరుస్తూ.

"కొంత అర్థమయింది" అన్నాడు కుమారరత్నం, లేస్తూ.

"మంచినీళ్ళు" అన్నాడు మహాశయుడు.

"మంచినీళ్ళు-" అని అరిచాడు ధనవంత.

ఆరు, ఏడు చెంబులతో, పలురకాల గ్లాసులతో మంచినీళ్ళు వచ్చాయి - వాటిని ఆనుకుని నౌకర్లూ వచ్చారు. ముగ్గురూ తాగాక కుమారరత్నం బయటకు వెళ్ళాడు. మహాశయుడు 'రేపు వస్తానని' ఇంటికి వెళ్ళాడు. ధనవంతుడు నిద్రపోయాడు. మిగిలిపోయిన మంచినీళ్ళను ఏం చెయ్యాలో తోచక, నౌకర్లంతా అటూ, ఇటూ చూస్తూనించుని, కాస్సేపటకి కాళ్ళులాగగా, కింద చతికిలబడాడరు.

**చిత్రఖేదము:**

ఆ మర్నాడు ధనవంతుడు టిఫనూ, కాఫీ కానిచ్చి, మహాశయుడి కోసం - మహోజ్జ్వల, మహత్తర చిత్రం కోసం ప్రజలు ఎదురు చూసినట్టు - చూడసాగాడు. కుమారరత్నం ఎందుకొచ్చిన తద్దినం అన్నట్టు ఫేన్‌వేసి రాకపోతే బాగుండును అన్నట్టు చూడసాగాడు.

కాస్సేపటికి ధనవంత కళ్ళు కాయలు కాశాయి. మరి కాస్సేపటికి పళ్ళుఅయిపోయి, రాలి పోయాయి. అంచేత మహాశయుడు వచ్చేసరికి అతని కళ్ళు మామూలుగానే ఉన్నాయి.

'లేటా?' అన్నాడు మహాశయ, కాల్‌షీటుకు ఆలస్యంగావచ్చి, మామూలుగా నిత్యంవాడే, హీరోయిన్ మాట వాడుతూ,

'ఎవరు?' అన్నాడు కుమారరత్నం.

'నేనే'

'మీరా - మీరు లేటెందుకయ్యారండీ - బ్రతికే ఉంటేనూ.' అన్నాడు కుమారరత్నం నవ్వేస్తూ. మహాశయుడు నవ్వలేదు. పైగా 'నాయనా - ఈ మధ్య సినిమాలలో హాస్యపు డైలాగులన్నీ నువ్వే రాస్తున్నావులా ఉన్నది' అన్నాడు.

"మాఅబ్బాయి రాయలేదు, సుమండీ - వాడిన్నాళ్ళూ ఇంటి దగ్గరే ఉన్నాడు!" అన్నాడు అమాయకంగా ధనవంత.



"ఆఁ - ఊరికేలెండి!" అని నర్దాడు మహాశయుడు సోఫా మీద వాలుతూ.

"కాఫీ తెప్పించమంటారా?' అన్నాడు రత్నం.

"థాంక్స్ - నో - వద్దు."

"సరే ఐతే, తొందరగా కానీండి - అయ్యాక ఎట్లాగూ తాగాలి తలనొప్పి మాత్రతో" అన్ని విసుక్కున్నాడు కుమారరత్నం.

"నాయనా రత్నం - ఈ మాత్రానికే నీకు విసుగుపుడితే ఎట్లాగయ్యా - రేపొద్దున తారలు కాల్‌షీటుకు రాకపోతే నువ్వు నిరీక్షించాల్సిన నిరీక్షణ ఉందే-"

"అందులో ఆనందం ఉంది."

"నువ్వుండ్రా కుమారరత్నం... వాడితో ఏమిటి మహాశయా - నువ్వు కానీయ్" అని కుమారుడిని మందలించి మహాశయుడిని ఆజ్ఞాపించాడు.

మహాశయుడు ఎత్తుకున్నాడు.

"ఆ విధంగా అయిన నేను, పార్కుబెంచీ చేరి, దాంట్లో ఒక దివ్యభవ్యరమ్య హర్మ్యాన్ని నిర్మించుకొని - అందాలలో వట్టిపాన్పుపై




పవళించి ఎప్పటికైనా నా నాథుడు తిరిగిరాడా అని, మధుర స్వప్నాలు కనసాగాను. నా నాథ్ రాలా. రాడని ఫలానా చెప్పాడు. నాకూ తెలుసు. ఇంక అక్కడినుంచి నేను పడిన బాధలూ, కష్టాలు కలిసి - 'చిత్రఖేదము' అనబడును. ఆ ఘట్టాన్ని వివరిస్తున్నానన్నమాట!

నన్ను ఆ తర్వాత చాలామంది ప్రశ్నలు వేశారు. "అయ్యా - మీ చిత్రం ఎప్పుడు ప్రారంభిస్తారు? తారలెవరు? ఎక్స్‌ట్రాలెవరు? రచన ఎవరు? హాస్యడైలాగులు మీరేనా?" అని ఇట్లా. నేనేమి సమాధానం చెప్పేవాడినికాదు. కొందరు వ్యంగ్యంగా "దర్శకుడుగారు" అని "డైరెక్టర్‌సాబ్!" అని పిలిచేవారు. 'నవ్విన నాపచేను పండదా?' అని పాడుకుని ఊరుకునేవాడిని. నేను ఎట్లా బతికానో నాకే తెలీదు. ఊరువిడిచి, ఏ ఊరేనా పోదా మనుకున్నాను, మరేదైనా ఉద్యోగం చేద్దా మనుకున్నాను. కానీ - 'రాబర్ట్ బ్రూసు' నా బుర్రమీద 'సూపర్ ఇంపోజ్' అయ్యేవాడు, ఒకరోజున బ్రూసును పిలిచి కేకలేశాను కూడా!

"నా తప్పేం ఉంది - సాలీడునడుగు," అన్నాడు బ్రూసు.

నాకు ఎక్కడా శాంతి, సౌఖ్యము కనుపించలేదు. ఎంతసేపూ అసావేరి, శివరంజనీ, ముల్తాన్ రాగాలే వినిపించేవి. ఎక్కడయినా అసిస్టెంటుగా చేరదామనుకున్నాను. అహం అడ్డొచ్చింది.

"ఆగు" అంది అహం-" ఇన్నాళ్ళూ ఇన్నేళ్ళూ ఇంతపేరు మోసి, చివరకు మళ్ళీ సహాయదర్శకుడివై క్లాప్‌బోర్డు పట్టుకుంటావా!"

"మరి నన్నేం చెయ్యమన్నావు? నేనీ జీవితం భరించలేను-నా కడుపుమంట చల్లారేదెట్లా? చల్లారేదెట్లా?"

"హుఁహుఁహుఁ .... అందని పండుకు ఆశించడం అవివేకం. కాని నువ్వు అందే పండుకోసమే ఆశపడుతున్నావు. ఆ పండు అందేటంతవరకూ ఎన్ని కష్టాలు, గాలివానలు, నాదనామక్రియరాగాలూ అడ్డువచ్చినా సరే నువ్వు ఎదుర్కోవాలి. నీలో చిత్రరక్తం ప్రవహించడంలేదా? నీవు చిత్రవ్యక్తివి కావా? చిత్రమాత కడుపున పుట్టిన నీకేల ఈ చిత్రఖేదము?"

"నాకు అడ్డం రాకు - లే - లే" అని వికటాట్టహాసం చేసి, అహాన్ని తన్ని ఒక పెద్ద డైరెక్టరును చూశాను.

"రండి కూచోండి" అని మర్యాద చేశాడతను. "మీ దగ్గర కొంతకాలం సహాయ దర్శకత్వం చెయ్యాలని....' అని గొణిగాను. అంతవరకూ నన్ను మీరు అని మన్నించే ఆ పెద్ద మనిషి - ఈ మాట వినగానే -

"చేస్తావా - చెయ్యి. నేర్చుకో. అసలు ముందు లేచినించో. డైరెక్టర్ల దగ్గర ఎట్లా నించోవాలో నేర్చుకోముందు" అన్నాడు.

"చిత్తం."

"సార్ అనికూడా అను."

"చిత్తం సార్."

"రైట్, యూ ఆర్ మై అసిస్టెంటు. ఐతే, నీకు మూడు నెల్లదాకా జీతం ఉండదు. అప్రెంటీసుచెయ్యి."

"నేను అప్రెంటీసు ఏమిటండీ?"

"ఏమిటండీ అని అడక్కు. నీకు డైరెక్టరుగా అను భవం ఉంది గాని - అసిస్టెంటుగా లేదే! అందుకని అసిస్టెంటుగా అప్రెంటీసు చెయ్యాలి - కొన్నాళ్ళకు అనుభవం తెచ్చుకుంటావు. అప్పుడు నీకు అరవై రూపాయలు జీతం అని చెప్పి - ముప్పయ్యయిదు ఇవి ప్రస్తానం ఏమంటావు?" అని లేచాడు దర్శకుడు.

నేను లేచాను - అంటే నుంచుని వున్న వాడిని బయటకుపోవటానికి.

"ఏం పోతావా - నీ ఇష్టం. అసలు నీవంటి అనుభవం ఉన్న వాడితో చిక్కువుండనే ఉందనుకో! ఏమీ రాని వాడయితే ప్రిఫరెన్సు. ఐతే స్పెషల్ కేసు మీద నిన్ను బుక్ చేయిస్తాను - పద, నిర్మాతతో చెబుతాను. నువ్వు ముందుగా వెళ్ళి - ఆఫీసు దగ్గరుండు. నేను కార్లో వస్తాను" అని కారెక్కిపోయాడు.

కారు నాముందు నుంచే తుర్రుమంది!

**(ఇంకావుంది)**

డిసెంబర్ 14న శైలేంద్ర వర్ధంతి సందర్భంగా...

# హిందీ సినిమా పాట శైలి మార్చిన శైలేంద్ర



గుండెలోతుల్లో దాగిన భావుకతను కదిల్చి గుండెకింది తడిని చెమర్చేంత కవితాశక్తి అతని పాటల్లో ఇమిడి ఉంటుంది. ఇంత గొప్ప కవిత్వం రాసిన ఆయన ఏనాడు సినిమాలకు పాటలు రాస్తానని ఊహించి ఉండలేదు. తన కవితను పదిమంది మెచ్చుకుని ప్రశంసిస్తే చాలు అని తృప్తిపడేవారు.

అది దేశంలో స్వాతంత్ర్య సమరం తీవ్రంగా సాగుతున్న తరుణం. బొంబాయిలో జరిగిన ఒక ముషాయిరాలలో పైలాపచ్చీస్ వయసులో ఉన్న ఆ యువకుడు పాల్గొని చదివిన కవిత ప్రేక్షక శ్రోతల్లో ఉన్న పృథ్వీరాజ్ కపూర్‌ను ఇట్టే ఆకట్టుకుంది. వెంటనే ఆ యువకుడిని తన కొడుకు రాజ్‌కపూర్‌కు పరిచయం చేశాడు. అలా మొదలైన వారి స్నేహం భారతీయ సినీ జగత్తులో ఒక విభిన్న శకానికి నాంది పలికింది. ఆ యువకుడు ఎవరో కాదు, ఆ తరువాత ఒకటిన్నర దశాబ్దానికి పైగా హిందీ సినీగేయకవిగా ఒక వెలుగు వెలిగిన "శైలేంద్ర."

అభ్యుదయాన్ని, ఆవేశాన్ని, శ్రమ జీవన సౌందర్యాన్ని విశ్వసించి, వాటిని జీవితానికి ఆపాదించుకుని తన కవిత్వంలో ప్రతిబింబించిన వాడు ఆయన. 1923లో రావల్పిండిలో జన్మించారాయన. ఆరేళ్ల వయసులో అతని కుటుంబం మధురకు మారింది. విద్యార్థి దశలోనే కవిత్వం రాయడం అబ్బింది ఆయనకు. వాటిని చూసిన కాలేజీ ప్రిన్స్‌పాల్ ప్రశంసలందుకున్నాడు. చదువులోనూ ముందుండి స్కాలర్‌షిప్‌లు పొందాడు. కుటుంబ ఆర్థిక కారణాల వల్ల కాలేజీని మధ్యలోనే విడిచి ఉద్యోగాల వేటలో పడ్డాడు. ఝూన్సీ, బొంబాయి రైల్వే వర్క్‌షాపుల్లో మెకానిక్‌గా చేరడంలో పనికి అతనిచ్చే గౌరవం ఎంతటిదో అర్థమవుతుంది.

శైలేంద్ర జీవితంలో పేదరికాన్ని అనుభవించిన వాడవటంవల్ల వామపక్ష భావాలను అభిమానించడంలో మనం ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. ఇండియన్ పీపుల్స్ థియేటర్ ఆర్ట్స్ (ఇప్టా)లో చేరారు. 1946 ప్రాంతంలో ఒక మామూలు ఉద్యోగం చేస్తూ బల్‌రాజ్ సహానీ, దుర్గాఖోటే, చేతన్ ఆనంద్ వంటి వారితో కలిసి ఇప్టాలో తనదైన భూమికను నిర్వహించారు. మంచి కవిత్వం రాయడంలో ఎంత సిద్ధహస్తుడో అంత గొప్పగా వేదికపై ఆ కవిత్వాన్ని పాడే వారాయన. ఐక్య పంజాబ్ నేపథ్యంలో రాసిన 'జల్తాహై పంజాబ్' కవిత ఆ రోజుల్లో ఎందరి చేతనో ప్రసంశ లందుకున్నది.

శైలేంద్ర, రాజ్‌కపూర్‌లు మంచి స్నేహితులే అయినా సినిమాలన్నా, వాటికి రాయాలన్నా శైలేంద్ర ఏమాత్రం ఇష్టపడే వాడు కాదు. వ్యాపార ప్రపంచం నాకు నచ్చదనేవాడు. శైలేంద్ర రాసిన కవితలను ,పాటలను తన సినిమాల కిమ్మని రాజ్ చాలాసార్లు అడిగాడు. కానీ ఆయన ఒప్పుకోలేదు. భారీమొత్తంలో డబ్బు ఇవ్వజూపినా తలవంచలేదు. తన తొలిచిత్రం "ఆగ్"(1948) లోనే రాయమన్నాడు. కాదన్నాడు శైలేంద్ర. 1949లో తీసిన "బర్సాత్"లో మరోకొత్త కవి హస్రత్‌జైపూర్‌ని 'కవి'గా పరిచయం చేసిన రాజ్ ఇదే చిత్రంలో మిగిలిపోయిన రెండు పాటలను పట్టుబట్టి శైలేంద్రతో రాయించారు.

అలా మొదలైన తన సినీ జీవితంలో శైలేంద్ర ఎప్పుడు మళ్ళీ వెనక్కి తిరిగి చూసు కోలేదు.ఆర్.కె.సంస్థలోని సంగీత దర్శకులు శంకర్ - జైకిషన్, హస్రత్ జైపూరీ, గాయకుడు ముఖేష్‌ల టీమ్‌లో అయిదవవాడుగా కలిసిన శైలేంద్ర రాజ్‌కపూర్ సినీ జీవనానికి పంచ ప్రాణాల్లో ఒకడుగా ఇమిడిపోయారు. శైలేంద్ర గురించి హస్రత్ జైపూరీ ఒకసారి చెబుతూ "అప్పటికి ఆయన రైల్వే ఉద్యోగం మానేసి సినిమా ఫీల్డులోకి రావాలనుకోలేదు. నేనూ అప్పటికి బస్ కండెక్టర్‌గా పదకొండేళ్ళుగా ఉద్యోగం చేస్తున్నాను. మేమిద్దరమూ కార్మికులమే. శైలేంద్ర బలమంతా అతని హిందీ భాషలోనే ఉంది. ఉర్దూ నా కంచుకోట. మా ఇద్దరికీ రాజ్‌కపూర్ నెలకి మూడువందలు, శంకర్ జైకిషన్‌లకు అయిదు వందలు ఇచ్చేవాడు. అయితే మాకు బయటి చిత్రాలకు పనిచేసే స్వేచ్ఛ ఉండేది. అప్పుడే మేం నలుగురం ఎట్టి పరిస్థితుల్లోనూ విడిపోకూడదని ప్రమాణం చేసుకున్నాం. అలా మా విజయయాత్ర మొదలయింది" అన్నాడు.

శైలేంద్ర భోజ్‌పూరీ 'లయ'ను హిందీ సినిమాకు పరిచయం చేశాడు. చిన్న చిన్న వాక్యాలతో, సరళమైన భాషతో ఉదాత్తమైన భావాలకు తన కవిత్వంలో వ్యక్తీకరించడం ఆయనలోని ప్రత్యేకత. తన పాటలతో తనకు మాత్రమే గాక ఆయా సంగీతదర్శకులకు కూడా పేరు తెచ్చిపెట్టిన కవి శైలేంద్ర. రాజ్‌కపూర్ బయటి చిత్రాలకు కూడా కవిగా పనిచేశాడాయన. శంకర్ జైకిషన్‌లకే కాక సలిల్ చౌధురి, ఆర్డీబర్మన్, రోషన్ వంటి సంగీత దర్శకులకు కూడా పాటలు రాశారు. అయినా శంకర్ జైకిషన్‌లకు రాసిన పాటలే శైలేంద్రకు గొప్ప పేరు తెచ్చి పెట్టాయి.

బిమల్‌రాయ్ తీసిన "పరఖ్" చిత్రానికి మాటలు రాయడమే కాదు, మరి కొన్ని చిత్రాల్లో అతిథి పాత్రల్లో కూడా శైలేంద్ర కనిపించారు. తన మిత్రుడు రాజ్‌కపూర్ నిర్మాతగా సాధిస్తున్న విజయాలను చూసి ప్రభావితుడై తానూ సినిమా తీయడానికి పూనుకున్నారు. అదే, అతని జీవితాన్ని కృంగదీసింది. ఫణీశ్వర నాథ్ రాసిన 'మారేగయే గుల్ఫామ్' కథ ఆధారంగా బాసూ భట్టాచార్య దర్శకత్వంలో "తీస్రీకసమ్' సినిమా నిర్మించారు. హీరో రాజ్‌కపూర్, హీరోయిన్‌గా వహీదా రెహమాన్ నటించారు. సినిమా నిర్మాణానికే మూడేళ్ళు పట్టింది. తోడుంటామని వచ్చిన బంధువులే అతణ్ణి మోసం చేసి ఆర్థికంగా చితికేందుకు కారణమైనారు. వ్యాపారం తెలియని ఆయన జరిగిన మోసాన్ని గుర్తించే సరికి అంతా చేజారిపోయింది. సినిమా విడుదలవుతుందో లేదో తెలీని పరిస్థితి. చివరకి ఆయన మనశ్శాంతి కోసం మదిరకు చేరువై పోయారు. ఆ వ్యసనమే అతని ఆరోగ్యాన్ని పీల్చి పిప్పిచేసింది.

ఆ రోజు శైలేంద్ర పరిస్థితి ఏమీ బావో లేదు.సాయంత్రంకల్లా భార్యాపిల్లలు (ముగ్గురు కొడుకులు ఇద్దరు కుమార్తెలు) మరణశయ్యపై ఉన్న



అతని చుట్టూ చేరిపోయారు. చీకటి పడింది. అదే నగరంలోని చెంబూర్‌లో రాజ్‌కపూర్ త్వరలోవచ్చే పుట్టినరోజు కై సన్నాహాలు చేసుకుంటున్నారు. భారీ ఎత్తున విందు ఏర్పాటు చెయ్యాలని అక్కడి పనివారికి సూచనలిస్తున్నాడు. ఇక్కడ తాను సినీకవిగా మలచిన శైలేంద్ర జీవితపు అంతిమ ఘడియల్లో ఉన్నాడు. ఆ రాత్రి అంతా శైలేంద్రకు మరణవేదనతో తెల్లారింది. పరిస్థితి పూర్తిగా విషమించింది. మధ్యాహ్నంకంతా ఆయన అంతిమ శ్వాస విడిచారు. ఆ రోజు 14 డిసెంబర్ 1966.

“చార్ ఆంసూ కోయీ రో దియా/ ఫేర్ కె ముహ్ కోయీ చల్ దియా/ ఏ మెరె దిల్ కహీ ఔర్ చల్/ గమ్ కీ దునియా సే దిల్‌భర్ గయా/ ఢూండేలే అబ్ కోయీ ఘర్ నయా” అని ఆయనే ఓ సందర్భంలో రాసుకున్న కవితను ఈ సందర్భంగా అనుకోకతప్పదు.

ఆయన చివరిసారిగా రాజ్ ‘మేరానామ్ జోకర్’ చిత్రానికి రాసిన “జీనా యహా మర్‌నా యహా ఇస్‌కే సివా జానా కహా” పాటలోని జీవన సత్యం ఇప్పటికీ మనలను వెంటాడుతుంది. తన ‘తీస్రీకసమ్’ కోసం రాసిన “సజన్ రే ఝూట్ మత్ బోలో ఖుదాకే పాస్ జానాహై” పాటతో మనిషి ఎలా బతకాలో చెప్పిన శైలేంద్ర తనవాళ్ళు అనుకున్నవారే వంచించి మోసం చేయగా “దునియా వాలోంసే దూర్ జల్‌నే వాలోంసే దూర్ ఆజా ఆజా చల కహీ దూర్ కహీ దూర్” అంటూ వెళ్ళిపోయారు. ఆ తరువాత శంకర్ జైకిషన్, ముఖేష్, రాజ్, హస్రత్ జైపూరీ కూడా వెళ్ళిపోయారు. ఒక శకం ముగిసింది. తన లలితమైన పదాలతో, సొబగులతో సరికొత్తశైలిని హిందీ సినిమా పాటకు ఒనగూర్చిన శైలేంద్ర అభిరుచిగల సినీ సం‘గీత’ అభిమానులకు మరుపురారు.

**-హెచ్.రమేష్‌బాబు.**

---

**డిసెంబరు 7 శేఖర్ సుమన్ జన్మదిన సందర్భంగా....**

## ‘షోమన్’ ఆఫ్ ది టీవీ
# శేఖర్ సుమన్



‘దేఖ్ భాయ్ దేఖ్’, ‘మూవర్స్ అండ్ షేకర్స్’ అతని సూపర్ హిట్స్.

S వాక్చాతుర్యంతో ప్రేక్షకులను ‘ఇడియట్ బాక్స్’కు కట్టి పడేసేయగల శక్తి ఉన్న అతికొద్ది మందిలో శేఖర్ సుమన్ పేరు ముందు చెప్పుకోగలగాలి.

S సినిమా తెరకంటే బుల్లితెరయే తనకు తగినదని గుర్తించడంలోనే ఉంది అతని విజయానికి కీలకం.

S సమయానికి తగుమాట లాడగలగడం, మిమిక్రీ చేయగలగడం, పండిత పామరుల నందరినీ మెప్పించగల రేంజి, పెర్‌ఫెక్ట్ టైమింగ్ - ఇవన్నీ అతన్ని చాలాకాలంగా ‘టాప్ స్లాట్’లో నిలబెట్టాయి.

S లల్లూప్రసాద్‌ను అంత బ్రహ్మాండంగా ఇమిటేట్ చేయగలగడానికి తన కున్న ప్రధాన అర్హత తనూ బిహారీయే అని చెప్పుకునే శేఖర్ సుమన్‌కీ, లల్లూకీ కుటుంబ నేపథ్యంలో చాలా వ్యత్యాసం ఉంది. అతని తాతగారు బిహార్ అడ్వకేట్ జనరల్. తండ్రి హెల్త్ సర్వీసెస్ డైరక్టరు జనరల్.

S నటన అతని కుటుంబంలో లేకపోయినా చిన్నప్పటినుండి సినిమాలు చూసి నటనవైపు మొగ్గాడతను. “ఉత్సవ్”లో హీరో చారుదత్తుడుగా రేఖ సరసన నటించే అదృష్టం కలిగింది. ఆ సినిమాలో అతను వేసిన బ్రహ్మణ పాత్రకు, ఇప్పుడు టి.వి.లో కనపడే అవతారానికి అస్సలు పోలిక ఉండదు.

S ‘ఉత్సవ్’ ఫెయిలయినా, 25-30 సినిమాలలో వేషాలు వచ్చాయి. 4,5 తప్ప తక్కినవన్నీ వేస్ట్. హారర్ సినిమాలు తీసే రామ్సే బ్రదర్స్ వాళ్ళు తమ సినిమాలలో నటించమని ఆఫర్ ఈయడంతో అతనికి అర్థమయి పోయింది-సినిమాలలో అట్టడుగు స్థాయికి దిగజారి పోయానని. అది ఒప్పుకోవడం కంటే మానేసిఇంట్లో కూచోవడం మేలనుకున్నాడు.



S అతని భార్య అల్కా డ్రెస్ డిజైనర్. ఆమె బిజినెస్ కూడా దెబ్బతింది. కొడుకు ఆయుష్ ఓ దీర్ఘవ్యాధి బారినపడ్డాడు. చికిత్సకు డబ్బులేదు. ఇలా మూడేళ్లు గడిచాయి. కళ్లెదుటే కొడుకు క్షీణించిపోతున్నాడు.

S ఓ రోజు కోయదొర వచ్చాడు. అతని కుర్చీలో బాసింపట్టు వేసుకుని కూచుని ఓ సిగిరెట్టు దమ్ములాగి శేఖర్ మొహంకేసి తీక్షణంగా చూసి రెండే మాటలన్నాడు -‘టీవీ సూపర్‌స్టార్,’ ‘ఇంటర్నేషనల్ స్టార్’. ‘సినిమాల్లో స్టార్ అవుదామనుకుంటే వీడు టీవీస్టార్ అంటాడేమిటి?’ అని విసుక్కుని శేఖర్ అతని మాటలు పట్టించుకోలేదు. రెణ్నెళ్ల గడిచింది. జయాబచ్చన్ ‘దేఖ్ భాయ్ దేఖ్’ తీస్తూ శేఖర్‌కు కబురుపెట్టింది!

S ఆ టీవీ సీరియల్ నిర్మాణంలోనే శేఖర్‌కు తన గ్రేటెస్ట్ ఎసెట్ -‘పెర్‌ఫెక్ట్ టైమింగ్’ తెలిసివచ్చింది. సిట్‌కామ్‌లలో అతని స్థానం పదిలం అయింది. ఇక అక్కణ్నుంచి అతను వెనక్కిచూసుకోలేదు. ‘రిపోర్టర్’, ‘అందాజ్’, ‘అమర్‌ప్రేమ’,...ఇలా ఎన్నో సీరియల్స్.

S ‘మూవర్స్ అండ్ షేకర్స్’ షో ప్రారంభమయిన తర్వాత ఇక అతనికి ఎదురే లేకపోయింది. జేలెనో షోలోని సెట్స్ మోడల్లోనే ఈ షో సెట్స్ కూడా డిజైన్ చేయడం వల్ల అతన్ని కాపీ చేస్తున్నాడని అనుకున్నారు కానీ శేఖర్ జోక్స్, స్టయిలూ అతనివే!

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

# ఎక్కడి దొంగలు అక్కడనే గప్-చుప్...

**- రాజా**

**ఓ రూమ్‌లో గిరిబాబు,రంగారావు అద్దెకి ఉంటారు.**

**రంగారావు కుర్చీలో కూర్చొని ఉన్నాడు. కళ్ళు అటూ ఇటూ తిరుగుతున్నాయి. కారణం - ఎదురుగా గిరిబాబు అటూ ఇటూ పచార్లు చెయ్యడం.**

**కనుగుడ్లు పదిసార్లు అటూ ఇటూ, ఇటూ అటూ తిప్పి అలసిపోయిన తర్వాత**

రంగా: ఆ నడకకి కొంచెం గ్యాప్ ఇవ్వరాదా గిరిబాబు గారూ?

గిరి : కుదరదండీ

రంగా: అలా ఆగకుండా నడవమని ఎవరైనా డాక్టర్లు సలహా ఇచ్చారా?

గిరి : డాక్టర్లు కాదండీ పోలీసులు, పోలీసులు ఇచ్చారు సలహా.

రంగా: పోలీసులా .... ఏంటి మా పోలీసులే!! శభాష్ ... ప్రజలను దొంగలబారి నుండి కాకుండా రోగాలబారి నుండి కాపాడు తున్నారన్న మాట మావాళ్ళు.

గిరి : ఆ ... మా వాళ్ళు!? అనవసరంగా పొంగిపోకండి సార్ .... దెబ్బతినగలరు.

రంగా: దెబ్బలు కొట్టడమేగాని తినడం అలవాట్లేదండీ మాకు - గిరిబాబు గారు.

గిరి : ఆ సంగతి మాకింకా బాగా తెలుసండీ .... రంగారావు గారూ నే చెప్పున్నదీ అదే ....

రంగా: ఏంటండీ అంత వెటకారంగా అంటున్నారు-మావాళ్ళమీద మీకెందుకలాంటి ఒపీనియన్ వచ్చిందీ?

రంగా: ఎక్కడో ఒకటిరెండు కేసులు చూసేసి మొత్తం అందరి మీదా అదే ఇంప్రెషన్ తెచ్చుకుంటే ఎలాగండీ?

గిరి: మొన్నటివరకూ నేనూ అదే ఆదర్శం మీద ఉండే వాణ్ణి సార్ .... కానీ పర్సనల్‌గా దెబ్బతిన్నాక ఇలా ఫీలయిపోక తప్పటం లేదు.

రంగా: ఏమయిందండీ అసలూ?

గిరి : ప్రతిచిన్న విషయానికి పట్టేసుకోవడమే. ఓ సారి సిగ్నల్ పడిపోయిందంటారు, ఇంకోసారి వన్‌వే అంటారు, మరోసారి నో పార్కింగ్ అంటారు. ఇలా ఈ ఒక్క వారంలో నేను పెనాల్టీగా ఎంత కట్టేనో తెలుసా .... మూడువందలు .... మూడువందల్సార్ .... మూడువందలు. ఈలెక్కన నెలకి మొత్తం ఎంతవుతుందో తెలుసా.

రంగా: పన్నెండువందలు.

గిరి : ఏంట్సార్ జోక్ చేస్తున్నారా?

రంగా: ఇందులో జోకేం ఉందండీ .... మీరు లెక్క అడిగారు కనుక చెప్పాను. ఒక్కమాట చెప్పండి తప్పు మీసైడు లేదా.

గిరి: ఆ .... ఆ .... రోజుకో రూలు, గంటకో రూలు, ఎప్పుడు వన్‌వే పెట్టేస్తారో, ఎక్కడ నో పార్కింగ్ పెట్టేస్తారో తెలీక ఛస్తుంటే తప్పునాదెలా అవుతుందండీ?

రంగా: గిరిబాబు గారూ చదువుకున్నవారు మీరే అంటే ఎలా. పోనీ, నేను గత నాలుగు నెలలుగా మీ రూంమేట్‌ని కదా పట్టుకున్న వాళ్ళకి కనీసం నా పేరైనా చెప్పలేక పోయారా.

గిరి : నాకలాంటి ఇన్‌ఫ్లూయెన్స్‌లు వాడడం ఇష్టం ఉండదండీ, ఈ ఫైన్‌లు కట్టిన మూడ్‌లో ఈ వారంలోనే మా ఆఫీసులో బోల్డు తప్పులు చేసేశాను. దానికి తోడు మా ఆఫీసరొకడు ఆవులిస్తే పేగులెక్క పెట్టేరకం. ఆ మధ్య మా కొలీగ్ ప్రేమ వ్యవహారంలో పడి కొంచెం మైండ్ అబ్సెంట్ అయి మా ఆఫీసరుకి దొరికిపోయాను. అప్పుడతన్ని పట్టుకొని మా ఆఫీసరు ఎంతనైస్‌గా చివాట్లేశాడో తెలుసా. తల్చుకుంటే ఇప్పటికీ వస్తోందండీ నాకు వెన్నులోంచి జలదరింపు. అసలే మా ఆఫీసులో జీతాలు అంతంత మాత్రం. ఫైన్‌లకే సగం పోతే ఇంక తిండేంతింటాం నా పిండాకూడు?

రంగా: పోనీ, ఈ ఫైన్‌ల బాధ అదీ లేకుండా మీ స్కూటర్ నంబర్ మా పోలీస్ స్టేషన్‌లో ఇచ్చేయ్యమంటారా నన్ను?

గిరి: చెప్పేను కదండీ నాకు ఈ టైపు ఇన్‌ఫ్లూయెన్స్‌లు నచ్చవని. అదీగాక నేను వాడుతున్న స్కూటరు నాదనుకొన్నారా?

రంగా: మరి?

గిరి : మా ఆఫీసువాళ్ళది. వాళ్ళకి ఓ పది స్కూటర్లు ఉన్నాయి. మా ఎక్జిక్యూటివ్స్ ఎప్పుడు ఏది దొరికితే అప్పుడు అది పటుకెళ్తాం.

రంగా: సరే ఇప్పుడేం చేద్దాం అనుకుంటున్నారు?

గిరి : మా గురువొకరున్నారు. అద్భుతమైన బ్రెయిను. ఆయన సలహా తీసుకుంటా.

రంగ : ఆయన పేరు?

గిరి : సారీ ఆయన పర్మిషను లేకుండా ఆయన గురించి ఎక్కడా చెప్పకూడదు.

రంగా: ఆయన పేరు చెప్పకపోతే పోయారు కనీసం ఆయన చేసిన ఘనకార్యాలేవైనా ఉన్నాయా వినడానికి.

గిరి : వదులెండి, ఇప్పటికే నోరుజారి ఆయన ప్రస్తావన తెచ్చేను మీ దగ్గర.

రంగా: ఒకసారి జారింతర్వాత ఎన్నిసార్లు జారినా ఒకటేనండి... మర్డర్‌కి వేసే శిక్షలాగ.

గిరి : సారీ అన్నానుగా.

రంగా: సరే .... నే డ్యూటీకి వెళ్తున్నాను రేపు ఉదయం కలుస్తాను.



రంగారావు వెళ్ళి పోతారు. అతడు వెళ్ళాడని నిర్ధారించుకున్నాక గిరిబాబు ఫోన్ డయల్ చేస్తాడు.

గిరి : హలో .... హలో

ఫోన్ : ఎవరూ

గిరి : నేనే గురూ గిరిబాబుని

ఫోన్ : గిరిబాబంటే ఎలా అర్థం అవుతుంది .... అదేమన్నా గాంధీ, నెహ్రూ అంతా ఫేమస్ పేరా వినగానే గుర్తు పట్టేయ్యడానికి ....?

గిరి : సారీ గురూ .... నీకు మతిమరుపు అన్న సంగతి మరచిపోయాను.

ఫోన్ : పోన్లే ఇప్పటికైనా ఆ సంగతి నీకు గుర్తొచ్చింది. ఇంతకీ నువ్వెవరో చెప్పు.

గిరి : నీ దగ్గిర సలహాలు అవీ తీసుకుంటూ ఉంటాను ఆ గిరిబాబుని గురూ.

ఫోన్ : ఇంకా గుర్తు రాలేదు గాని ఎందుకు ఫోన్ చేశావు? సలహా ఏదైనా కావాలా.

గిరి : అవును గురూ .... ఈమధ్య నాకు పోలీసుల బెడద ఎక్కువయిపోయింది. ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు నా స్కూటరు పట్టేసుకుంటున్నారు. ఫైన్‌లు కట్టడానికే సగం జీతం అయిపోతోంది గురూ.

ఫోన్ : సరే .... సలహా విను. నీ స్కూటర్ మీద పి.ఆర్.ఇ.ఎస్.ఎస్. - ప్రెస్ అనే అక్షరాన్ని మంచి పెయింటర్నొకణ్ణి చూసుకొని రాయించేసేయ్. ఇక నీ స్కూటర్‌ని ఏ పోలీసూ పట్టుకోడు.

గిరి : అదెలా .... నేను జర్నలిస్ట్‌ని కాదే! ఏ పేపర్‌కీ ఏదీ రాయను కదా....?

ఫోన్ : నిన్ను ప్రెస్ అని రాయించమన్నాను గానీ, ప్రెస్ అని చెప్పమన లేదుగా. అంచేత అలా చెయ్. అసలు ప్రెస్ అని రాసి ఉంటేచాలు. ఎవరూ పట్టుకొని అడిగేంత వరకు రాదు.అసలు పట్టుకోవడమే జరగదప్పుడు. ఇంకాఅడగటం ఎక్కడుంటుంది? ఎందుకైనా మంచిది తప్పకుండా హెల్మెట్ పెట్టుకుంటూ ఉండు.

గిరి : ఓ.కే. గురూ, థాంక్యూ .... థ్యాంక్యూ సోమచ్.... ఇంతకీ మీ ఫీజు ....

ఫోన్ సగం జీతం ఫైన్‌లకే పోయిందన్నావు కదూ.

గిరి : అవును గురూ, కష్టాల్లో ఉన్నాను కన్సెషనిప్పిస్తే

ఫోన్ : పిచ్చివాడా అలాంటి ఆశలేం పెట్టుకోకు గానీ మిగిలిన జీతం తీసుకొచ్చి నా ఫీజుగా కట్టేసేయ్.

గిరి ఫోన్ పడేసి ఢామ్మని పడిపోతాడు.

***

గిరిబాబు ముఖం మీద నీళ్ళు చిలకరిస్తూ



ఉంటాడు రంగారావు.

రంగా: గిరిబాబు గారు, గిరిబాబు గారూ....

గిరి : ఊఁ ....

రంగా : ఏంటిలా పడిపోయారు?

గిరి: అహ .... ఏం లేదు. రాత్రి మా గురువుతో మాట్లాడాను. ఆయన ఇచ్చిన అయిడియాకి ఇదిగో ఇలా ఢామ్మని పడిపోయానంతే

రంగా: అబ్బా! అయితే గొప్ప అయిడియాయే అయివుంటుంది. ఇంతకీ ఏమిటో అది?

గిరి: హమ్మో నేన్చెప్పను, చెప్పనుగాక చెప్పను.

రంగా: మీ గురువు పేరు చెప్పరు. కనీసం ఇచ్చిన అయిడియా అయినా చెప్పొచ్చుగా?

గిరి: చెప్పొచ్చు .... ఇంకోళ్ళకి ఇంకోళ్ళకి అయితే చెప్పొచ్చు. కానీ నా బాధంతా పోలీసులతోనే కాబట్టి, మీరూ పోలీసే, కాబట్టి చెప్పనుకాక చెప్పను.

రంగా: సరే .... నా పోలీసు బుద్ధి ఉపయోగించి మీ గురువు మీకేం చెప్పాడో కను క్కుంటాను.

గిరి: ఇంపాసిబుల్ .... మా గురువుకి మతిమరుపు ఎక్కువ. అంచేత ఏ అయిడియా ఎప్పుడు ఎవరికి ఎలా ఎందుకు ఇచ్చాడో అస్సలు గుర్తుండిచావదు.

రంగా: సరే .... ఆయన ఆచూకీయే తీస్తా.

గిరి: మీవల్ల కాదు. ఆయనకి నా పేరు చెప్పినా గుర్తుకు రాదు. అంచేత ఆయనే నా గురువని ప్రూవ్ చెయ్యలేరు.

రంగా: చూద్దామా?

గిరి: తప్పకుండా చూద్దాం .... వస్తా.

రంగా: ఎక్కడికి?

గిరి: మా గురువిచ్చిన ప్లాన్ అమలు చెయ్యటానికి.

గిరిబాబు వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళాడని నిర్ధారించు కున్నాక రంగారావు తలుపు గడియ వేసేసి

రంగా: గిరిబాబూ....ఓ నంగిరిబాబు... ఎంత పిచ్చాడివయ్యా .... పోలీసోళ్ళని ఎంత తక్కువ అంచనా వేశావు? మీ గురువు ఆచూకీ కనుక్కో లేననుకున్నావు కదూ? హాహాహా (నవ్వు) నిన్న రాత్రి మీ గురువుతో ఈ ఫోన్లో మాట్లాడి అదిగో ఇలా ఢామ్మని పడిపోయావు. నేనొచ్చి లేపే వరకు రిసీవరు నీ చేతిలోనే ఉంది. అంటే రాత్రి నుంచి నీకు ఏ కాలూ రాలేదు. నువ్వే కాలూ చెయ్యలేదు. అంటే మీ గురువుగారి నంబరు ఇంకా మెమరీలోనే ఉందన్నమాట. జేమ్స్‌బాండ్ మ్యూజిక్ హమ్ చేస్తూ రీడయల్ నొక్కుతాడు. మోగింది .... ఫోన్ మోగింది.... ప్లాన్ సక్సెస్.

ఫోన్ : హలో
రంగా: హలో,ఎవరండీ మాట్లాడుతూంట?
ఫోన్ : ఫోన్ చేసింది నువ్వయ్యా .... నువ్వెవరో చెప్పకుండా నేనెవరని అడుగుతావేంటి?
రంగా: సారీ, సార్. నేను పోలీసుని ....
ఫోన్ : అయితే ఏంటి? వచ్చి అరెస్ట్ చేస్తావా? అరెస్టువారెంటు ఉందా?
రంగా: అబ్బెబ్బే అలాంటిదేంలేద్సార్ .... నాకు మీ సలహా కావాలి అందుకే ఫోన్ చేశా.
ఫోన్: సలహా ఇవ్వడానికి ఏ అభ్యంతరం లేదు. కాకపోతే ఫీజిచ్చుకోవాలి - మీరు పోలీసైనా సరే.
రంగా: అలాంటి మొహమాటాలేం లేవు సార్ .... మీరు హ్యాపీగా ఫీజు అడగొచ్చు. ఇంతకీ మీరు గిరిబాబుకి సలహా ఇచ్చే గురువుగారే కదూ.
ఫోన్: పేర్లు గుర్తుండి చావవు మనకి.
రంగా: అయితే మీరు ఖచ్చితంగా గిరిబాబు గురువే సార్ .... నా పేరు రంగారావండి.
ఫోన్: ఇది కూడా గుర్తుండిచావదు. అంచేత అనవసరం. ప్రాబ్లెమ్ చెప్పండి.
రంగా: ఓన్లీ ప్రాబ్లెమే చెప్పనా .... నా స్టోరీ మొత్తం చెప్పనా ....
ఫోన్: అది మీ ఇష్టం .... ఇక్కడ మీకు సంబంధించిన మీటరు ఆటో మీటర్‌లా తిరుగుతూ ఉంటుంది. ఆ ప్రకారం ఇచ్చుకోవాలి ఫీజు.
రంగా: పర్వాలేద్సార్ .... నేనిస్తా, ముందు స్టోరీ వినండి సార్. మా ఊళ్ళో ఓ ఫ్యామిలీ ఉందిసార్. చూడ్డానికి గొప్పోళ్ళలాగా కనిపిస్తారు. కానీ ఇంట్లో అందరూ దొంగలే. ఆ ఫ్యామిలీని నేను పట్టుకున్నాను. అందుకని ప్రమోషన్ ఇచ్చి ఈ ఊరు ట్రాన్స్ఫర్ చేశారు.
ఫోన్ : మంచిదేగా.
రంగా: నేను అలాగే అనుకున్నాను. పెద్ద ఊరు, స్టూడియోలు, సినిమాలు అంటూ పరుగెత్తుకుంటూ వచ్చాను. కానీ మాటిమాటికి, ప్రతిదానికీ ఎందుకో కొట్టుకుంటారిక్కడ? అదే అర్థం కాలేదు నాకు. మిగిలిన సిటీస్‌లో లాగా హ్యాపీగా డ్యూటీ చేసుకుందాం అంటే కుదరదిక్కడ. ప్రతి నిమిషము టెన్షను. ఎక్కడ అల్లర్లు చెలరేగుతాయో, ఎప్పుడు కర్ఫ్యూ పెడతారో, ఎక్కడ ఏ బాంబు ఏ క్షణాన పేలుతుందో .... టెన్షనే .... టెన్షను. భార్యాబిడ్డల్ని తీసుకొద్దామంటే భయం. పోనీ వాళ్ళని వదిలి వుందామంటే బెంగ! ట్రాన్స్ఫర్ కోసం ఎన్ని రిక్వెస్ట్‌లు పెట్టుకొన్నా అసలు చూడటం లేదు. మా ఊళ్ళో టింగురంగడిలా ఉండేవాణ్ణి. ఈ ఊళ్ళో షూటింగులూ అవీ చూసి 'షూటింగు రంగడు' అనే పేరు తెచ్చుకుందాం అనుకున్నా. కానీ ఎవర్ని షూట్ చెయ్యాలా అని అనుక్షణం టెన్షన్‌తో తుపాకీ పట్టుకునే షూటింగ్ రంగడిలా తయారయ్యాన్సార్ .... టోటల్‌గా ఇదీ పరిస్థితి
ఫోన్ : సో, నీకు ట్రాన్స్ఫర్ కావాలి.
రంగా: అవున్సార్.
ఫోన్: ప్రమోషన్ కాన్సిల్ అయినా ఫరవాలేదా.
రంగా: రివర్షన్ ఇచ్చినా ఫరవాలేదు. ఈ ఊర్నించి ట్రాన్స్ఫర్ అయితే చాలు.
ఫోన్: అయితే ఓ జర్నలిస్టుని పట్టుకొని చితక్కొట్టు ట్రాన్స్ఫర్ అయిపోతుంది.
రంగా: కారణం ఏదైతే బావుంటుందంటారు.
ఫోన్ : కొట్టడానికి లాఠీ ఉంటే చాలయ్యా కారణాలు ఎందుకు?
రంగా: అంతేనంటారా.
ఫోన్ : అంతే ఈ సలహాకు ఓ నెల జీతం ఫీజుగా ఇచ్చుకోవాలి నాకు.
రంగా: తప్పకుండా ఇస్తాన్సార్ .... కొట్టేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలు ఏవైనా ఉన్నాయా?
ఫోన్ : ఉన్నాయి. ఎందుకైనా మంచిది .... గుర్తుపట్టకుండా మఫ్లర్ లాంటిది ముఖానికి అడ్డుగా కట్టుకో.
రంగా : ఎందుకు సార్.
ఫోన్ : ట్రాన్స్ఫర్ యాక్షన్ తీసుకోదల్చుకుంటే ఆ టైమ్‌కి డ్యూటీలో ఎవరున్నారో మీ వాళ్ళు ఈజీగా నీ గురించి కనుక్కోగలరు. ఈలోగా జర్నలిస్ట్‌లు గుర్తుపట్టి నిన్ను తిరిగి చితకొట్టేయకుండా ....
రంగా: ఓహో బ్రహ్మాండం... షో అదిరిపోయింది .... ఇవాళే మీ ప్లాన్ అమలు జరుపుతాన్సార్.... ట్రాన్స్ఫర్ ఆర్డర్ రాగానే మీ ఫీజు తెచ్చిస్తా.

***

ప్రెస్ అని రాసి ఉన్న స్కూటర్ దగ్గరికి వచ్చాడు గిరిబాబు. ప్రెస్ అనే అక్షరానికి నమస్కరించి ముద్దుపెట్టుకొని మొహం టోటల్‌గా కవర్ అయ్యే హెల్మెట్ పెట్టుకొని స్కూటర్ స్టార్ట్ చేసాడు.

రోడ్ మీద వచ్చిపోయే వాహనాలని చూస్తున్నారు రంగారావు. దూరాన Press అని వస్తున్న స్కూటర్ కనిపించింది. ముఖానికి మఫ్లర్ బిగించాడు. లాఠీ పట్టుకొని రెడీగా ఉన్నాడు. స్కూటర్ దగ్గరకు వచ్చింది. ఆపాడు, గిరిబాబుని దిగమన్నాడు. గిరిబాబు దిగాడు. ప్రెస్ అన్న అక్షరాన్ని చూపించాడు. రంగారావు ఉప్పొంగిపోయాడు. షర్టు పట్టుకొని లాఠీ ఎత్తాడు. శుభ్రంగా చితక్కొట్టేసాడు.

***

రంగారావు ట్రాన్స్ఫర్ ఆర్డర్ కోసం ఇంకా ఎదురుచూస్తూనే ఉన్నాడు. కానీ రాలేదు. ఎందుకంటే అతను కొట్టింది నిజమైన జర్నలిస్టుని కాదు కనుక.

గిరిబాబు నోరుమూసుకొని హాస్పిటల్‌లో అడ్మిట్ అయ్యాడు, రిపోర్టు కూడా ఇవ్వలేదు. ఎందుకంటే అతను నిజమైన జర్నలిస్ట్ కాదు కనుక.

అతనింట్లో ఫోన్ ఇప్పటికీ మోగుతూనే ఉంది. ఎందుకంటే రంగారావు, గిరిబాబు ఆ గురువుకు ఫీజు ఇంకా చెల్లించలేదు కనుక.

ఏదీ గుర్తుండి చావని ఆ ఫోన్ గురుడికి ఈ ఫోన్ నెంబర్ మాత్రం ఎలా గుర్తుందని లాజిక్ లాక్కండి... ఎందుకంటే ఇది కామెడీ కథ కనుక.

## తండ్రికి తనయుల అరుదైన కానుక


అమాన్, అయాన్

**సరోద్ విద్వాంసుడు ఉస్తాద్ అమ్జద్ అలీ ఖాన్ కు ఆయన తనయులు, శిష్యులు అయిన అమాన్, అయాన్‌లు ఒక అరుదైన కానుక అందించారు. "అబ్బా, (తండ్రి అని అర్థం) గాడ్స్ గ్రేటెస్ట్ గిఫ్ట్ టు అజ్' అనే పేర ఆయన జీవిత చరిత్ర గ్రంథస్తం చేసి వెలువరించారు. నాలుగు నెలలు మాత్రమే సాగిన తండ్రి మొదటివివాహం దగ్గర్నుంచీ (ఆ వివరాలు తల్లినుండి సేకరించారట), అభిమాన శిష్యులు మోసం చేస్తే డిప్రెషన్‌లోకి వెళ్లిన విషయం దగ్గర్నుంచీ, ఆయన సంగీత విద్య గురించీ అనేక వివరాలతో ఉందట ఈ పుస్తకం! పుస్తకం రాయడానికి తండ్రి దోహదపడ్డారా అని అడిగితే 'ముందా రాయడాలు ఆపి, ప్రాక్టీసు చేయండర్రా' అని మందలించేవారు' అని చెప్పారు ఈ జంటరచయితలు.**

డిసెంబరు 15 బాపు పుట్టినరోజు సందర్భంగా -

# బాపు నుంచి బాపు నుంచి బాపు దాకా

— ముళ్ళపూడి వెంకటరమణ

"వత్సా! వరం కోరుకో"
"ఎందుకూ?"
"బి.ఎల్. చదివి లాయరు వయ్యావు గదా"
"అయితే?"
"ప్రాక్టీసు పెట్టాలి గదా"
"పెడితే?"
"గొప్పలాయరువై కోట్లు గడిస్తావా-
గొప్ప జడ్జివై కీర్తిగడిస్తావా - వరంకోరుకో"
"నా ప్రాక్టీసు అదికాదు"
"మరి లా యెందుకు చదివినట్టు?"
"తండ్రి ఆజ్ఞ తలదాలిచి"
"ప్రాక్టీసు పెట్టకపోతే తండ్రి ఆజ్ఞ తప్పినట్టు కాదా?"
"తండ్రి ఆజ్ఞ లాయరు చదవడం వరకే -
ప్రాక్టీసుకు ఇది వర్తించదు"
"ఇంతకీ ఏం ప్రాక్టీసు చేస్తావు?"
"ఇదీ" అని అట్ట మీద వేసిన సరస్వతి బొమ్మని చూపించాడు బాపు.
చదువుల తల్లి సంతోషించింది.
"అరె - నాతో మాట్లాడుతూనే నాబొమ్మ గీశావే"
"నాతో మాట్లాడుతూనే నువ్వు వీణ వాయిస్తున్నావు కదా"
"చమత్కారివే -- సరేకాని - బొమ్మలు అని ఒక్కమాటలో చెప్పావు. చిత్రకళ సముద్రమంతటిది- అందులో ఎన్ని విధాలున్నాయో- ఆయిల్ పెయింట్స్, వాటర్ కలర్స్, పెన్ & బ్రష్ పెయింటింగ్స్‌లో రవివర్మ, చామకూర్, దామెర్ల, భాగీరథి, మొక్కపాటి, పిలకా, వైకుంఠం, పైడిరాజు... ఇలా ఎందరో... రేఖా చిత్రాల్లో బాపిరాజు, తలిసెట్టి. వపా - తెల్లదొరల్లో డావిన్సీ, మైకెలేంజలో, నార్మన్ రాక్వెల్, హోగార్త్- కార్టూనుల్లో షూల్జ్, కెచామ్ - శిల్పంలో రోడాన్ రాయ్ చౌధురి - ఇలా ఎన్నో శాఖలు - ఎందరో మహానుభావులు... '
'...వారందరూ నా గురువులే - అందరికీ వందనాలు."
"కాని ఈ శాఖలలో నీకేది కావాలో చెప్పు- ఒక్కొక్క శాఖలలో సాధన చేసి సాధించడానికి ఒక జీవిత కాలం చాలదు - నీకే శాఖ కావాలో చెప్పు"
"నాకు అన్నీ కావాలి"
"అదేమిటి - దురాశ - అది సాధ్యంకాదు-
ఏదో ఒకటి చెప్పు - వరమిస్తాను"
"వచ్చినప్పటి నుంచి వరమిస్తానని బెదిరిస్తున్నావు - నాకు అసలు వరాలే వద్దు."
"అదేం?"



"అతి చవగ్గా వచ్చేవీ - శ్రమలేకుండా బేవార్సుగా వచ్చేవీ మంచివి కావని మా నాన్నగారు చెప్పారు. ఏదైనా కష్టపడి సంపాదిస్తేనే రుచి"
"సరే కానీ - షడుచీ ప్రాప్తిరస్తు"
"ఇది వరమా?"
"కాదులే - అలవాటు కొద్దీ వచ్చేసింది
- ఇది నాకోరిక - నాఊహ"

***

ఇది 'నా' ఊహా చిత్రం...
అయితే బాపు "బొమ్మలకథ" సరీగా ఇలాగే జరిగింది, .. జరుగుతోంది.
అయినా ఇప్పటికీ బాపు కృషి చేస్తూనే ఉన్నాడు, ... ఉంటాడు.
"నాకు బొమ్మలు వెయ్యడం రాదు - అవకాశాలు లేక ఆర్టు స్కూలుకెళ్ళి శిక్షణ పొందలేదు" అని ఇప్పటికీ అనుకుంటూనే ఉంటాడు, ... అంటూనే ఉంటాడు.
సాధారణంగా కళారంగంలో ఒక శాఖలో కృషిచేసి సాధించిన వారు జీవితాంతం ఆ ఒక్కశాఖలోనే కృషిచేస్తారు. ప్రసిద్ధులవుతారు. కార్టూన్లు వేసేవారు కార్టూన్‌లే - పెయింటింగ్స్ వేసేవారు అందులోనే...
కాని ఒక్క బాపు మాత్రం రేఖా చిత్రాలు, వర్ణ చిత్రాలు. తెలుగు వెలుగు రూప చిత్రాలు, కారికేచర్స్, దేవతల చిత్రాలు, సినిమా పబ్లిసిటీ, కమర్షియల్ పబ్లిసిటీ- ఇలా అన్ని శాఖలలోనూ కృషి చేశాడు. వేద వేదాంత గ్రంథాలకు

## నిత్యపరివర్తనశైలి ....... లైన్లు మరింత పొదుపుగా...





ముఖచిత్రాలు వేశాడు. కార్టున్‌లలో మళ్ళీ- సినిమా, రాజకీయం, ప్రకటనలు, కామిక్‌స్ట్రిప్, హాస్యరేఖా చిత్రాలు- మళ్ళీ మాటాడితే చలన చిత్రాలు, సంచలన చిత్రాలు, (బాపూ మార్కుఫ్లాపులు) అనేక రకాలు వేశాడు. అనితర సాధ్యం అనిపించే సర్వతోముఖ ప్రావీణ్యత సాధించినవాడు బాపు - బాపే- బాపు ఒక్కడే-

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు చెప్పినట్లు "బాపు రేక పండినది."

***

పండు అంటే-

దోర ముగ్గిన మామిడి పండు దోసిట్లో వచ్చిపడటం కాదు. వరప్రసాదం కాదు- ఒక విత్తనం మొలకెత్తడం - వేరు భూమిలోకీ, ఆకు ఆకాశంలోకి-జొరబారడం, ఎగబాకటం... చైత్రం నుండి చైత్రం వరకూ- ఎండా వానా, ఉక్కా చలీ, ఆకలీ అజీర్ణం, నిద్రా అలసటా, పురుగూ పుట్రా - అన్నింటిని అనుభవించుతూ ఒంట పట్టించుకుని నిభాయించుకోవడం.. క్రమంగా సక్రమంగా నిదానంగా ఎదగడం - ఆకు తొడగడం, చిగురు వేయడం, పూత పూయడం, కాయకాయటం, పండు పండడం...

బాపు రేక పండినతీరు ఇంత తీరుబాటుగా ఇంత నెమ్మదిగా సక్రమంగా సహజంగా నిసర్గ సుందరంగా భాసించింది... నాలుగైదేళ్ళ అల్లరి వేళ్ళతో-బొగ్గు పట్టుకుని- నాన్న చేతిలో చుట్ట, అమ్మ దగ్గర కుంపటి చీపురు కట్టా. నర్సాపురం వెళ్ళే రైలు పొగా (నర్సాపురం వెళ్ళేది రైలా? పొగా?) చీకట్లో రైలూ వేసిన చిన్న చేతులే పలకా బలపంతో సుద్దముక్కతోపెన్సిలుతో పెన్నుతో బ్రష్షుతో బొమ్మలు వేశాయి. ఒకట్లూ పదులూ వందలూ కాదు-వేలకొద్దీ- వేలకి వేలకొద్దీ!

బొమ్మలు నేర్చుకునే వారిలో - కన్నూముక్కూ నోరూ చాలా మందికి సులువుగానే వస్తాయి. కాని కాళ్ళూ వేళ్ళూ కష్టం... అంటారు. బస్టాండులో స్కూలు ప్లేగ్రౌండులో, కిళ్ళీబడ్డీ దగ్గరా, ట్రాములో, బస్సులో, బీచిలో, గుడిలో కోనేరులో... కొనే, తినే, చిల్లర లెక్కెట్టే వేళ్ళూ, నడిచే పరిగెత్తే ఆగే దూకే ఎక్కే కాళ్ళూ, వేళ్ళూ-వేలకి వేళ్ళు... ఇవన్నీ చెట్టుకి వేళ్ళలా పునాదిలోకి చొచ్చుకు పోయాయి.



అల్లుకు పోయాయి... అవేపైకి కొమ్మలై రెమ్మలై ఆకులై పూతలై పిందెలై దోరకాయలై ఆరముగ్గిన పళ్ళుగా పండాయి.

40లలో మొలకలెత్తిన బొమ్మలు 50లలో లేత మొక్కలై 60లలో 70, 80, 90లలో క్రమ వికాసం పొందాయి. సుమారుగా ప్రతి పదేళ్ళకీ ఒక రేఖా హేమంతం - ఒక నవరేఖా చైత్రం... పాత గీత జారిపోయి కొత్తగీత పోసుకోవడం.... ప్రకృతి కాంత వలువలు మార్చుకున్నట్లే...

***

ఇద్దరు నదివద్ద నుంచున్నారు.

"ఇది నది" అన్నాడు ఒకడు.

"ఏది నది? నువ్వు చెప్పినపుడు కనిపించిన నీరా? రెప్ప పాటులో వెళ్ళిపోయినదా- ఇపుడు వస్తున్నదా - మరో క్షణం తరువాత రాబోయే జల బిందువులా- ఏది నది?" అన్నాడు మిత్రుడు.

అవును- ఏదీ- ఏ ఒక్కటీ కాదు- నిన్నా నేడూ రేపూ కలిసే ప్రవాహమే నది -

బాపు బొమ్మలు రేఖలు, వెలుగులు నీడలు వంపులు సొంపులు అన్నీ నది లాంటివే... ఇది ఇది అనే సరికి - ఆ 'యిది' 'అది' అయిపోతుంది. మరొక 'అది' వస్తుంది- కొత్త రేఖలు, కొత్తశైలి... బాపుని అభిమానించి యిష్టపడి అనుకరించే చాలా మంది ఆర్టిస్టులకు నిత్యపరివర్తనశీలమైన బాపు శైలి దొరకదు- 'ఇది' అని వారు వేసిన కొద్దికాలానికే అది మారిపోతుంది.

సర్వసాధారణంగా ఆర్టిస్టులు అందరికీ - నూటికి 99 పాళ్ళు- ఒకటే శైలి వుంటుంది. కార్టూన్‌కు ప్రసిద్ధులైన ఆర్.కె. లక్ష్మణ్, ఆబూ, మారియో-వీళ్ళందరి రేఖలూ ఎప్పుడూ ఒక్కలాగే ఉంటాయి. రేఖలే కాదు సంతకాలు కూడా అలాగే ఉంటాయి. కాని బాపు బొమ్మలు- అందులో వెలుగు నీడలూ వాటి వంపు సొంపులూ ఇవే కాదు- సంతకం కూడా నాగుబాములాగే ఉంటుంది. ఈ 'బాపు' సంతకం పరిణామశీలమై మారుతూ 'బాపు' అనే ఆడంబరం నుంచి ఎన్నో మార్పులు చెంది - '...' అనే దిగంబరం - సింప్లెస్ట్ సంతకం చేరు కోవడానికి 55 సంవత్సరాలు పట్టింది. బాపు బొమ్మలను విశేషంగా అభిమానించే ఆరాధకులకు 50 లనాటి బొమ్మలలో ఎక్కువ గీతలనుంచి 90ల నాటి తక్కువ గీతల బొమ్మల వరకూ అనేక స్థాయిలలో మార్పులు కనిపిస్తాయి. ఒక పరిపక్వత, ఒక పరిణత స్థితి ఎలా రూపు దిద్దుకుందో కనిపిస్తుంది. గొప్ప కళాకారులు ఎప్పుడూ క్రమవికాసంతో సింప్లిసిటీ కోసమే ప్రయత్నిస్తారు. గాయకులు కొత్తలో విజృంభించే అనవసర స్వర విన్యాసాలనూ, రచయితలు వాగాడంబర విన్యాసాలనూ, చిత్రకారులు రేఖా వికారాలనూ క్రమంగా తగ్గించుకుంటూ- చివరకు ఒక స్వచ్ఛసుందరమైన నిరాడంబరమైన స్థాయిని సాధిస్తారు. అదే కళకు తురీయావస్థ- పరాకాష్ఠ...

బాపు నుంచి బాపు వరకు జరిగిన జరుగుతున్న జరగబోతున్న కథ అదే...

***

'ఎందుకిన్ని మార్పులు - ఎందుకిన్ని రకాలూ?' అంటే "వై నాట్?" అంటాడు

## నిత్యపరివర్తనశైలి....... హావభావాలు మరింత ప్రస్ఫుటంగా...






బాపు.

- అసలు నిజానికి ఈ సృష్టిలో మార్పు కాకుండా జరిగేది మార్పు జరుగుతూ వుండడమే అంటాడు.

మనం ఒక్కొక్క సంగతి చెప్పడానికి ఒక్కొక్క భాష, ఒక్కొక్క స్వరం, ఒక్కొక్క అభినయ వైఖరీ వాడుతున్నాం. సరదా సంగతికి ఒక ధోరణి. దు:ఖానికి మరొక రకం - కోపానికి ఇంకో విధం... అలాగే సంగీతంలో సాహిత్యభావాన్ని బట్టీ, గానం చేసే సమయసందర్భాలను బట్టీ, రాగాలూ స్వర ప్రస్తారాలూ మారుతాయి.

అలాగే రకరకాల పరిస్థితులను ప్రతిబింబించే చిత్రాలు మాత్రం ఎందుకు మారకూడదు! అంతే కాదు - చిత్రకారులలో మన దేశంలో మన రాష్ట్రంలో, ఈ నగరంలో - ఇతర దేశాలలో ఎందరో చిత్రకారులు మహానుభావులున్నారు. వారందరూ నా గురువులే - అందరి దగ్గర నేను ఎన్నో నేర్చుకున్నాను. నేర్చుకుంటూనే వున్నాను. నేను ఒకో ఆర్టిస్టు బొమ్మ చూస్తూంటే ఆయనలా వేయాలని పిస్తుంది. అలాటి 'ఆయనలు' నాకు శతకోటి ఉండబట్టి నేను ఏ శైలికీ కట్టుబడలేను. ఏశైలీ నాకు కట్టుబడి ఉండదు అంటాడు.

నాశైలే ఏమిటి - నేనే రోజురోజుకీ క్షణక్షణానికీ మారిపోతున్నాను గదా! అడుగున్నర బేబీ నుంచి అయిదున్నర అడుగుల బాపు దాకా పెరిగాను. పెద్ద పాము పడగలాటి 'హెడ్డు మీద - హుడ్డు' అలా అలా వెనక్కెళ్లి బాల్డు హెడ్డు వచ్చింది. కోల్మన్ టైలర్ మీసాలు పోయి నిర్మీసం అయింది. బహుదూరదర్శన్ మరియు అతిసూక్ష్మదర్శన్ కళ్లకి కళ్లజోడు వచ్చింది. రానిదల్లా బొమ్మలలో సామర్థ్యమే- అంటాడు వినయం ఉట్టిపడే గర్వంతో.



ఇందులో చిన్న ధర్మసూక్ష్మం ఉంది. డిగ్రీ చేతికి రాగానే చదువు అయిపోయింది అనుకుంటారు చాలామంది. అసలు చదువుకి అదే మొదలు అని బాపు నమ్మకం. మనకి ఎంత విద్య రాదో ఎంత నేర్చుకోవాలో తెలియజెప్పే హెచ్చరించేదే డిగ్రీ అనే సిగ్నల్ అంటాడు. డిగ్రీ రావడమే విద్యకి ఆరంభం. కొత్తగా రెక్కలు వచ్చిన పక్షిలా - ఇపుడే అసలు విద్య నేర్చుకోవడం అని నమ్ముతాడు బాపు. విద్యకి ఆరంభం ఉండవచ్చుగాని అంతం అనేది ఎక్కడా ఎప్పుడూ ఉండదు అంటాడు. నేను చిన్నపుడు ఏ ఆర్టు స్కూలులోనూ శిక్షణ పొందలేదు. అందువల్ల నా విద్య సమగ్రంకాదు. అయివుంటే ఈ చిత్రాలు ఇంకా బాగా ఉండేవేమో అంటాడు బాధగా. అది - అనగా ఈ ఆర్టుస్కూలు విద్య లేకపోవడం శాపమో, అభిమానుల పాలిటి వరమో మనమే తెల్చుకోవాలి...



***

సాధారణంగా పెయింటర్స్ పెయింటింగ్‌లోనే ఉంటారు. రేఖా చిత్రకారులూ కార్టూన్ కళాకారులూ వారివారి ప్రత్యేక ప్రపంచాలలోనే వుండి ప్రసిద్ధులవుతూ ఉంటారు.అన్ని ద్వారాల తెరిచి అన్ని లోకాలలోనూ విహరించి అన్ని రకాల చిత్రాలనూ వేసీ - వేస్తూ చలన చిత్రాలను తీస్తూ ప్రసిద్ధులయిన ఒకరిద్దరిలో బాపు ఇద్దరి పెట్టు...

రామ చిత్రాలు భామ చిత్రాలూ బంతిపూలరథాల వంటి 'బొమ్మ' చిత్రాలూ ఫోటోగ్రాఫ్‌ను మించి పై సంగతి వేసే తెలుగు వెలుగుల వంటి రూపరేఖా విలాస చిత్రాలూ సినిమా పోస్టర్లూ ఇవన్నీ కాక - అంతకి అంత తులతూగే కార్టూన్‌లు వేలకొద్దీ వేశాడు. కింది కాప్షన్ వల్లకాక - కేవలం బొమ్మచూస్తే నవ్వు వచ్చేవే నూటికి 90 పాళ్ళు. అరహాసం నుంచి అట్టహాసందాకా రకరకాల నవ్వుల పువ్వులు పూయించే చిత్రాలవి. దుర్వాసుడినీ విశ్వామిత్రుడినీ భమిడిపాటి కామేశ్వరరావునీ విశ్వనాథ సత్యనారాయణనీ తాపీ ధర్మారావునీ (ఈయన నవ్వినా బవిరి గడ్డం వల్ల నవ్వు కనబడదు) దేవదాసునీ, ఇన్స్పెటాసునీ కూడా నవ్విస్తాయి. ఆ కార్ట్యూనులు అవీ మీకు తెలుసు నాకు తెలుసు తెలుసునని ఇద్దరికీ తెలుసు అయినా చెప్పుకొనుట- విశ్వనాథ వారన్నట్లు ఇది యొక చమత్కారము.

***

అన్నిటినీ మించిన ధనం - అన్నిటిలో ఉట్టిపడే తెలుగుతనం...

బొమ్మల్లో బామ్మగారినో పిన్నిగారినో రాధాగోపాళాన్నో అల్లరి వెధవనో - రోడ్డు సైడు రోమియోనో అద్భుతం అని నేను మెచ్చుకోబోతే - ఏంకాదులే - అది దొరల కార్టూన్‌కు పచ్చికాపీ అని మొట్టికాయ వేస్తాడు. కాపీ అయితేనేం. వాడి దొరతనాన్ని ఇస్త్రీ చేసి మన తెలుగు దీపాన్ని వెలిగించావు కదా. ఇప్పుడిది అచ్చ తెలుగు కార్టూన్ కన్న అచ్చ తెలుగున్నర కార్టూన్‌లా ఉంది అని నేను వాదిస్తాను. అతను రేడియో వాల్యూము పెంచుతాడు.



ఓసారి ఎవరో ఆర్టిస్టు - బాపుగారి అప్పడాలకర్ర

## నిత్యపరివర్తనశైలి....... స్వభావ చిత్రీకరణ ఇంకా స్పష్టంగా...





మార్కు కార్టూన్‌లకు రోజులు చెల్లిపోయాయి అని విశాల హృదయంతో జోహార్లు అర్పించాడు. వెంటనే బాపు గయ్యాళి ఇల్లాలి చేతిలో 'శివ' మార్కు సైకిలు చెయిను ఏర్పాటు చేసి విమర్శ కుడినిసత్కరించాడు.

ఎదుటివాళ్ళ మీద జోకులూ కార్టూన్‌లూ అందరూ వేస్తారు- కాని తనమీద తన చిత్రకళమీద కూడా కఠినమైన క్రూరాతి క్రూరమైన జోకులు వేసుకుని తన గురివిందగింజత్వాన్ని తనే ప్రకటించి హాయిగా నవ్వుకోవడం ఒక్క బాపుకే చెల్లింది.



అందాల రాముడు మాకు మార్కెట్లో మస్కా ఇచ్చి, ఏ్ ం వ ం ం తా దు:ఖ సముద్రంలో విలాసంగా ఈతలు కొడుతున్న వేళ - బాపు కార్టూన్‌లు వేసి - పత్రికలో ప్రకటనలుగా (!) అచ్చు వేయించాడు. తీసినవారికీ చూసినవారికీ కూడా అంచనాలు 'తలకిందులు' చేసిన చిత్రం అంటూ పడవను తలకిందులుగా వేశాడు...అలాగే 70వరోజు అని ఒక పోస్టరు! 'యాడ?' అని చుట్టకాల్చే ప్రేక్షకుడు అడుగుతాడు. 'యాడా లేదు ఈడా లేదు రిలీజయి 70 రోజులయిందని.. అంతే - ఆడుతోందని కాదు' అని వ్యాఖ్య రాశాడు.



ఇదే కాదు తాను తీసిన తెలుగు తమిళ హిందీ చిత్రాలలో మేటివీ ఓటివీ - జయాపజయాలను బట్టి అన్నిటికీ కార్టూను రూపాలిచ్చి క్విజ్ పెట్టాడు -అదొక బోనసు. ఇలాటివి మీకు ఏకార్టూన్ బుక్‌లోనూ దొరకవు - సావధాన్...




నవ్వించే బొమ్మల మధ్య అపుడుపుడు జాలితో బాధతో కలచివేసే కార్టూనులు కూడా కనిపిస్తాయి - ఒక నడి వయసు తండ్రి కుంపటి మీద వంట చేస్తుంటాడు. అమ్మేదీ అని అడిగే కొడుక్కి- "మన అమ్మా- గాసు స్టవ్వున్న అంకుల్‌తో ఊరెళ్ళిపోయింది" అని చెప్తాడు.

ఒక వృద్ధుడికి మందుల సేల్స్ మన్ యవ్వన గుళికల గురించి చెప్పి ఊరిస్తాడు. "నా పింఛను కేమీ ఇబ్బందిరాదు కదా" అంటా డాయన ఆ శాభ యాల మధ్య ఊగిస లాడుతూ.

***



ఇవన్నీ కాక కార్టూన్ అనే ఒక విలక్షణమైన జాతి బొమ్మలున్నాయి. లివంరి కుక్కల చమత్కారాలతో రాతా గీతా కలసి కలబోసిన పన్నీటి జల్లులు... తెలుగు సినిమా నటీనటుల ఫుల్‌సైజు గాలరీయే ఏర్పాటు చేశాడు - ఆపైన - నవ్వులకు బదులు మనసులో పువ్వులు పూయించే దివ్యమనోహర చిత్రరేఖా విన్యాసాలున్నాయి. అవి ఒక్కకన్ను, ఒక్క ముక్కుకొన, చెవిరింగులు, కేశపాశాలు, పాదాలు, వేళ్ళు, గోళ్లు, శంఖంలాంటి మెడ, రంభోరువుల్లాటి తొడ... మీ గుండెల్లో దడ...

ఇవన్నీ అక్షరాలా చిత్ర రేఖా కవిత్వాలు- బొమ్మ పూర్తిగా వెయ్యకుండా- ఒక కన్నూ ఒక చూపూ - దాని చివర ప్రియుడూ -జలపాతం లాటి కురుల మీద నుంచి జారుతున్న ప్రియుడు, చెవిరింగులో కూర్చునీ, లోలాకులు పట్టుకునీ ఉయ్యాలలూగే వయ్యారి భామలూ - ఇలా ఎన్నో రేఖా - ఖండాలు. అవి సగమే - మిగతా రూపం ఊహా చమత్కారం మన మనసులో ఏర్పడతాయి. అన్ హర్డ్ మెలొడీస్ ఆర్ స్వీటర్ అన్నట్లు వీటిలో బాపు గీచిన గీతల కన్న దాచిన రేఖలు మరింత మనోహరంగా ఉంటాయి. ఇలాటి చిత్రాలు ఎన్నిటినో పత్రికలలో వేస్తే వేలాది పాఠకులు వాటిని చూసి లిమరిక్కులూ చమరిక్కులూ హైకులూ రాశారు. ఇది చిత్ర చక్షు సంయోగం అనే కెమిస్ట్రీలో అద్భుతమైన ప్రక్రియ... సరదాగా బొమ్మలు చూస్తున్న పాఠకుల చేత సరదాన్నరగా కవితలు పాడించాడు.



## నిత్యపరివర్తనశైలి...... ఆంగికం జోడించి...





డాన్సులాడించాడు. బొమ్మలు చూసి పాఠకుడు నవ్వుకోవడం అనే వన్‌వే ట్రాఫిక్‌ని మల్టిపుల్ కమ్యూనికేషన్‌గా మార్చాడు... ఇది ఒక కళాకారుడి కలాపోసన...

***

బాపు కార్టూన్‌లో పొల్లుగీత ఉండదు. రాతలో పొల్లుమాట ఉండదు. అంతా లెక్కే. స్పష్టంగా ఖచ్చితంగా రత్నఖచితంగా ధగధగ మెరుస్తుంటాయి. ఆ మాటల పదును, ఆ డైలాగుల సొగసు, పొంకం - బొమ్మని మించి మాట , .. మాటని దాటి బొమ్మ.

ఇందులో మాటలు నావేనని ఒక పేద్ద అపప్రధ ఉంది. నాపేరు రచయిత కాబట్టీ, ఇద్దరం కలిసి తిరుగుతూంటాం కాబట్టీను. కొందరు తెలిసీ తెలియకా 'బాపుగారి గీత - రమణగారి రాత' కలిస్తే - అంటుంటారు.

పబ్లీకున గర్వపడి సిగ్గుపడి భలేవారే అని నటనలు చేసినా - రహస్యంగా దిగులు పడిపోతుంటాను- కావమ్మ మొగుడంటే కాబోసు అనుకున్నాననుకుంటాను.

కాని సరస్వతి తోడు- ఊహా గీతా రాతా సమస్తం సత్తిరాజు లక్ష్మీనారాయణ అనే బాపుగారివే... నా గొప్పదనం అల్లా అవి పత్రికలో అచ్చయి మీరంతా నవ్వే ముందు - నేను అతని డెస్క్ దగ్గరే చూసేసి అందరికన్న ముందుగా నవ్వేస్తాను...

అది నా అదృష్టం!

(విశాలాంధ్ర వారి ద్వారా ఈ నెలలో విడుదలయ్యే 'బాపు బొమ్మల కొలువు' పుస్తకం 'ముందుమాట' నుండి)

---



# చంద్రబోస్‌కు మనస్విని అవార్డు



1989 అక్టోబరు 17 న చెన్నయ్‌లో ఏర్పడిన మనస్విని ట్రస్టు ప్రతీ యేటా ఒక ఉత్తమ సినీ రచయితను 'ఆత్రేయ-మనస్విని' పురస్కారంతో సత్కరిస్తోంది. 2001 సంవత్సరానికి ఈ అవార్డు స్టూడెంట్ నెం1 లోని 'ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి' పాటకు గాను చంద్రబోస్‌కి లభించింది శ్రీ కె. జగ్గయ్య మేనేజింగ్ ట్రస్టీ, శ్రీయుతులు వి.బి. రాజేంద్రప్రసాద్, డి. రామానాయుడు, ఎమ్.ఎస్.రెడ్డి, కె.దేవీవరప్రసాద్, కె.మురారి, కె.మోహన్, డా॥పి.యస్.రెడ్డి ట్రస్టీలు. 1990 లో ఆత్రేయసాహితిని ఏడు సంపుటాలుగా వెలువరించాక 1991 నుండి ఇచ్చిన ఈ అవార్డుల వివరాలు.

| | | |
|---|---|---|
| 1991ఆరుద్ర | శ్రీరస్తు, శుభమస్తు, శ్రీకారం చుట్టుకుంది పెళ్లిపుస్తకం | (పెళ్లి పుస్తకం) |
| 1992వేటూరి | ఆకాశాన సూర్యుడుండడు సందెవేళకే | (సుందరకాండ) |
| 1993వేటూరి | వేణువై వచ్చాను భువనానికి | (మాతృదేవోభవ) |
| 1994సిరివెన్నెల | చిలకా ఏ తోడులేక | (శుభలగ్నం) |
| 1995గద్దర్ | మల్లెతీగకు పందిరివోలె | (ఒరేయ్ రిక్షా) |
| 1996సిరివెన్నెల | హృదయమనే కోవెల తలుపులు తెరిచే తాళం ప్రేమ | (పెళ్లిసందడి) |
| 1997సుద్దాల అశోక్‌తేజ | రామసక్కని తల్లి రాములమ్మో | (ఒసేయ్ రాములమ్మా) |
| 1998సిరివెన్నెల | బోడి చదువులు వేస్టు... | (మనసిచ్చిచూడు) |
| 1999సిరివెన్నెల | నోరార పిలిచినా పలకని వాడినా | (అల్లుడుగారొచ్చారు) |
| 2000కులశేఖర్ | ఊహల పల్లకిలో | (చిత్రం) |

# సరిగమలు - గలగలలు

## మాధవపెద్ది సురేష్

(సినీ సంగీత దర్శకుడు)



శ్రీ తాతినేని చలపతిరావుగారు అన్నయ్య రమేష్‌ని Playback Singer గా, నన్ను Instrument Player గా సినీ పరిశ్రమకు పరిచయం చేశారు. 1971లో 'దత్తపుత్రుడు' సినిమాలో 'మనసైనా ఓ చినదాన' అనే పాట నాగేశ్వరరావు గారికి ఘంటసాల గారు పాడారు. ఆయనతో పాటు 'యోడ్‌లింగ్స్' అన్నయ్య పాడాడు. 'నవ్వులు' రమోలా గారు పాడారు. తరువాత గురువుగారే 'ఆడపిల్లల తండ్రి' సినిమాలో నాగభూషణం గారికి సోలో సాంగ్ పాడించారు. శ్రీ కె. వాసుగారు దర్శకుడు.

చలపతిరావు గారు లక్ష్మీ కాలనీలో (టి. నగర్) డా॥ గాలి బాలసుందర రావు గారింట్లో అద్దెకుండేవారు. రెండు ఇళ్ళు దాటి మా బాబాయి గోఖలేగారు, సత్యంగారు ఉండేవారు. ఎదురింట్లో పింగళి నాగేంద్రరావు గారుండేవారు. తరువాత ఆ ఇల్లు ఘంటసాల గారు కొన్నారు. మా నాన్నగారు, చలపతిరావు గారు మంచి స్నేహితులు. గురువుగారికి మా కుటుంబసభ్యులు అందరూ బాగా తెలుసు.

అన్నయ్యని ముందు Asst. Music Director గా ఆయన వద్దే ఉంచారు. అన్నయ్యని చాలా ఎంకరేజ్ చేశారు. మంచి పాటలు పాడించారు. 'రాముని మించిన రాముడు' లో నాగేష్ గారికి, 'వనజ-గిరిజ' లో రెండు డ్యూయెట్స్ సుశీల గారితో (జీవితమే ఒక కవితగా, ఇంకోపాట) ఇలా చాలా పాటలు పాడించారు. నన్నూ ఎంతో ప్రోత్సహించారు. ఆయన భార్య అన్నపూర్ణమ్మగారికీ, పావకీ, ఆయన కుటుంబసభ్యులందరికీ అన్నయ్య, నేనూ, మాకుటుంబాలు ఎంతో ఋణపడి ఉన్నాము.

1971లోఆంధ్రరాష్ట్రావతరణ రజతోత్సవ ఉత్సవంలో హైదరాబాద్ లో చలపతిరావు గారు ఓ నృత్యరూపకానికి సంగీత దర్శకత్వం వహించారు. అప్పటికింకా నేను విజయవాడలోనే ఉన్నాను. అన్నయ్య చెప్పటంతో నేను రూపకంలో 'ఎకార్డియన్' ప్లే చేశాను. అప్పుడు చలపతిరావు గారి అసిస్టెంట్స్ సూరపరాజు గారు, వయొలిన్ ప్లేయర్ శ్యామలరావు గారు, తబ్లా ప్లేయర్ సుబ్బారావు గారు, మాండొలిన్ ప్లేయర్ నరహరి గారు పరిచయమయ్యారు. అన్నయ్య, షరావతి



గారు పాడారు. అందరూ నా 'ప్లేయింగు' అంటే ఎంతో ఇష్టపడ్డారు, ఎంతో ప్రోత్సహించారు. అయితే నాకు నొటేషన్స్ చూసి వాయించటం తెలియదు. అప్పుడు నరహరి గారు బార్స్ కౌంటింగ్, నొటేషన్స్ రాసే పద్ధతీ, అవన్నీ ఒక గంటసేపు విశదంగా, అర్థమయ్యేటట్లు చెప్పారు.

అప్పటినుండే నేను నొటేషన్స్ క్లియర్‌గా రాయటం, చూసి వెంటనే వాయించటం అలవాటు చేసుకున్నాను. అందుకే ఎప్పుడూ నరహరి గారంటే గురుభావం నాకు.

తరువాత మా నాన్నగారు చనిపోయాక 1973 డిసెంబర్ 4న మద్రాస్‌లో స్థిరపడటానికి వెళ్లాను. గోపు - బాబు వాళ్ళ ఆర్కెస్ట్రాలో మొదటగా ఎకార్డిన్ వాయించేవాన్ని. తరువాత 1974 మార్చిలో 'పరివర్తన' సినిమాలో నాకు ఎకార్డియన్ ప్లేయర్‌గా అవకాశం ఇచ్చారు. జెమిని థియేటర్‌లో మొదటిపాట రికార్డింగ్. శ్రీ కె. హేమాంబరధరావు గారు దర్శకులు. చంద్రమోహన్, లక్ష్మీ హీరో హీరోయిన్స్. మొదటి పాట శ్రీ యస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారు పాడారు (లిరిక్ గుర్తులేదు). మొదటి పేమెంట్ 75 రూపాయలు. ఆయన దగ్గర 'Joy' అనే ఆయన కీబోర్డు వాయించేవారు. ఆయన టిప్‌టాప్‌గా డ్రస్ చేసుకుని, సూటూ బూటు వేసేవారు. ఆయన టైమ్ పెర్‌ఫెక్ట్‌గా మేనెటేన్ చేసేవారు.

ఆయన రికార్డింగు చాలా త్వరగా అయిపోయేవి. ఉదయం 7 గంటలకి మొదలు పెడితే 2, 3 గంటల్లో పాట పూర్తి చేసేవారు. ఆయన డిసిప్లిన్ చూసి ఇండస్ట్రీలో ఆయన్ని 'అయూబ్‌ఖాన్' అనేవారు. ఆయనకి యస్. రాజేశ్వరరావు గారంటే ఎంతో ఇష్టం, గురుభావం. సి.నారాయణరెడ్డి గారన్నా ఎంతో ప్రేమ. చలపతిరావు గారు ముఖ్యంగా రవీంద్ర ఆర్ట్స్, ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారికీ ఎన్నో మంచి పాటలు కంపోజ్ చేశారు. ముఖ్యంగా ఇల్లరికం, మంచి మనిషి, పునర్జన్మ మొదలైన చిత్రాల్లో గొప్ప పాటలు చేశారు. 'మంచి మనిషి' సినిమాకి యస్. రాజేశ్వరరావు గారితో కలిసి పని చేయటం నా పూర్వజన్మ సుకృతం' అనేవారు.

ఆయన దగ్గర Grundig Spool Tape Re-

corder ఉండేది. ఎవరైనా పాడినా, Instruments వాయించినా రికార్డ్ చేసేవారు. యస్. జానకి గారి పాటలెన్నో ఆయన రికార్డ్ చేశారు.

ఆయన బి. వసంత, సావిత్రి, రమేష్, షరావతి, టి.ఆర్.జయదేవ్ ఇలా ఎంతోమంది గాయకులను ఆయన ప్రోత్సహించారు. గానకోకిల శ్రీమతి యస్. జానకి గారిని తమిళంలో నేపథ్యగాయని గా పరిచయం చేశారు. (సినిమా పేరు విధివిళయాట్టు) శ్రీ S.P.B. గారికి 'ఎరక్కపోయి వచ్చాను' పాట (ఎ.ఎన్.ఆర్. గారికి పాడింది) అప్పట్లో మంచిపేరు తీసుకువచ్చింది. గురువుగారు చేసిన ఎన్నో పాటల్లో ట్రంపెట్ వాయిద్యం ఎక్కువ వినపడేది. (టి. చలపతిరావు గారు కదా! T ఉంది కాబట్టి Trumpet ఎక్కువయూజ్ చేస్తున్నారు అనుకునే వాళ్ళం) జనరల్‌గా ఇక్కడ ఒక విషయం చెప్పాలి. అప్పట్లో ఆల్మోస్ట్ అందరుమ్యూజిక్ డైరక్టర్ల దగ్గర ఆర్కెస్ట్రా వీలున్నంత వరకూ పెర్మనెంటుగా ఉండేవారు. అందుకని తప్పని సరిగా అందరికీ BGMS లో చోటు ఇవ్వాల్సి వచ్చేది. వయోలిన్స్, రిథమ్ సెక్షన్, బ్రాస్ సెక్షన్, అకార్డియన్, పియానో ఇలా అందరూ మాన్యుయల్‌గా వాయించే వాళ్లు. అందుకనే మనకు ఆల్‌మోస్ట్‌గా అన్ని పాటల్లో ఇన్‌స్ట్రుమెంట్స్ అవే వినపడేవి.

ఈ టీమ్‌ని మార్చిన వ్యక్తి ఇళయరాజా. ఇన్‌స్ట్రుమెంట్స్ ఎక్కువగా అవే ఉన్నా వాడే పద్ధతిలో ఒక విప్లవం తీసుకువచ్చారనే చెప్పాలి. పైగా ఆర్కెస్ట్రా సెక్షన్ ఆయన చేసినట్లుగా సౌత్ లో బహుశా మరే సంగీత దర్శకుడూ చేయలేదనే చెప్పాలి. అందుకనే ఆయన పాటల్లో BGMS కానీ,



రీరికార్డింగ్ గానీ ఎనర్జిటికల్‌గా ఉండేవి. డెప్త్ ఎక్కువగా ఉంటుంది.

చలపతిరావుగారి అమ్మాయి కవిత బాగా పాడుతుంది. ఒకసారి విజయా గార్డెన్స్‌లో వాయిస్ టెస్ట్ చేశాను. కానీ ఆ అమ్మాయి చేత పాడించటానికి సందర్భం కుదరలేదు. కొంచెం బాధపడ్డాను కూడా! ఇప్పుడు ఆ అమ్మాయి పెళ్ళిచేసుకొని అమెరికాలో స్థిరపడింది. నేనూ,



అన్నయ్య అభివృద్ధిలోనికి రావటం చూసి వారి కుటుంబం ఎంతో ఆనందపడేవారు. మా అబ్బాయి ఉపనయనానికి ఆయన ఆరోగ్యం బావుండకపోయినా అన్నపూర్ణమ్మ గారితో వచ్చి ఆశీర్వదించారు. అందరం ఎంతో ఆనందించాము. మా అబ్బాయి ఉపనయనానికి ఒక మంచిపని చేశాను. మహదేవన్‌గారి దంపతులు, బాలుగారి దంపతులు, నాగిరెడ్డిగారి దంపతులు, చలపతిరావుగారి దంపతులకీ బట్టలు పెట్టి వారి ఆశీర్వాదం అందుకున్నాము. ఈ నాలుగు కుటుంబాలనీ నేను మరణించే వరకూ మరచిపోలేను. కృతజ్ఞతా భావంతో ఉంటాను. నేననుకుంటా, ఈ సంబంధం ఈ జీవితంలో ఏర్పడింది కాదు. ఎన్నో జన్మల సుకృతఫలం.

ఎన్నో మంచి పాటలని మనకందించిన గురువుగారు చలపతిరావు గారు భౌతికంగా మన మధ్య లేకపోయినా ఆయన సంగీతం మనలందర్నీ జీవితాంతం వెంటాడుతూనే ఉంటుంది. ఆయన కుటుంబ సభ్యులందరూ జీవితాంతం ఆయురారోగ్యాలతో కలకాలం సుఖంగా ఉండాలని భగవంతుని ప్రార్థిస్తున్నా!

తాతినేని చలపతిరావు గారికి వీణ బాగా అలవాటు. ట్యూన్ చేయవలసి వచ్చినా సరే వీణపైనే త్వరగా పలికేది ట్యూన్.

1974-75లో హైదరాబాద్ రవీంద్రభారతిలో ఆయనకు ఘన సన్మానం జరిగింది. అది ఆయన సినీ రజతోత్సవ సభ. ఆ సభను నేటి నిర్మాత ఆర్.వి.రమణమూర్తి నిర్వహించారు. సాధారణంగా అటువంటి సభలో ఎవరైనా సరే అన్నీ తన పాటలే ఉండాలని కోరుకుంటారు. కానీ చలపతిరావు గారు అలా అనుకోలేదు. తన అభినందన సభకు వచ్చిన సంగీత దర్శకులు, గాయనీ గాయకులు అందరూ మరిచిపోలేని విధంగా ఆ సభ జరగాలని కోరుకున్నారు. ఆ ప్రకారమే జరిగింది కూడా! యస్.రాజేశ్వరరావు, యస్.హనుమంతరావు, మాస్టర్ వేణు, పెండ్యాల, సుసర్లదక్షిణామూర్తి, కె.వి.మహదేవన్, జి.కె. వెంకటేష్, రాజన్-నాగేంద్ర, సత్యం, చక్రవర్తి, బాలు, ఆనంద్, రమేష్, సుశీల, జానకి, వసంత, ఎల్లారీశ్వరి, రమోలా, షరావతి ఇంకా ఎందరో గ్రూప్ సింగర్స్ ఇలా స్టేజంతా నిండిపోయింది. వచ్చిన వారికి కన్నుల పండుగ... వేచిన వారికి వీనుల విందు... అదీ కొత్త రకంగా...

అదెలా అంటే... ఒక్కొక్క సంగీత దర్శకుడు స్టేజి మీదికి వచ్చి చలపతిరావు గారిని అభినందించి వెళ్ళాలి. అలా వచ్చినవారు తాము స్వరపరచగా హిట్ అయిన ఓ సినీ గీతాన్ని ఆ సభకు హాజరైన గాయనీ గాయకులతో పాడించి మరీ వెళ్లాలి.

అందులో ముఖ్యంగా అందర్నీ ఆకట్టుకున్నది -అలనాడు సుసర్ల దక్షిణామూర్తి సంగీత దర్శకత్వంలో లతా మంగేష్కర్ పాడిన 'నిదురపోరా తమ్ముడా' పాటని అదే సుసర్ల వారి నిర్వహణలో శ్రీమతి యస్.జానకి పాడడం.

ఆ సభకు హాజరైన వారెవ్వరూ మరచిపోలేని మధురానుభూతిని అందించిన చలపతి గారిని కొనియాడని వారులేరానాడు.




చెరుకుగడ ఏ వైపు నుంచి తిన్నా తీయదనంలో ఎటువంటి మార్పు ఎలా ఉండదో ' మాయాబజార్' గురించి ఎక్కడ చెప్పు కోవడం మెదలు పెట్టినా రసాస్వాదనకి భంగం ఉండదు.




అలాగే మాయాబజార్ గురించి మరో ఉదాహరణ కూడా చెప్పుకోవచ్చు. తలిదండ్రులకు ప్రదక్షిణ చేసిన వినాయకులవారు మొత్తం భూప్రదక్షిణ చేస్తున్న కుమార స్వామికి ఎక్కడ వెళితే అక్కడ అంతకన్నా ముందుగా చేరి ఎలా కనిపించాడో ఒక్క 'మాయాబజార్' ని ఆమూలాగ్రం అధ్యయనం చేసినవవారు తెలుగు సినిమాలో విలువల గురించి ఏ అంశం మీదైనా సాధికారంగా చెప్పాలనుకునేవారికి ముందుంటారు. అంతటి ఘనత కలిగిన 'మాయాబజార్' లోని పాటలలో గత సంచికలో వివరించిన 6 పాటలను మినహాయించగా ఈ సంచికలో మరో ఆరు.

భళి భళి భళి భళి దేవా
బాగున్నదయా నీ మాయా
బహు బాగున్నదయా నీ మాయా
ఒకరికి ఖేదం ఒకరికి మోదం
సకలం తెలిసిన నీకు వినోదం
నీవారెవరో పై వారెవరో
ఆ విధికైనను తెలియదయా ॥బాగున్నదయా॥
సుఖదు:ఖాలతో గుంజాటనపడు
లోకము నీ చెలగాటమయా
లీలలు మాయలు
నీ గుణకథలూ తెలిసినవారే ధన్యులయా ॥బాగున్నదయా॥



ఈ పాటలో సుభద్రాభిమన్యులుగా ఋష్యేంద్రమణి, అక్కినేని నాగేశ్వరరావు-వారు వెళ్ళే రథాన్ని తోలే దారుకునిగా  గాయకుడు మాధవపెద్ది సత్యం నటించారు. చారుకేశి రాగంపై ఆధారపడిన ఈ పాటను పాడింది కూడా మాధవపెద్ది సత్యమే! సాధారణంగా వేదాంతపరమైన గీతాలలో ఉండే జటిలమైన భాష లేకపోవటం, ఓవైపు అర్థం అవుతూనే మరోవైపు ఇందులో ఎంతో లోతైన అనుభవం ఉంది అని అనిపించేలా ఉండడం ఒక ఎత్తయితే-ఇది అందరికీ తెలిసినదే కదా అని అనుకునేటంత సామాన్యంగా ఉండడం మరొక ఎత్తు. ఈ పాట ఇవాళ్టికి సజీవంగా ఉండడానికి అసలైన కారణం ఇదే!

శశిరేఖ: నీ కోసమే నే జీవించునది
ఈ విరహములో ఈ నిరాశలో ॥నీ కోసమే॥
వెన్నెల కూడా చీకటియైనా
మనసున వెలుగే లేక పోయినా ॥నీ కోసమే॥

అభిమన్యుడు: విరహము కూడా సుఖమే కాదా
నిరతము చింతన మధురము కాదా ॥విరహము॥
వియోగ వేళల విరిసే ప్రేమల
విలువను కనలేవా
నీరూపమే నే ధ్యానించునది
నా హృదయములో నా మనస్సులో ॥నీ రూపమే॥

శశిరేఖ: హృదయము నీతో వెడలి పోయినా
మదిలో ఆశలు మాసిపోయినా
మన ప్రేమలనే మరిమరి తలచి
ప్రాణము నిలుపుకొని ॥నీ కోసమే॥

అభిమన్యుడు: మెలకువనైనా కలలోనైనా
కొలుతును నిన్నే ప్రణయ దేవిగా
లోకములన్నీ ఏకమె అయినా
ఇక నాదానమేగా ॥నీ రూపమే॥





ఈ పాటను ఘంటసాల, లీల ఆలపించగా-అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రి అభినయించారు. ఈపాట భాగీశ్వరి, చారుకేశి రాగాలలో స్వరపరచబడింది. హృదయము నీతో వెడలిపోయినా, మెలకువనైనా కలలో నైనా కొలుతును నిన్నే ప్రణయ దేవిగా అనే వాక్యాలకు చారుకేశి రాగాన్ని-మిగిలిన పాటకు భాగీశ్వరి రాగాన్ని ఉపయోగించారు. ఘంటసాల సంగీత దర్శకుడిగా అంతకు ముందు విడుదలయిన 'షావుకారు' చిత్రంలో 'ఎవరో ...వారే' పాటలో చారుకేశి రాగాన్ని ఉపయోగించిన పద్ధతి, తర్వాతి రోజుల్లో విడుదలయిన 'లవకుశ' చిత్రంలో 'శ్రీరామ సుగుణధామ రఘువంశ జలధిసోమా' పాటలోను, 'శ్రీసత్యనారాయణ వ్రత మహత్మ్యం' చిత్రంలో ఓం నమోనారాయణ' పాటలోను భాగీశ్వరి రాగాన్ని వాడుకున్న విధానం ఇవన్నీ ఆయా రాగాలలో వారి సృజనాత్మక సంచారానికి అద్దం పట్టేవే!

అక్షరాలను అమృతధారలుగా అన్వయించి రాసే పింగళి పాళి వెలువరించిన 'విరహము కూడా సుఖమే కాదా, నిరతము చింతన మధురము కాదా' లాంటి వాక్యాలు - మనుషుల్లో ప్రేమ తత్వం, తెలుగు సినీ గీతాలలో సాహితీస్పర్శ ఉన్నంతవరకూ అజరామరంగా ఉంటాయి.

1. దయచేయండీ దయచేయండీ
తమంత వారిక లేరండీ! తమంత వారిక లేరండీ!
అతి ధర్మాత్ములు అతి పుణ్యాత్ములు అతి ధీమంతులు మీరండీ
తగు కైవారం తగు సత్కారం
తగు మాత్రంగా గైకొండి
తమంత వారిక తమరండీ - తతంగమంతా తమకండి
హైహై వైవై కైకై గైగై జియ్యా....




2. పెండ్లికుమారా, రావయ్యా, మా భాగ్యంకొద్దీ దొరికావయ్యా
ముల్లోకాలను వెతికి తెచ్చిన అల్లుడవంటే నీవయ్యా
ముల్లోకాలను గాలించి తెచ్చిన అల్లుడవంటే నీవయ్యా
పల్లకి నిక దిగి రావయ్యా తతంగమంతా నీకయ్యా
ఈ తతంగమంతా నీకయ్యా





3. కిరీటాలు! కిరీటాలు! వజ్రాల కిరీటాలు! ధగధగ కిరీటాలు!
ధరించినంతనె తలలో మెరయును
బలే యోచనలు బ్రహ్మాండముగా
శిరస్త్రాణములు శిరోధార్యములు శిరోజ రక్షలు కిరీటాలివె
అందుకోండయ్యా దొరలు ముందుకు రండయ్యా
అందుకోండయ్యా దొరలు ముందుకు రండయ్యా





4. హారాలు - మణిహారాలు,
హారాలు - మణిహారాలు, పతకాలు - నవపతకాలు
మణిబంధాలు భుజబంధాలు అందాలకు అనుబంధాలు
వింత చీరెలూ - వింత ముసుగులూ
వింత చీరెలూ - వింత ముసుగులూ సంతోషాలకు సంబంధాలూ
అందుకోండమ్మా తల్లులు ముందుకు రండమ్మా
అందుకోండమ్మా తల్లులు ముందుకు రండమ్మా




5. రక్షలు రక్షలు పాదరక్షలు - నాట్యశిక్షలో బాలశిక్షలు
తొడిగినతోడనె - తోధిమి తోధిమి
అడుగువేయగనే - తైతక్క తైతక్క
తొడిగనతోడనె - తోధిమి తోధిమి
అడుగువేయగనే - తైతక్క తైతక్క
నేలమీదనిక నిలువనీయక కులాసగ మిము నటింపజేసే ॥రక్షలు॥





6. ఒకటే మా వయసూ ఓ రాజా ఒకటే మా సొగసూ
ఒకటే మా వయసూ ఓ రాజా ఒకటే మా సొగసూ
నయగారము నా కళరా వయ్యారము నా వలరా
నయగారము నా కళరా వయ్యారము నా వలరా ఒయ్
నేనే నీ జోడురా నేనే నీ ఈడురా వన్నెచిన్నె లెన్నరా ఓ రాజా
వన్నెచిన్నె లెన్నరా ఓ రాజా ॥ఒకటే॥
సరసతలో ఇది జాణరా రసికతలో ఇది రాణిరా,
సరసతలో ఇది జాణరా రసికతలో ఇది రాణిరా, ఒయ్
నిన్నే కోరితిరా నిన్నే చేరితిరా వన్నె చిన్నె లెన్నరా ఓ రాజా
వన్నె చిన్నె లెన్నరా ఓ రాజా ॥ఒకటే॥






ఈ పాటను ఫలానా ఫలానా వారు పాడారని గాని, ఫలానా ఫలానా వవారు నటించారని గాని విడివిడిగా పేర్కొనటం కష్టం. అయినా ఘంటసాల, మాధవపెద్ది సత్యం, లీల, సుశీల కంఠాలు ప్రముఖంగా వినిపిస్తాయి. ఇక నటీనటులంటారా అదంతా ఓ కౌరవసేన...! సంగీతం సాహిత్యం పోటీపడి సమతూకంలో తూగిన పాటలలో ఇదొకటి. అసలు ప్రయోగాన్ని 'పాట' అని అనకూడదు. 'భావరాగ సంపుటి' అనాలి.

ఈ ప్రయోగంలోని మొదటి రెండు చరణాలలో ప్రశంస వెనుక తొంగిచూసే వ్యంగ్యం ఓ ప్రత్యేకత! ఇక... కిరీటాలకు శిరోధార్యములు, శిరోజరక్షలు అని, హారాలకు అందాలకు అనుబంధాలని, చీరలకు సంతోషాలకు సంబంధాలని, పాద రక్షలకు నాట్య శిక్షలో బాలశిక్షలని వర్ణించటం ఇవన్నీ పింగళి వారి నైపుణ్యం-తెలుగువారికి పుణ్యం! హరికాంభజి రాగస్వరాల మీదనే ఈ స్వరరచన ఎక్కువగా నడిచినట్టు కనిపిస్తుంది. ఎక్కువమంది గాయనీ

గాయకులు పాడేటప్పుడు, గాత్ర ధర్మాన్ని బట్టి వాక్యాలను పంచుకోవటం లేదా పంచి ఇవ్వటం ఓ ప్రత్యేకమైన కళ! ఆ కళ ఈ పాటలో చాలా స్ఫుటంగా కనిపిస్తుంది. ఎందుకంటే ఘంటసాల వారి కంఠంలో పరుషాలు, సరళాలు, అనునాసికాలు మొదలైనవన్నీ తగిన రస స్పందనతో పలుకుతాయి. మాధవపెద్ది వారి కంఠంలో పరుషాలు మహాద్భుతంగా పలుకుతాయి. అందుకు ఉదాహరణ-తొడిగిన తోడనే తోధిమి తోధిమి-అని ఘంటసాల వారంటే-అడుగు వేయగనే తైతక్క తైతక్క-అని మాధవపెద్ది వారి చేత పలికించటం వల్ల అవి ఎంత బాగా పండాయో శ్రోతలకు అనుభవైక వేద్యమే!

మాయాశశి:

అహ నా పెళ్ళియంట ఓహోనా పెళ్ళియంట
అహ నా పెళ్ళంట ఓహోనా పెళ్ళంట
మీకు నాకు చెల్లంట లోకమెల్ల గోలంట
టాం టాం టాం ॥అహ నా॥
వీరాధి వీరులంట ధరణీ కుబేరులంట
భోరు భోరు మంటు మా పెళ్ళివారు వచ్చిరంట ॥వీరాధి॥
అబ్బ బ్బ బ్బ బ్బ బ్బ బ్బబ్బ బ్బో అహహ ॥అహ నా॥
బాలాకుమారి నంట చాలా సుకుమారినంట ॥బాలా॥
పెళ్ళికొడుకు నన్నుచూసి మురిసి మూర్ఛపోవునంట
అయ్య య్య య్య య్య య్య య్యయ య్యో అహహ ॥అహ నా॥
తాళికట్ట వచ్చునంట - తగిన సిగ్గు నాకంట తాళి కట్ట వచ్చునంట
పాదనిదపమ - మాపదపమగ తాళికట్ట వచ్చునంట
పపప్పద మమమ్మప గగగ్గామ రిగమప తాళికట్ట వచ్చునంట

ఘటోత్కచుడు:

తథోం థోం దొంత తథీం ధీం ధీంత
ధథోంత తధీంత అటుతంతాం ఇటు తంతాం
తంతాం తంతాం తంతాం సనిదప మగరిస
తాళికట్ట వచ్చునంట... అయ్... తాళికట్ట

మాయా శశి:

తాళికట్ట వచ్చునంట తగని సిగ్గు నాకంట
మేలిముసుగు చాటువేసి - దాగుడు మూతలాడునంట హ్హాహ్హాహ్హా

















ఈ పాటను సుశీల పాడేరు. మధ్యలో స్వరాల దగ్గిర ఘంటసాల కంఠం వినిపిస్తుంది. తెరపై సావిత్రి యస్వీరంగారావు, మరొకొంతమంది చెలికత్తెపాత్రధారులు అభినయించారు. ఈ పాటను సుశీల గానం చేసిన విధానంలో-పెళుసుదనంతో కూడిన వైవిధ్యం సూటిగా మనసులో నాటుకుపోతుంది. కథాపరంగా ఆలోచిస్తే-సౌకుమార్యం అలవర్చుకుంటున్న రాక్షసాంశకి అది తగినదేమోనని అనిపిస్తుంది కూడా! ఈ పాట మధ్యలో ఘంటసాల స్వరం వినిపించినా అది పాడింది మాధవపెద్ది సత్యమేనని ఇప్పటికీ అనుకుంటున్నవాళ్లున్నారు. ఆ క్రెడిట్ టోటల్‌గా మాధవపెద్దిదే అయినా ఆయనను స్ఫురింపచేస్తూ ఘంటసాల వారు ఇచ్చిన ఎక్స్‌ప్రెషన్లకు హ్యాట్సాఫ్ అనాల్సిందే! సాధారణంగా 'నభూతో నభవిష్యతి' అనే పద ప్రయోగాన్ని చేసేటప్పుడు "నభూతో... అను... న భవిష్యతి అని అనటానికి మనకు హక్కు లేదు. ఎంచేతంటే భవిష్యత్తులో ఇంతకంటే గొప్పది రావచ్చు కదా" అని అంటారు పెద్దలు. కానీ ఈ పాటకు సావిత్రి అభినయించిన విధం, ఆమె చూపించిన హావభావాలు, ఆ ముఖంలో పలికిన ఎక్స్‌ప్రెషన్లు ఇవన్నీ మనకు తెలియకుండానే మనచేత 'నభూతో నభవిష్యతి' అని పలికేట్టు చేస్తాయి. శంకరాభరణం, హరికాంభోజి రాగ స్వరాల మిశ్రమం ఈ పాటలో ఎక్కువగా కనబడుతుంది.

లక్ష్మణ కుమారుడు:
సుందరి నీవంటి దివ్య స్వరూపంబు
ఎందెందు వెదకిన లేదుకదా
ఎందెందు వెదికిన లేదు కదా
నీ అందచందాలింక నావేకదా
సుందరి ఓహో సుందరి అహ సుందరి
మాయాశశి: దూరం దూరం
లక్ష్మణ కుమారుడు:
దూరమెందుకే చెలియా వరియించి వచ్చిన
ఆర్యపుత్రుడనింక నేనెకదా ॥దూర॥
మన పెళ్ళివేడుకలింక రేపేగదా
మాయాశశి: రేపటిదాకా ఆగాలి
లక్ష్మణ కుమారుడు:
ఆగుమంచు సఖియ అరమర లెందుకే నీ సొగసులన్నీ నాకు నచ్చేగదా
నీ వగల నా విరహము హెచ్చేగదా
మాయా శశి: హెచ్చితే ఎలా? పెద్దలున్నారు
లక్ష్మణ కుమారుడు:
పెద్దలున్నారంటు హద్దులెందుకే రమణి
వద్దకు చేరిన పతినే కదా ॥పెద్ద॥
నీముద్దు ముచ్చటలింక నావే కదా ॥సుందరి॥



'సుందరి నీ వంటి' పాటను ఘంటసాల పాడగా మధ్యలో సావిత్రి స్వరం వినిపిస్తుంది. తెరపై రేలంగి, సావిత్రి, చెలికత్తె పాత్రధారిణి అభినయించారు. ఈ పాటను ఘంటసాల పాడిన పద్ధతి చిరస్మరణీయం. రేలంగికి ఘంటసాల ఎప్పుడు పాడినా తన ప్రత్యేకతను నిలబెట్టుకుంటూనే పాడేవారని మరోసారి నిరూపిస్తుందీపాట. ముఖ్యంగా-'పెద్దలున్నారంటూ హద్దులెందుకె రమణీ', తర్వాత సావిత్రి "ఆఁ?" అంటే తిరిగి "హాఁ!" అంటున్నప్పుడు-చివర్న "సుందరీ... సుందరీ...' ఎలుగెత్తి పిలుస్తూ, జీరతో కూడిన ఏడుపుని తన కంఠం ద్వారా అభినయించినప్పుడు ఘంటసాల వారి గానకళాభినయానికి జోహార్లు అర్పించకుండా ఉండలేం.

ఘటోత్కచుడు:
వివాహ భోజనంబు వింతైన వంటకంబు
వియ్యాల వారి విందు ఒహోహ్హోనాకె ముందు
అహహ్హ హహ్హ హహ్హ ॥3॥
ఔరౌర గారెలెల్ల అయ్యారె బూరెలెల్ల
ఓహ్హోరె అరిసెలెల్ల ఇవెల్ల నాకె చెల్ల ॥వివాహ॥
భళీరె లడ్డులందు వహ్‌ఫేణిపోణిలిందు
భలే జిలేబి ముందు ఇవెల్ల నాకె విందు ॥వివాహ॥
మఝ్ఝారె అప్పడాలు పులిహోర దప్పళాలు
వహ్వారె పాయసాలు ఇవెల్ల నాకె చాలు ॥వివాహ॥



ఈ పాటను మాధవ పెద్ది సత్యం పాడగా యస్వీరంగారావు అభినయించారు. ఘటోత్కచుని భీకరాకార ఆహార్యాలకు తగిన శరీరం యస్వీరంగారావుది అయితే అందుకు ఏ మాత్రం తగ్గని శారీరం (గళం) మాధవపెద్ది సత్యంది. 'వివాహ భోజనంబు' పాటను మాయాబజార్ తమిళ వెర్షన్ లో తిరుచ్చి లోకనాథన్ అనే గాయకుడు పాడగా అతని గొంతు పుండై మూడు రోజులు భోజనం చేయలేకపోయాడట. ఆ శారీరం ఈ శరీరానికి అంతగా నప్పింది కనుకనే 'వివాహ భోజనంబు' పాట ఈ నాటికీ మాధవపెద్ది కీర్తి కిరీటంలో కలికితురాయిగా ఒప్పింది. అందుకే అంత 'మంచి రాక్షసుడు' భాషించిన ఔరౌర, ఒహ్హోరే, భళిరే, మఝారే, వహ్వారే లాంటి ప్రశంసాత్మక పదాలు భాసించాయి. శహభాషనిపించాయి. ఉల్లాసానికి ఉత్కృష్ట నిర్వచనంలా ఈ పాట నిలిచి పోయింది. కనుకనే ప్రేక్షకులు కూడా ఆ బాణీలోపడి ఊగిపోయారే కాని ఆ ట్యూన్ పాశ్చాత్య ధోరణిలో ఉందన్న సంగతే పట్టించుకోవటం మానేశారు.

చివర్నగల ఈ మూడు పాటలలోను సమాంతరంగా చెప్పుకోదగ్గ అంశాలు కొన్ని వున్నాయి. అతి తక్కువ వ్యవధిలోనే ఈ మూడు పాటలు సినిమాలో వరసగా రావటం జరుగుతుంది. అయినా దేనికదే ఒక ప్రత్యేకతను నిలబెట్టుకుంటూ శ్రోతల్ని ప్రేక్షకులుగా చేసుకుంటూ, ప్రేక్షకులను నిరంతర వీక్షకులుగా మార్చేసుకుంటూ 'మాయాబజార్' సాధించిన ఘనవిజయానికి మూల స్థంభాలుగా నిలిచాయి. తర్వాత తరంలో వచ్చిన ఎన్నో చిత్రాల టైటిల్స్‌కి; 'అందాలరాముడు'లో 'సమూహ భోజనంబు' పాటకి, 'సీతారామయ్యగారి మనవరాలు'లో 'సుందరి నీవంటి స్వీటు స్వరూపము వేర్వేరు సెర్చిన నోయే కదా' పాటకి, 'మిష్టర్ పెళ్ళాం'లో 'ముల్లు పోయి కత్తి వచ్చే ఢాం ఢాం ఢాం' పాటకి మాయాబజార్‌లోని పాటలు ప్రేరణలుగా నిలిచిపోయాయంటే-ఆ ఘనత వాటిని తెలుగు జాతికి స్థిరాస్థిగా మలిచిన కె.వి.రెడ్డి, పింగళి, ఘంటసాల, నాగిరెడ్డి చక్రపాణి వంటి సృష్టికర్తలది, వాటిని తెరమీద ప్రతిఫలింపచేసిన ఆవిష్కర్తలది.

# మా అనుబంధం గట్టిపడింది అందువల్లే...



పరిచయాలు ఎప్పుడూనండి ఆడవాళ్లకి ఆడవాళ్ళకి పరిచయమయినపుడే అవి ఎక్కువగా నిలుస్తాయి. మగవాళ్ళతో పరిచయమయినపుడు డ్రాయింగ్ రూంకే పరిమితమయిపోతాయి. ఏ టీయో, కాఫీయో తాగి వెళ్ళిపోతారు. నాకసలు ఘంటసాల గారితో పరిచయం ఆయన భార్య ద్వారా అయింది. అప్పటికి ఆనందవాణిలో నేను "చంపకం - చెదపురుగులు" అనే నవల రాస్తుండే దాన్ని. ఆ నవల చదివి ఘంటసాల గారి భార్య నాకు ఉత్తరం రాశారు. ఆ ఉత్తరం రాసిన ఆవిడ ఎంత అమాయకమో నేను అంత అమాయకమే (ఇప్పుడు తెలివి మీరాననుకోండి). ఆ ఉత్తరం ఘంటసాల గారి భార్య దగ్గర నుంచి వచ్చిందని తెలియనంత అమాయకంగా ఉండేదాన్ని.

ఆ ఉత్తరం నాకు వచ్చేవేళకి మా ఇంట్లో త్రిపురనేని గోపిచంద్‌గారు ఉన్నారు.' నీకు విసనకర్ర నుంచి ఉత్తరం వచ్చిందమ్మా' అని అన్నారు. విసనకర్ర అంటే ఫ్యాననే విషయం తెలియనంత ఇన్నోసెంట్‌గా ఉండేదాన్ని. "ఇది ఘంటసాల గారి భార్య దగ్గర నుంచి వచ్చింది. ఘంటసాల గారి అడ్రసుపైన ఉంది నీకు తెలియలేదా" అని అన్నారు. సరే ఆ తర్వాత వాళ్ళింటికి నన్ను దసరా కొలువుకి పిలిచారు. మొట్టమొదటిసారి వాళ్ళింటికి నేను వెళ్ళాను. వెళ్ళేప్పటికి ఇంకా పేరంటాళ్లు రాలేదు. లేటయితే కష్టమవుతుందని కొంచెం ముందరగా ... అంటే 4-30 గంటల ప్రాంతంలో వెళ్ళాను. బొమ్మల కొలువు దగ్గర ఘంటసాల గారు హార్మోనియం పెట్టుకొని కూర్చొని ఉన్నారు. అప్పటికే ఆయన పెద్ద గొప్ప గాయకుడు. ఒక పాట పాడి వినిపించారు. ఇంతటి మహానుభావుడు, గొప్పమనిషి పాట వినిపించి "ఈ పాట బాగుందా" అని ఆయన అడిగినపుడు అది ఆయనలోని ఔన్నత్యం అని నాకు అప్పుడు అర్థం అవ్వలేదు. ఇప్పుడు అర్థమవుతోంది. కాని ఒక రకమైన అమాయకంతో, చిన్నతనంతో "బాగుందండి ఇంకో పాట పాడండి'' అన్నాను. ఆ పాట విలువ ఎన్నివేలో, ఎన్ని లక్షలో, ఎంత అమూల్యమైనదో తర్వాత తర్వాత నాకు తెలిసింది. అన్నిటికంటే విచిత్రమేమిటంటే నేనడిగితే ఆయన పాడారు, అది గొప్ప విషయం, ఆ మనిషిలోన ఉన్న గొప్పతనం. అలా అలా మాకు పరిచయం అయింది.

అప్పటికే ఘంటసాల గారికి డయాబెటిస్ ఉంది. ఆవిడకు పుల్కాలు చేయడం వచ్చేది కాదన్నమాట. "నీవు నేర్పరాదమ్మ నీవేమో పుస్తకాలు అవి రాస్తున్నావు కదా" అని నన్నడిగారు. సావిత్రి గారు మా ఇంటికి వచ్చినపుడు "ఎలా చేస్తారు మాలతి'' అని అడిగితే, నేను చేసి చూపించాను. ఆయన డైట్ గురించి నేను సావిత్రి డిస్కస్ చేసుకునేవాళ్ళం. ఆయనకు మొట్టమొదట నా మీద ఇష్టం కలిగింది, నమ్మకం కలిగింది అందువల్ల అన్నమాట. ఆయన ఫుడ్ హ్యాబిట్స్ గురించి చెబుతూవుంటే నేను ఇలా చేయి అలా చేయి అని సలహాలు చెబుతుండేదాన్ని.



ఘంటసాల గారికి చదువుమీద అంత అభిలాష ఉండేది కాదుకాని, ఆమెకు చాలా అభిలాష. సావిత్రిగారు విపరీతంగా చదివేవారు. శరత్ పుస్తకాలు అవీ ఆవిడ పట్టుకెళ్తూ ఉండేవారు, చదువుతుండేవారు. ఆయన పైకి ఒప్పుకోలేదు కాని అంతర్గతంగా తెలును తనకంటే తన భార్య తెలివైందని. ఆమె ఎక్కువ పుస్తకాలు చదవడం వల్ల తనకే లాభించిందనే విషయం ఆయన ఒప్పుకునేవారు కాదు. సహజంగా పురుషులు ఒప్పుకోరు. ఆవిడకి చాలా సహనం, ఆయన పట్ల విపరీతమైన ప్రేమ.

ఆయన ఆరోగ్యం పట్ల ఆవిడకున్నటువంటి శ్రద్ధ, అదీ చూసినపుడు మన పూర్వీకులు చెప్పినట్టు భర్తపై చూపించే ప్రేమ, శ్రద్ధ వల్ల చాలా వరకు భర్తను దాసోహం చేసుకోవచ్చనే విషయం నిజమైంది. వారి పిల్లలు కూడా తరచూ మా ఇంటికి వచ్చేవారు. వారిద్దరూ కూడా కలిసి మా ఇంటికి వస్తుండేవారు. మేం ఎన్నడు సంసార విషయాలు మాట్లాడే వాళ్ళం కాదు. "మీరు ఏ పాట పాడారు "అని నేను అడిగేదాన్ని కాదు. ఆయన చెప్పేవారు కాదు. ఎందుకంటే ఆయన ఆ విషయాలు మరచిపోవాలని మా ఇంటికి వచ్చినపుడు మేము ఆ విషయాలు ఎత్తేవాళ్ళం కాదు. ఇంతకీ మేము ఏం మాటాడుకునేవారమో తెలిస్తే మీరు నవ్వుతారు. చింతపండు ధరల గురించి, కందిపప్పు ధరల గురించి, ఊరగాయల గురించి మేము మాట్లాడుకునేవాళ్ళం. ఇలా ఓ కుటుంబంలో ఒక అక్కచెల్లెళ్లు, అన్న దమ్ములతో మాట్లాడినట్లు మాట్లాడటంవల్ల వాళ్ళింట్లో పిల్లలు కూడా నన్ను 'మాలత్తయ్య' అని పిలిచేవారు. ఇప్పటికి 'మాలత్తయ్య' అనే పిలుస్తారు. నేనే మేనత్తనని పిల్లలు అనుకునేవారు.

మా ఇల్లు బీచ్‌కి చాలా దగ్గర. వాళ్ళు బీచ్‌కెళ్ళి ఆ కాళ్ళలోని మన్ను, ఇసుకతో అలాగే వచ్చేవారు. ఆ ఇసుక, మన్ను ఇంచుమించు బస్తాడు వచ్చేది. అవి దులుపుకొని పిల్లలతోపాటు కూల్‌డ్రింకో లేక మంచినీళ్ళో తాగి వెళ్లేవారు. అప్పుడప్పుడు అటుకులు వేయించి పెట్టేదాన్ని. అవి తినేసి కబుర్లు చెప్పుకొని ఇంటికెళ్ళేవారు.

మా కుటుంబ పరిచయం నిలబడడానికి ముఖ్యకారణం ఏమిటంటే నేను సెన్సార్ బోర్డ్‌లో ఉన్నా సినిమాల జోలికి నేను వెళ్ళేదాన్ని కాదు. ఆయన మా రచనల జోలికి వచ్చేవారు కాదు. అందుచేత మేము కుటుంబ వ్యక్తుల్లా మాట్లాడు కోవడంవల్ల, అలా మసలు కోవడంవల్లే మా యొక్క పరిచయం, అనుబంధం చాలా గట్టిపడిందని నమ్మకం.

ఎందుకంటే ఈ రోజుల్లోలా - ఒక పత్రికలో పనిచేస్తుంటే మూడు రోజుల్లో మా కథ వేయండి అని వచ్చేవారు, సినిమాల్లో అయితే నాకోపాట ఇప్పించండి అని వచ్చేవాళ్ళు... అటువంటి పరిస్థితుల వల్ల పరిచయాలు బిజినెస్ లాంటివి అవుతాయి. కాని అలాంటిది మా కుటుంబంలో

ఏనాడులేదు . కేవలం కుటుంబం లెవెల్లోనే మా పరిచయం పెరగడంవల్ల ఆయన అనారోగ్యం గురించి మాట్లాడేవాళ్ళం. అక్కడక్కడ ప్రాబ్లమ్స్ గురించి మాట్లాడేవారాయన. వాళ్ళింట్లో సంగీతరావు వుండేవారు. వారు, మేము కూర్చొని సాహిత్యం గురించి మాట్లాడుకునేవాళ్ళం. ఆయన అందర్నీ 'బాబు' అనేవారు. ఇదేకాకుండా ఆయన అమెరికా వెళ్ళడానికి ముందు "నేను ఈ పాటలు, ఆ పాటలు పాడుతానమ్మా" అని అంటే నేను అన్నాను "ఘంటసాల గారూ! ఇక్కడ నుంచి ఒక తరం అక్కడికి వెళ్ళింది. ఉద్యోగ విజయాలు, ఆ పద్యాలు మీద వారికి మోజు ఉంటుంది. ఆ పద్యాలన్నీ కూడా జ్ఞాపకం చేసుకొని వెళ్ళండి" అని చెప్పాను. "ఎవ్వరు వింటారమ్మా!?" అన్నారు ఘంటసాల గారు. "మీకు తెలియదు మీరు నేర్చుకొని వెళ్ళండి" అన్నాను. నిజానికి ఆ పద్యాలే అక్కడ ఎక్కువ అడిగారట. వచ్చాక నాతో అన్నారు. పాటలకంటే అవే ఎక్కువ హిట్ అయినాయట. ఇలాంటి కొన్ని స్ట్రే ఇన్‌స్టెన్సెస్ వల్ల ఆయనకి నామీద చాలా గురి కుదిరింది. నన్ను చెల్లెలు, చెల్లెలు అనేవారు. మా చెల్లెలు ఇంటికెళ్లొస్తాను అనేవారు.

ఆయన మొదట్లో కొంచెం 'రా'గానే ఉండేవారు. సావిత్రిగారిలో ఉండేటటువంటి మృదుత్వం, సంస్కారం ఆయనకి కొంత కొంత తర్వాత అబ్బేయండి. ఎందుకంటే ఆయనకు ఇవన్నీ నేర్చుకునేటటువంటి టైం ఉండేది కాదు. ఎప్పుడూ... సంపాదన ,పాటలు...వీటివల్ల "ఏవండీ ఈ పుస్తకం బాగుంది" అని ఆవిడ అంటే,"అబ్బే నేను చదువలేను రాజీ(సావిత్రి గారిని ఆయన అలా పిలిచేవారు) చదివి వినిపించు" అనేవారు. కథ చెప్పమనే వారు.

వాళ్ళబ్బాయి వడుగుకి వెళ్ళాము. వాళ్ళింట్లో మేడ మీద గృహ ప్రవేశానికి వెళ్ళాం. నాకు ఒక్కటే విచారం అనిపించేది. పిల్లల పెళ్ళిళ్ళు ఒక్కటి కూడా ఆయన కళ్ళారా చూడలేదు. అది కూడా చూసుకొని ఉంటే బాగుండేది. ఇంతకంటే ఏం చెప్పలేనండి. ◆

# స్వరంజీవి, స్మరంజీవి, చిరంజీవి
# ఘంటసాల



**ప్రణవానికి ప్రాణమై - కవనానికి త్రాణమై**
**శ్రోతలకు ధ్యానమై - గాయకులకు ధ్యేయమై**
**తెలుగు సినీ సంగీతంతో మమేకమై**
**ప్రతి ఇంటా అనేకమైన ...**
**'గానమయ్య' ఘంటసాల జయంతి (డిసెంబరు 4) సందర్భంగా....**

- విజయనగరంలో వారాలు చేసుకుంటూ స్వరాలు నేర్చుకున్న వాడు
- అర్ధాకలితో 'జీవనసంగతులు' తెలుసుకున్నవాడు,
- సంగీతాన్ని ఔపోసన పట్టి తొలిముద్ద పెట్టిన 'అమ్మ' కాళ్ళకి దండం పెట్టినవాడు

## ఘంటసాల!!!
## ఘంటసాల లేకపోతే -

- కరుణశ్రీ పుష్పవిలాపానికి కన్నీరు తుడిచేవారెవరు?
- తెలుగు సినిమాల్లో పాటల పన్నీరు జల్లేదెవరు?
- 'రసికరాజ తగువారము కామా' అంటూ జయభేరి మ్రోగించి
- 'శివశంకరీ' అంటూ దర్బారీ కానడలో దరువు లేయించిన జగదేకవీరుడు ఘంటసాల!
- ఎన్ని మెట్లెక్కినా కానరాని ఏడు కొండలవాణ్ణి నడిరేయి ఏ ఝాములోనో తిరుమల శిఖరాలు దింపించిన గానం ఘంటసాలది!!

ఘంటసాల కంఠనాళాలకి చెరోపేరు పెట్టారు - ఒకదాని పేరు ఏయన్నార్ మరో దాని పేరు ఎన్టీయార్ - వాళ్ళు పాడుతుంటే ఈయన పెదాలాడించినట్లుండేది.

కోటి కోయిలల పెట్టు ఘంటసాల
వేయి వీణియల మెట్టు ఘంటసాల
వంద గంధర్వుల జట్టు ఘంటసాల
వెరసి సుస్వరానికి ఆయువుపట్టు ఘంటసాల

చాలా గొప్పగా పాడితే ఘంటసాలలా పాడేవు అనేవారు. అదీ ఆయన 'స్వరస్థానం'. 'ఘంటసాల వెంటేశ్వరరావు' పోయిన రోజున కంటనీరెట్టని తెలుగువాడు లేడు. పోతూ పోతూ భగవద్గీత సారాన్ని ధారోసి ఏడుకొండల వాడిలో ఐక్యమయిన 'వేంకటేశ్వరుడు ఘంటసాల.'

**- తనికెళ్ల భరణి**



ఆనంద్-మిలింద్

'హసం' 7వ సంచికలో ఆనంద్ - మిలింద్ గురించి ఇంటర్వ్యూ చదివినవారు ఏడాది తిరకుండా వారు తెలుగు చిత్రానికి కూడా సంగీతం అందిస్తారని ఊహించి వుండరు. ఒక వేళ ఊహించి వుంటే ఆ ఊహ నిజం కాబోతుంది. "ఇది..మా అశోగ్గాడి లవ్ స్టోరీ" అనే సినిమాకు ఈ సంగీత కారద్వయం స్వరకల్పన చేయబోతున్నారు. శివ బాలాజీ, కంచి కౌల్, శ్వేతలు ముఖ్యపాత్రధారులుగా సురేష్ కృష్ణ దర్శకుడుగా, నింబస్ సంస్థ నిర్మిస్తున్న ఈ చిత్రం ప్రస్తుతం పాటల చిత్రీకరణ జరుపుకుంటోంది. ప్రతిభావంతుడైన నాటి సంగీత దర్శకుడు చిత్రగుప్తతనయులైన ఆనంద్ - మిలింద్ "అబ్ ఆయేగా మజా"(1984)కు సినీరంగానికి పరిచయమయినా అంతకు ముందు టీవీ సీరియల్స్‌కు పనిచేసారు. 'ఖయామత్‌సే ఖయామత్' (1988) తర్వాత వీరి విజయ పరంపరకు అడ్డులేదు. పది సంవత్సరాలలో 100 చిత్రాలకు పైగా పనిచేసిన తర్వాత కొంత బ్రేక్ వచ్చి 'యేతెరాఘర్, యేమేరా ఘర్'తో సెకండ్ ఇన్నింగ్స్ ప్రారంభించారు. తెలుగు సీమ వీరినెలా ఆదరిస్తుందో చూడాలి.




హాసం

